# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.**






నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. ఇది దురదను, మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది.

నైసిల్ – చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4, శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

HTB-GLL/8808

## ఏప్రిల్ భారతిలో

★ **ఆకలి**

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

★ **కోపాన్ని జయించిన సౌశీల్యం**

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

**కథలు** చదవండి !

అంతే కాకుండా —

* ప్రాత స్వరూపం

శ్రీ మాదిరాజు రంగారావు

* భాషా విజ్ఞానం — కావ్య శాస్త్రం

డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

**వ్యాసాలు** చదవండి !

ఇంకా

* శిల్పభారతి
* వర్ణారమణి
* కామితార్థప్రదా !
* ఉష్ణోష్ణం — గ్రీష్మం
* అరుణకిరణం గుండెలో ...
* ఆర్ద్రత
* శరద్దీప్తి
* రాజహంస

**కవిత్వం** చదవండి !

ప్రతి నెలా కనీసం రెండు కథలూ, రెండు సీరియల్ నవలలూ **భారతి** లో చదువుకోవచ్చు !

ఇవి కాకుండా ఎన్నోరకాల వస్తువులమీద వ్యాసాలూ, చర్చలూ .........

సాహిత్య పత్రికలు ఆసక్తికరంగా ఉండవని ఎవరన్నారు ?

**భారతి** సాహిత్య మాసపత్రిక చదివితే మీకే తెలుస్తుంది ఈ అభిప్రాయం సరయినది కాదు — అని !

జనవరి **భారతి** ముఖచిత్రం బాసర సరస్వతి; ఫిబ్రవరి సంచిక అట్టమీద నర్తకి సుధారాణి రఘుపతి బొమ్మ వేశాము; మార్చి **భారతి** ముఖచిత్రం బుద్ధుడు; ఏప్రిల్ సంచిక ముఖచిత్రం ముఖలింగ శిల్పం ...

అట్టమీద వేసే బొమ్మల విషయంలో కూడా ఆకర్షణతో కూడిన వైవిధ్యాన్ని సాధించాలనే మా సంకల్పం !

ఇన్ని ఆకర్షణలలో మామూలుగా **భారతి లో** కనిపించే రచనలు మరుగున పడగలవన్న భయం అక్కరలేదు !

ఉత్తమ కవిత్వం, మంచి పరిశోధనా వ్యాసాలూ, ఉత్కంఠని పెంచే చర్చలూ ఎప్పటిలాగే **భారతి** చదివేవారికి అందుబాటులో ఉంటూనే ఉంటాయి !

ఇంకా వివరణ ఎందుకు ?

**భారతి** చందా దారునిగా చేరితే మీకే తెలియగలదు !

నేడే మీ ఏజెంటుని సంప్రదించండి !

# ఉత్తరాలు

### ముఖచిత్రం

నా అభిమాని అయిన నటి రాధ (30–3–84) ముఖచిత్రం వేసినందుకు ఎంతో సంతోషించినాము. అలాగే నందమూరి బాలకృష్ణ ముఖచిత్రం వేస్తారని ఆశిస్తున్నాను.

బి. వి. ఆర్. గౌడు, కర్నూలు.

* * *

30–3–1984 తేదీ వారపత్రికకు ముచ్చటయిన మోము, ఎంతో ఉత్సుకత కలిగించే ముఖారవిందము మా కన్నులకు ఆనందము గొలిపే విధముగా నుండే 'రాధ' ముఖచిత్రం ఆకర్షణీయత గొలిపినది. రాధగార్లకు నా లేఖ ద్వారా అభినందనాలు తెలుపుచున్నాను.

ఆనెం వెంకటరావు, వేణమ్మపేట.

* * *

నటి రాధ ముఖచిత్రం మా ఇంటిల్లిపాది మమ్మల్ని ఎంతో ఆకట్టుకొంది.

సి. హెచ్. ఉమామహేశ్వరరావు, కురుపాం.

### మీకో దణ్ణం

''మీకో దణ్ణం'' కథ చాల బాగుంది. పిల్లలు చేస్తున్న అల్లరిని సమర్థిస్తూ ఉన్న తల్లిదండ్రులుగా మల్లెపూవ్వు, సుభద్రాలను రచయిత బాగా చిత్రించారు.

జోగ ప్రసాద్‌యాదవ్, గొల్లలపాలెం.

### కల నిజమైతే

''కల నిజమైతే సీరియల్'' అపుడే అయిపోయింది అంటె చాల బాధగా వుంది. ముఖ్యముగా ముగింపు చాల బాగా నచ్చింది. విన్నకోట సుశీలదేవిగార్కి మా ధన్యవాదాలు.

కోత్తల ప్రసాదరావు, రాజమండ్రి.

### కథలు

అందాల తార జయసుధ ముఖచిత్రాన్ని ఎంతో అందంగా తీర్చిదిద్ది మాకందించి నందులకు కృతజ్ఞాభివందనలు. 'విజాయితీ ! నీ విలువెంత' కథ ఎంతో బాగుంది. సీతారామయ్య ల్లాంటి వ్యక్తులకు అన్యాయమే జరుగుతుంది ఇప్పుడు. వారు కూడా కాలం మారినట్లుగా మారలేకపోతున్నారు. 'కాకమ్మ కథ' కథ కూడా బాగా వుంది.

జి. వి. పటేల్, ఆదోని.

[66వ పేజీ చూడండి]

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
వాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 27–4–'84
శ్రీ రక్తాక్షినామ సం. చైత్ర బ. ద్వాదశి
సంపుటము 76 : సంచిక 33
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
విడి ప్రతి వెల రు. 1-80
ఆరు మాసాల చందా రు. 46-80
పోస్టులో ఏడాదిచందా రు. 101-40
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం. విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక



# పైవారమే ప్రారంభం!
## కొత్త శీర్షిక
# అద్భుత వ్యక్తులు!



బి. వి. పట్టాభిరామ్

ప్రతీ వ్యక్తిలోనూ పంచేంద్రియాలతో బాటు మరో అతీంద్రియశక్తి ఉంటుం దని చాలామంది నమ్మకం. పలువురు శాస్త్రజ్ఞులుకూడా ఈ విషయాన్ని నిర్ధారిం చారు. అందరికీ సమానంగా కాకపోయినా, అంతో ఇంతో తేడాతో ఈ శక్తి ఉంటుందని పేరా సైకాలజీ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈ శక్తులను గురించి పరిశోధన చేయడానికి ఈనాడు అమెరికా, ఇంగ్లండు, రష్యా దేశా లలో అత్యంత ఆధునిక లేబరటరీలు వెలిసాయి. వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన మేధావులు ఈ పరిశోధనలలో సత్ఫలితాలను రాబట్టు తున్నారు. ఒకప్పుడు కేవలం మూఢ నమ్మ కాలుగా కొట్టిపారేసిన అతీంద్రియ శక్తులు టెలీపతీ, క్లయర్ వాయన్స్, సైకోకైనసిస్, ప్రీకాగ్నిషన్, ప్రీమానిషన్, సైకోమెట్రీ లాంటి శక్తులకు ప్రపంచ వ్యాప్తంగా ఇపుడొక గుర్తింపు వచ్చింది.

అతీంద్రియ శక్తులు ఉన్నాయని బుజువుచేసి, నీటికి ప్రచారంచేసిన నిష్ణాతులు ఎందరో ఉన్నారు. వారిలో హ్యారీప్రైస్, జె. బి. రైన్, ఐన్‌స్టీన్, మార్క్‌ట్వైన్, వోల్ఫ్ మెస్సింగ్, పీటర్ హర్కోస్, ఎడ్గార్ కైసీలను ప్రముఖంగా పేర్కొనవచ్చు. వీరే కాక ఎందరో, మరెందరో శాస్త్రజ్ఞులు ఎన్నో పరిశోధనలుచేసి, ఈ శక్తులను గురించి ప్రజలకు తెలియచెప్పారు. కువిమర్శకులు ఎన్ని అడ్డంకులు కల్గించినప్పటికీ వెనుకాడక, దీక్షతో, పరిశ్రమతో తమ కృషి సాగించారు.

ఒక్క అతీంద్రియ శక్తుల రంగంలోనే కాకుండా గుప్త శాస్త్రాలుగా ముద్రపడిన ఇంద్రజాలం, హస్త సాముద్రికం, జ్యోతిష్యం, హిప్నాటిజం, న్యూమరాలజీ గురించికూడా ఎన్నో పరిశోధనలు జరిగాయి. మొదట్లో ఎందరో మహానుభావులు వీటిని ప్రచారంలోకి తీసుకురావటానికి ఎన్నో అవమానాలు భరించారు. అయినా పట్టువిడవక, దీక్షతో తాము చేయదలుచుకున్నది చేసి, చెప్పదలుచు కున్నది చెప్పి ఆ విద్యలకు ఒక గుర్తింపు తీసుక వచ్చారు.

చరిత్రలో కలిసిపోయిన ఇటువంటి ప్రముఖుల వివరాలను వచ్చేవారం నుంచి సచిత్రంగా "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"లో "అద్భుత వ్యక్తులు" శీర్షికద్వారా ప్రముఖ మెజీషియన్ – హిప్నాటిస్ట్ ప్రొఫెసర్ బి. వి. పట్టాభిరామ్ తెలియజేస్తారు. పట్టాభిరామ్ ఆంధ్ర వార పత్రిక పాఠకులకు సుపరిచితులే. ఇంతవరకు 3500 మేజిక్ – హిప్నాటిజం ప్రదర్శనలను భారతదేశంలోనూ, మలేషియా, సింగపూర్, థాయ్‌లెండ్ దేశాలలోఇచ్చి ప్రశంసలు అందుకున్నారు. "మాయా వినోదం" అనే పేరు గల రెండు మేజిక్ పుస్తకాలు రచించి ఎందరో ఔత్సాహికులకు ఇంద్రజాలంపై ఆసక్తి కలిగించారు. మేజిక్, హిప్నాటిజం, పారాసైకాలజీ, న్యూమరాలజీ గ్రంథాలను అధ్యయనం చేసి, ఆ విద్యలను ప్రచారంలోకి తెచ్చిన "అద్భుత వ్యక్తులు" వారు ఆ శక్తులను ఎలా కనుగొన్నారు, వారిలో ఆ స్పందనకు మూలమేమిటి, వాటిపై శాస్త్రీయ పరిశోధ నలు ఎలా చేసారు మొదలైన వివరాలు, తమ వ్యాస పరంపరలో సంగ్రహంగా రాస్తారు.

# ఎవరు ప్రధాని? లేదా కంప్యూటర్ కొట్టిన పేరు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

**భా**రతీయ రాజకీయాలు కంప్యూటర్ యుగంలోకి ప్రవేశించేశాయి. అందరూ అనుకున్నట్లే కాంగ్రెసు (ఇందిర) వాళ్ళు మొదటి కంప్యూటర్‌ని కొనేశారు. ఈ కంప్యూటర్ విపరీతంగా పనిచేస్తోందని వినికిడి—నల్లధనం ఎలాగ చెయ్యాలి? అబ్దుల్ రెహమాన్ అంతూలేని కోర్టుల బారినుంచి ఎలాగ రక్షించాలి? ఈ ప్రశ్నలకి సయితం సమాధానం చెప్పగలదు కాంగ్రెసు (ఇందిర) పార్టీ కంప్యూటర్. అసలు ఇది ఎక్కడ ఉంది? అదొక రహస్యం! కాని, ఢిల్లీలో రహస్యాలు దమ్మిడీకి డజను. అందుచేత, అనతికాలంలోనే నేను ఆ కంప్యూటర్ ఉన్నచోటు చేరుకోగలిగాను. ఆ కంప్యూటర్ ఎలాగ పనిచేస్తోందో కూడా తెలుసుకోగలిగాను. ఒకాయన దానిమీద అప్పటికే పనిచేస్తున్నాడు. చూడటానికి రాజనారాయణలాగే ఉన్నాడు. అయితే ఎన్నికలు దగ్గరకి వస్తూ ఉంటే అందరూ రాజనారాయణలలాగే కనపడుతూ ఉంటారు. ఒకవేళ ఆ మహానుభావుడు యధావిధిగా చెడగొట్టటానికి అక్కడ తయారయ్యాడా? అన్న అనుమానం కలిగింది. వెంటనే ఆ అనుమానాన్ని పక్కకి నెట్టేశాను.

నేను వెళ్ళేప్పటికి ఆ కంప్యూటర్ లోక్‌సభ ఎన్నికలకి అభ్యర్థుల జాబితాలు తయారు చేస్తోంది. మొత్తం 2000 మందిలోనూ 600 మందిని తీసుకోవాలి. గణన యంత్రానికి ఇది ఏమాత్రం పని? ఏ నియోజకవర్గంలో ఎవరు పనికివస్తారో చెప్పాలి ఆ కంప్యూటర్. ముందు మహారాష్ట్ర జాబితాని పరిశీలిస్తోంది.

మొదటి పేరు ఎవరిదనుకున్నారు? బాల్ ఠాకరేది!

"అయ్యో, మన జాబితాలో ఈ పేరు ఎలాగ వచ్చింది!" అని బాధపడ్డారు మూపనార్ ఆయనకి అభ్యర్థులని గురించి కొంత తెలుసు.

రాజీవ్‌గాంధీ ఏమీ మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు.

రెండో పేరు — దత్తా సామంత్!

"దత్తా సామంత్ మన పార్టీలో చేరినట్లు నాకు తెలీదే!" అన్నారు అంతూలే. ఆయనను ఈ కంప్యూటర్ పనిచెయ్యడం చూడటానికని ఒక రోజుకి జామీన్ ఇచ్చి తీసుకువచ్చారు. ఆయనా, కమలాపతి త్రిపాఠీ కూడా చెమటలు కక్కుతున్నారు. ఎయిర్ కండిషనింగ్ చెడిపోయింది—అందుకనే అన్నమాట.

"ఇది ఇలాగే పోతే శరద్ పవార్ కూడా మన జాబితాలోనే కనపడ్తాడు!" అన్నాడు మూపనార్. ఆయన అన్నంతపని జరిగింది. శరద్‌పవార్ పేరు రానే వచ్చింది.

"ఆపండి ఆ యంత్రాన్ని! ప్రతిపక్షాల వాళ్ళని తీసుకునే కంప్యూటర్ కూడా ఒక కంప్యూటరేనా?" అన్నారు అంతూలే. "మనకి మనుషులు తక్కువా ఏమిటి?"

"అదేకదా అసలు విషయం. గెలిచేవాళ్ల పేరులని తీస్తుంది ఈ కంప్యూటర్. వాళ్లని మన పార్టీ అభ్యర్థులుగా నుంచోమందామా!" అన్నారు రాజీవ్‌గాంధీ. "ఒక అఖిల భారత జాతీయ రాజకీయ పక్షం తయారుచేసుకోగలము! ఒకప్పుడు వీళ్లంతా మనకి దగ్గరగా ఉన్న వాళ్లే కదా? మళ్లీ మన అభ్యర్థులుగా నిలబెడదాము. స్వయంగా అడిగితే కాదంటారా?"

మహారాష్ట్ర వంతు అయింది. ఇక ఉత్తర ప్రదేశ్ తాలూకు పేర్లు వస్తున్నాయి. త్రిపాఠీ పేరు కనపడలేదు, కె. సి. పంత్ పేరు కనిపించలేదు. దినేష్‌సింగ్ పేరూ అగుపడలేదు. కాని చంద్రశేఖర్ ఉన్నాడు! [చంద్రశేఖర్ పాతకాంగ్రెస్‌వాడే కదా? అని రాజీవ్‌గాంధీ.] రాజనారాయణ పేరు కూడా కనిపించింది! వేడికి ఆగలేక నారాయణదత్ తివారీ బయటికి వెళ్లిపోయారు, తన గాంధీ టోపీతో విసురుకుంటూ. గాంధీ టోపీ ఆయన తప్ప ఇంకెవరూ పెట్టుకుని లేరు.

ఆశ్చర్యం! ఉత్తరప్రదేశ్ జాబితాలో శ్రీమతి గాంధీ కాని, రాజీవ్ కాని లేరు! "ఏమోనబ్బా నాకేమీ అర్థం కావటం లేదు!" అన్నారు మహారాష్ట్ర జాబితాలో తమ పేరు కనపడకపోయేప్పటికి శాలినీతాయి. అందరికీ ఉత్కంఠ దుర్భరంగా ఉంది. కంప్యూటర్ మాత్రం తన మానాన్న తాను పేర్లు కొట్టేస్తోంది. చివరికి ఢిల్లీ వంతు వచ్చింది.

తల్లీ, కొడుకూ ఇద్దరూ ఢిల్లీ నుంచే పోటీ చేస్తున్నారు.

సరే రాష్ట్రాల వారీగా జాబితాలని వేరు చేశారు. అంతూలేకి కచ్ నుంచి ఒక స్థానం కేటాయించి ఉంది. అసలు కచ్ ఎక్కడో అంతూలేకి సరిగ్గా తెలీదు. "స్మగ్లర్‌లు చాలా మంది అక్కడివాళ్లే" అని రాజీవ్‌గాంధీ అన్నారు. అలీబాగ్ నుంచి గెలిచిన మనిషిని అంతదూరం ఎందుకు తొయ్యాలిసివచ్చిందో మాత్రం ఎవరూ చెప్పలేకపోయారు.

[8వ పేజీ చూడండి]

# అంతరిక్ష యాత్రికుడైన తొలి భారతీయుడు రాకేష్

భారత సోవియట్ సంయుక్త అంతరిక్షయాత్ర ఫలితంగా స్క్వాడ్రన్ లీడర్ రాకేష్ శర్మ మన దేశపు తొలి అంతరిక్ష యాత్రికుడయాడు. అంతరిక్షంలోకి మానవులని పంపిన దేశాలలో భారతదేశం 14 వ స్థానాన్ని అందుకున్నది.

సోవియట్ యూనియన్‌లోని బైకొనూర్ అంతరిక్ష కేంద్రం నించి ఏప్రిల్ 3 సాయంత్రం 6–38 గం.లకి ప్రయోగింపబడిన సోయుజ్ టి–11 అంతరిక్ష నౌకలో రాకేష్ శర్మతో పాటు మరో ఇద్దరు సోవియట్ అంతరిక్ష యాత్రికులు రోదసిలోకి వెళ్లారు. సోయుజ్ 17 సార్లు భూ ప్రదక్షిణ చేసి 'శాంతిస్నేహ కక్ష్య' లో పరిభ్రమిస్తున్న అంతరిక్ష కేంద్రం సాల్యూట్–7తో అనుకున్న సమయానికి అనుసంధానం అయింది. అందులో ఉండి పరిశోధనలు చేస్తున్న మరో ముగ్గురు అంతరిక్ష యాత్రికులు వీరికి స్వాగతం పలికారు.

సాల్యూట్–7 లో శ్రీ రాకేష్ శర్మ వివిధ ప్రయోగాలు వారం రోజులపాటు నిర్వహించి ఏప్రిల్ 11 న తిరిగి భూమికి దిగివస్తారు. భారతదేశంలో కొత్తగా లభించగల ఖనిజ, చమురు నిక్షేపాలగూర్చి అన్వేషణ చేస్తారు. భారరహిత స్థితిలో మానవ శరీరానికి ఏర్పడే అస్వస్థతలకి యోగాసనాల ఉపయోగాన్ని గురించి పరిశోధిస్తారు..

ఈ సంయుక్త అంతరిక్షయాత్ర భారత సోవియట్ స్నేహబంధాన్ని మరింత బలపడేలా చేసింది. శాంతి కోసం జరిగే మరెన్నో సంయుక్త అంతరిక్ష ప్రయోగాలకిది నాంది పలికింది.

భారతదేశపు తొలి అంతరిక్ష యాత్రికునిగా ఘనత సంపాదించిన శ్రీ రాకేష్ 1949 లో పాటియాలాలో పుట్టారు. హైదరాబాదులో పెరిగి విద్యాభ్యాసం చేశారు. 1970 లో భారత విమాన దళంలో చేరి టెస్ట్ పైలెట్‌గా మంచి పేరు తెచ్చుకున్నారు. విమానదళంలో ఉద్యోగిని మధుని వివాహం చేసుకున్నారు. ఇప్పుడు వారికి కపిల్ అనే 11 ఏళ్ల కుమారుడు ఉన్నాడు. శ్రీ శర్మ తల్లిదండ్రులు శ్రీమతి తృప్తశర్మ, శ్రీ దేవేంద్రశర్మ హైదరాబాదులోనే ఉంటున్నారు. రాకేష్‌కి గ్రంథ పఠనం, సంగీతం, క్రికెట్, టెన్నిస్ అంటే ఆసక్తి ఉంది. భారతీయ సాంప్రదాయం పట్ల అచంచలమైన విశ్వాసం ఉంది. అంతరిక్ష యాత్రలో కూడా ఆయన గాయత్రీ మంత్రాన్ని మరిచిపోలేదు !

ప్రపంచ తొలి అంతరిక్ష యాత్రికుడు యూరీ గగారిన్ 1961 లో భారతదేశం వచ్చినప్పుడు భారత సోవియట్ సంయుక్త అంతరిక్ష యాత్రలు జరుగుతాయని చెప్పిన జోస్యం ఇప్పుడు నిజమైంది

ఈ యాత్రలో రాకేష్ సహచరులైన యూరీ మాల్షెషెవ్, గెన్నడి స్ట్రెకలోవ్‌లు అంతరిక్ష యాత్రానుభవంలో ఆరితేరినవారే

రాకేష్‌తోపాటు 18 మాసాల కఠిన శిక్షణ పొందిన మరో భారతీయుడు రవీష్ మల్‌హోత్రాకి తరువాత జరిగే సంయుక్త అంతరిక్ష యాత్రలో అవకాశం లభిస్తుంది

మొట్టమొదటి భారత అంతరిక్ష యాత్రికుడు రాకేష్ విజయవంతంగా రోదసిలో ప్రయోగాలు చేసి క్షేమంగా భూమికి తిరిగి రావాలని యావత్ భారత జాతి ఆకాంక్షిస్తున్నది (4-4-'84) ★


ప్రయోగానంతరం అంతరిక్షంలోకి దూసుకుపోతున్న సోయుజ్ టి–11

సోయుజ్ టి–11 లో అంతరిక్ష యాత్రికుడు రాకేష్‌శర్మ రోదసీలోకి వెళ్తున్నప్పటి చిత్రం


అంతరిక్ష యాత్రికులు యూరీ మాల్షెషెవ్, రాకేష్ శర్మ, గెన్నడీ స్ట్రెకలోవ్ బైకనూర్ అంతరిక్ష కేంద్రంలో ప్రయాణానికి ముందు జరిగిన పత్రికాగోష్ఠిలో పాల్గొన్నప్పటి చిత్రం.


# లోకం పోకడ- ఊమెన్















ప్రణబ్‌ముఖర్జీ తన పేరు కోసం ఎంత వెతికినా కనిపించలేదు "నాకు రాజ్యసభ టిక్కెట్టూ ఇవ్వలేదు, లోకసభ జాబితాలోనూ లేను!" అన్నారు ఆయన "అయితే నా సంగతి ఏమిటి?"

"పశ్చిమ బెంగాలు ముఖ్యమంత్రి మీరే!"

"మార్క్సిస్టు కావాలి కదా ముందు!" అన్నారు ముఖర్జీ.

"ఏమిటిదంతా? అంతూలేని అంతగా వెనకేసుకువచ్చాను పార్లమెంటులో, అంతర్జాతీయ ద్రవ్యనిధి వద్ద అప్పు తెచ్చాను, చివరికి నాకు జరిగిన సత్కారం ఇదా? బూటుకాలుతో తన్ని పంపించి వెయ్యటమా!" అని వెంకటరామన్.

అంతపని జరగలేదు కాని చంద్రశేఖర్‌లూ, స్వాములూ, గుజ్‌రాల్‌లూ ఉన్న జాబితాలో ముసలి నమ్మిన బంట్లకి స్థానం లేదు. ప్రణబ్ లాంటి పడుచు నమ్మిన బంట్లకీ స్థానం లేదనుకోండి.

ఇంతలో కంప్యూటర్ మళ్లీ పనిచెయ్యటం ప్రారంభించింది. ఎన్నికలకి తేదీ నిర్ణయిస్తోంది ఈసారి. ఈ నిర్ణయం ఇచ్చేందుకని గణన యంత్రానికి అన్ని రకాల సమాచారాన్ని ఇచ్చారు— ధరలూ, విదేశీ మారకం నిలవలూ, నోబెల్ శాంతి బహుమతి ప్రకటన వెలువడే రోజూ, జియా—ఉల్—హక్ ఢిల్లీ రాబోయే రోజూ, అమెథీకి మేనకా గాంధీ వచ్చే రోజూ వగయిరా వివరాలు.

"ఏమిటబ్బా ఇంకా తేదీ కొట్టదు!" అన్నారు భజన్‌లాల్ ఆయనకి ఈ కంప్యూటర్ చాలా వింతగా ఉంది సరిగ్గా ప్రోగ్రామ్ చేస్తే ఇది పాలు ఇవ్వగలదా, అని అడిగాడు కూడా ఆయన.

"తేదీ చాలా లేకపోతే వేళకూడా కావాలా, అని అడుగుతోంది!" అన్నీ కావాలన్నారు. "27 మే, రాత్రి 12.30" అంది కంప్యూటర్. అది నెహ్రూ వర్ధంతి రోజు.

ఇంకో ప్రశ్న మిగిలింది. భారతదేశానికి తరువాతి ప్రధానమంత్రి ఎవరు?

"నెహ్రూ" అన్న పేరు కాగితంమీద అచ్చు అయింది. "నెహ్రూ పేరు కల యువకుడు."

అందరి మొహాలమీదా చిరునవ్వులు చిందాయి. శ్రీమతి గాంధీ అప్పుడే మళ్లీ లోపలికి వచ్చారు రాజీవ్‌గాంధీ భుజం చుట్టూ చెయ్యివేసి మంచున్నారు.

కంప్యూటర్ మళ్లీ పనిచేస్తోంది.

నిదానంగా ఒక పేరు కొట్టింది :

"అరుణ్ నెహ్రూ"

ఆ తరువాత అంతా గందరగోళం. ఎవరో కంప్యూటర్ మీట నొక్కారు. అదికాస్తా తగలపడిపోయింది. ఎవరో తెలీలేదు.

గదిలో అరుణ్ నెహ్రూ లేదు. ★



# ఉద్యోగం

అంబటిపూడిలక్ష్మీరమణ

**"రామకృష్ణ, ఎం.ఏ.,**
**ఆంధ్రోపన్యాసకులు,**
**ప్రభుత్వకళాశాల."**

నేమ్ ప్లేట్ చూచి నా జేబులో నున్న విజిటింగ్ కార్డులోని అడ్రసుతో సరిపోల్చుకుని, నాకు కావలసిన, నేను రావలసిన అడ్రసు ఇదేనని ధృఢపరచుకొని, కాంపౌడ్‌వాల్ గేటు తెరుచుకొని లోపలికి వెళ్ళాను. వరండా గ్రిల్ డోర్ మూసివేసి ఉంది.

కాలింగ్‌బెల్ నొక్కుదామని చెయ్యి ఎత్తానో లేదో, లోపలి నుంచి గిన్నెలు, చెంబులు, తప్పాళాలు మొదలైన వాటితో కూర్చిన కర్ణపేయమైన సంగీతం వినిపించడంతో ఉలిక్కిపడి ఎత్తిన చెయ్యిదించి వీపు చరుచుకున్నాను. ఎంతో అనుభవజ్ఞుడైన సంగీత దర్శకుడైనా, ఆ ఇన్‌స్ట్రుమెంట్సుతో యింత గొప్ప సంగీతాన్ని అందించలేడేమోననిపించింది.

ఇంతలో ఒక నారీరత్నం గొంతు స్టీరియోఫోనిక్ సౌండ్‌ట్రాక్ నుండి వినిపించినంతగా, లయబద్ధంగా వినిపించసాగింది. "ఛీ... ఛీ... నేరకపోయి ఈయన్ని కట్టుకున్నాను. భార్యమాట కించిత్తయినా వింటాడన్న ఆశ లేదు గదా! ఇటువంటి మనిషని తెలిస్తే అసలీయన్ని పెళ్ళాడేదాన్నేకాదు. హుం...నాఖర్మ కొద్దీ చేసుకున్నాను."

ఇప్పుడర్థమైంది. ఇందాకటి ఆకర్ణపేయమైన సంగీతకర్త ఈ స్త్రీమూర్తి అయి వుంటుందని; మన రామకృష్ణగారి ధర్మపత్ని కూడా అయివుంటుందని.

"నేనేమన్నా మేడలడిగానా? మిద్దెలడిగానా? అసలు నా మాటంటేనే గిట్టదాయనకు. భార్య చెప్పినదాంట్లో నిజమేమయినా ఉందేమో ఆలోచించే అవసరమే లేనట్టుంటాడు. పోనీ, ఇరుగుపొరుగు వాళ్ళని చూచయినా బుద్ధి తెచ్చుకుంటాడేమోనంటే అదీలేదు. ఊఁ.. ఎన్నను కొని ఏం ప్రయోజనం? 'చేసుకున్నవారికి చేసుకున్నంత' అని ఊరికే అన్నారా పెద్దలు."

ఊపిరి పీల్చుకోవడానికా అన్నట్లు ఒక్క క్షణం ఆగిందావిడ. నాకిప్పుడర్థమయింది. మన ఆంధ్రోపన్యాసకులవారు తమ సహధర్మచారిణి యెడ కించిత్తు అపరాధం చేశారని. ఐతే, ఈ శర్షపరంపర ఆయన సమక్షంలో నేనా? లేక ఆయన బయటికెళ్ళిన తర్వాత ఆయనపై యీావిడకున్న ప్రేమానురాగాల్ని ఈ విధంగా ప్రదర్శిస్తున్నదా అన్న అనుమానం నా మస్తిష్కంలో పొడసూపింది. కానీ, అది తీరే మార్గం మాత్రం మృగ్యమైంది.

"అసలీయన్ని ఎలా పెంచారబ్బా ఈయన తల్లిదండ్రులు పెళ్ళయిన యీ మూడేళ్ళ నుంచి చెవిలో ఇల్లు కట్టుకుని జోరీగలాగా రొద పెడుతున్నాగానీ ఏమీ విననట్లే ఊరుకుంటారు గదా! పెళ్ళామంటే ఇంట్లో కూడు వండి పెట్టే మరమనిషి అని తప్పితే ఆయన బుర్రలో మరో అభిప్రాయంలేదు."

ఏమిటీ సస్పెన్స్? ఆదివారంగదా ఈ మహాశయుడు ఎక్కడికీ పోడుగదా అని భరోసాతో వచ్చానిక్కడికి కానీ, ఇదేం ఖర్మరా భగవంతుడా! ఈ రోజంతా కూర్చున్నా ఈ ఏకపాత్రాభినయం ముగిసేటట్లు లేదు. అసలీయన ఇంట్లో ఉన్నాడా? లేడా? అదేదో తేలిపోతే నేను నా మిగిలిన పనులు చూచుకుందామంటే అదే తెలియడంలేదు

"ఎన్ని మాటలన్నా నోరు విప్పి ఒక్క మాటయినా మాట్లాడుతాడేమో చూడు. కనీసం పెళ్ళాం మాటకు బదులు చెప్పాలన్న ధ్యాస కూడా లేకుండా ఎట్లా కూర్చున్నాడో కుడుంబిళ్ళలాగా."

విసురుగా ఆమె అన్న మాటలతో నా అనుమానం తీరిపోయింది. ఈ మహాశయుడు ఇంట్లోనే వున్నాడు. కాని ఆయన్ని కలవడమెలా అన్న సమస్యే తీరలేదు. ఏమాట కామాటే చెప్పాలి, భార్య విషయంలో ఈయన ఇంత కినుకు వహించడానికి కారణమేమై ఉంటుందో నాకైతే బోధపడలేదు నిజానికి

నేను కూడా ఆమెవైపే వకాల్తా పుచ్చుకొని, 'భార్యను సరిగా చూడండి' అని మన ఆంధ్రోప న్యాసకుల వారికి ఒక సలహా కూడా పారేద్దామను కున్నాను. నా ఉద్దేశంలో భార్యను నిర్లక్ష్యంచేసే మగాడు మనిషే కాదు.

పాపం ! ఆడది. మగవాణ్ణే నమ్ముకుని తల్లిని తండ్రిని, తోడబుట్టినవారిని, ఉన్న ఊరుని వదిలి వస్తుంది అటువంటి స్త్రీమూర్తికి, అటువంటి త్యాగశీలికి కనీస గౌరవమైనా యివ్వని మగవాణ్ణి చూస్తే నాకు వళ్లు మండు కొస్తుంది. చదువులేనివాడైతే సరే ! చదువు కున్నవాడేగదా ఈ ప్రబుద్ధుడు. ఆ మాత్రం కూడా తెలియదా ఈనకి. కొంతమంది ఎంత చదువు చదివినా విజ్ఞానాన్ని సంపాదించలేరు. ఈయన కూడా ఆ బాపతే లాగుంది. లేకపోతే ఆ యిల్లాలు అంతగా బాధపడాల్సిన అవసర మేముంటుంది ? 'ధర్మేచా— అర్థేచా—కామేచా— మోక్షేచా — నాతిచరామి' అని వేదమంత్రాలు చదువుతూ కన్యాదానం పుచ్చుకున్నవాడు, వాటిని అర్థంచేసుకునేంతవరకు చదువుకున్నవాడు ఈ విధంగా ప్రవర్తించాడంటే నిజంగా విచారించదగ్గ విషయం. ఇటువంటి మనిషినా ఆ సన్మాన సభలో 'ముఖ్య అతిథి'గా పిలుస్తున్నది. ఛీ...ఛీ... నామీద నాకే అసహ్యం వేసింది. ఆ ప్రయత్నాన్ని మానుకొని వెళితే కమిటీ మెంబర్ల ఆగ్రహానికి గురికావలసి వస్తుందేమో నన్న భయంతో ఊరుకున్నాను.

ఇంతలో, ఆమె డైరెక్టుగా కుండబద్ద లైనట్లు మాట్లాడ్డం ప్రారంభించింది. ''ఏమండీ ! మిమ్మల్నే చివరిసారిగా అడుగు తున్నాను చెప్పండి. ఆ ఉద్యోగంలో నన్ను జాయిన్ చేస్తారా లేదా ?''

హమ్మయ్య ! నాకు ఇప్పుడర్థమైందండీ ! ఈవిడ బాధ; ఈవిడేదో ఉద్యోగానికి దరఖాస్తు పంపి ఉంటుంది. ఆ ఉద్యోగం ఈవిడకు వచ్చి ఉంటుంది దానికి మన ఆంధ్రోపన్యాసకులవారు అంగీకార ముద్రవేసి ఉండరు.

''ఏమండీ ! నా మాట జాగ్రత్తగా వినండి. ఏదో చెబుతున్నానని త్రోసిపారెయ్యకండి. రోజు లెలా ఉన్నాయో మీకు తెలియంది కాదు. అన్ని వస్తువుల ధరలు మండిపోతున్నాయి. అంత మాత్రాన మనం పస్తులుంటున్నామని కాదు. నేనా ఉద్యోగంలో చేరి నాలుగురాళ్లు సంపాదిస్తే చన్నీళ్లకు వేన్నీళ్లు తోడు. ఈ రోజు మన మిద్దరమే కావచ్చు. రేపు మనకీ పిల్లలు పుడితే మీ కొచ్చే జీతం మన అవసరాలు తీర్చలేకపోతే, మనం మన పిల్లలు ఏమౌతామో ఒక్కసారి ఆలోచించండి. ఆ ఉద్దేశ్యంతోనే ఇన్ని మాటలు అన్నానుగాని, మిమ్మల్నేదో కించపరచాలని కానే కాదు. త్వరగా నిర్ణయం తీసుకోండి. రేపు ఉదయం పదిగంటలకల్లా ఆ ఉద్యోగంలో జాయిన్

# ఉద్యోగం

కావాలి. ఆ కంపెనీ చాలా పెద్దదండీ ! పైగా ఆ కంపెనీ డైరెక్టరు మా నాన్నగారికి స్నేహితుడు. కాబట్టే అన్ని విధాలా బాగుంటుంది. ప్లీజ్.''

ఆమె చెప్పినవన్నీ సబబుగానే ఉన్నాయని పించింది. మరి, మన ఆంధ్రోపన్యాసకులవారి అభిప్రాయమేమిటో ?

''రాధా !'' గంభీరంగా పలికింది ఆంధ్రో పన్యాసకులవారి కంఠం.

''నీవు చెప్పింది కాదనను. కాని, ఒక్క విషయం ఆలోచించు. నాకు వచ్చే జీతంతో మనం తృప్తిగా ఖర్చు చేయడమేగాక కొద్దో గొప్పో వెనకేయగలుగుతున్నాం. పైగా ధాన్యం యింటి నుండి వస్తోయిగదా ! ఇక నీవుకూడా ఉద్యోగం చేసి హైరానా పడవలసిన అవసరం ఏమిటి ? అంతమాత్రాన నేనేదో 'ఆడది ఉద్యోగం చేయ రాద'న్న వాదనని సమర్థిస్తున్నానని మాత్రం అనుకోకు. ఆడదికూడా ఉద్యోగం చెయ్యొచ్చు. ఎప్పుడో తెలుసా ? ఆమెకూడా ఉద్యోగంచేసి సంపాదిస్తేతప్ప కాపురం గడవదన్న పరిస్థితి ఉన్నప్పుడు. మనమెన్నో కాపురాలు చూస్తు న్నాము. భర్త తెచ్చే సంపాదన చాలక, భార్యకు సంపాదించే అర్హత, శక్తి లేక, ఒకవేళ ఉన్నా ఉద్యోగం దొరక్క, నెలలో కనీసం వారం రోజు లైనా పస్తులుంటున్న కాపురాలు ఎన్నోఉన్నాయి. అటువంటప్పుడు మనం అలాంటివారికి ఉద్యోగావ కాశాలు కల్పించడానికి ప్రయత్నించాలేతప్ప, మనకి అవకాశమున్నది గదా అని ఉద్యోగాలన్నీ మనమే భర్తీ చేస్తే, ఒకే కుటుంబంలో ఇద్దరు ముగ్గురు సంపాదిస్తుంటే, కొన్ని కుటుంబాలలో అసలు సంపాదించే వారే ఉండని పరిస్థితి కలుగుతున్నది. కొద్దోగొప్పో వెనకేయగలుగుతున్న నీకే ఉద్యోగం మీద ఇంత ఆపేక్ష ఉంటే అసలు తినడానికే తిండి లేక బాధపడుతున్న అనేకానేక మందికి ఉద్యోగం మీద ఎంత ఆశ, కోరిక ఉంటాయో ఒక్కసారి ఆలోచించు. ఐతే, 'ఎంత మంది ఆడవాళ్లు ఉద్యోగం చేయడం లేదు' అని నీవు అడగవచ్చు. కాని, అందరూ ఈ నిర్ణయానికి రావాలి. అత్యవసరమైతే తప్ప ఆడది ఉద్యోగం చేయకూడదు. దీన్ని మనం అవలంబిస్తే దేశంలో ఉన్న నిరుద్యోగ సమస్య కొంతవరకన్నా పరిష్క రింపబడుతుంది. అంతేగాని అన్ని విధాలా అన్నీ ఉన్న నీలాటివాళ్లే అన్ని ఉద్యోగాలకు తయారౌతూ ఉంటే ఇక నిరుద్యోగ సమస్య తీరడమనేది కేవలం కాగితాలమీదనే నిలిచి పోతుంది. నా ఉద్దేశ్యంలో తప్పని పరిస్థితులలో తప్ప స్త్రీలు ఉద్యోగాల్లో చేరరాదు. నీకు అంత పలుకుబడే ఉంటే మన యింటి ప్రక్కనే ఉన్న సరోజకు ఆ ఉద్యోగం యిప్పించు. పాపం ! తండ్రి లేదు. తమ్ముడు చదువుకుంటున్నాడు. ఆ పిల్ల డిగ్రీ వరకూ చదివినా ఉద్యోగం లేదు. వాళ్ల అమ్మ నలుగురి ఇళ్ళల్లో అవీ ఇవీ చేసి ఆ సంసారాన్ని యీడుస్తున్నది. వారానికి కనీసం రెండు రోజులైనా పస్తులుండటం మనం ఎరిగిన విషయమే ! అటువంటి కుటుం బానికి మనకు చేతనైన సహాయం చేయడానికి ప్రయత్నించాలేతప్ప, కేవలం మన సుఖమే మనం చూసుకోగూడదు. విద్యావంతులమైయుండీ స్వార్థపరులం కాకూడదు. మనం అలాంటి వాళ్ళకు సాయం చేస్తే వాళ్ళు సంతోషిస్తారు. దేవుడూ మెచ్చుతాడు. 'మానవసేవే మాధవసేవ' నాకు తెలిసింది, నాకు తోచింది చెప్పాను. అయినా, యిప్పటికీ నీకా ఉద్యోగం చేయాలనే ఉంటే నీ యిష్టాన్ని కాదనను. రేపేవెళ్ళి జాయిన్కా!''

గంగా ప్రవాహానికి ఆనకట్ట పడిందా అనిపించేటట్లు ఆగింది ఆ ఉపన్యాసవాహిని.

''ఏమండీ ! మీరు యింతటి ఉన్నతమయిన హృదయం గలవారని మీతో కాపురం చేసిన ఈ మూడేళ్ళలోనూ నేను గ్రహించలేకపోయాను. నేనెంత మూర్ఖురాలిని ! మీ వంటి అత్యున్నత మైన వ్యక్తికి భార్య కావడం నా పూర్వజన్మ సుకృతం. మీ వ్యక్తిత్వం తెలియక తొందర పాటుతో ఏవేవో మాటలు అన్నాను. నన్ను క్షమించండి. ప్రతి ఒక్కరూ మీలాగే ఆలోచిస్తే నిరుద్యోగ సమస్య తీరడమనేది కేవలం కాగితాల మీదనేకాదు నిజజీవితంలోనూ జరుగుతుంది నేను రేపే మా నాన్నగారితో మాట్లాడి ఆ ఉద్యోగం సరోజకే వచ్చేటట్లు చేస్తాను. నిజం !''

ఆమె మాటలు గాద్గదికంగా ఉన్నాయి. ఆయన చెప్పిన మాటలు నా చెవుల్లో యింకా మార్మోగుతున్నాయి. నిజంగా ఎంతటి వ్యక్తిత్వం! ఎంతటి ఉన్నత హృదయం ! ఆహ్వానిస్తే ఇటువంటి వారినే సభలకు ఆహ్వానించాలి. ఇంతటి గొప్ప వ్యక్తిని గురించి ఎంత నీచంగా ఆలోచించాను ! ఎంత తప్పు పనిచేశాను. స్వగతంలో అనుకుంటుండగానే అప్రయత్నంగా నా కళ్లు చెమ్మగిల్లాయి. ఇప్పుడు ధైర్యంగా కాలింగ్ బెల్ నొక్కాను. ★

## "దశమ గ్రహం"

నవధాన్యాలు దానం చేస్తే
నవగ్రహాలు శాంతిస్తాయ్.
కాళ్లు కడిగి కన్యాదానం చేసి
కనకవర్షం కురిపించినా
శాంతించటంలేదు ''దశమగ్రహం''

— కుమారి కె. వి సూర్యలక్ష్మి

# తెలుగు సంస్కృతికి వెలుగు తోరణం



తరతరాల తెలుగుజాతి సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించి, సాంస్కృతిక ఔన్నత్య సాధనకు దృఢమైన దీక్షతో శ్రీ ఎన్.టి. రామారావుగారి నాయకత్వాన ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగుజాతి ప్రాభవశ్రీలు నలుదిక్కులకు విస్తరించే నూతన పథకాలతో పలు కార్యక్రమాలను ప్రారంభించింది.

★ తెలుగు సాంస్కృతిక వైభవానికి దోహదం చేసే తెలుగు విశ్వవిద్యాలయం స్థాపన.
★ ప్రత్యేక కళా రూపాలను ప్రోత్సహించడానికి ఆధునిక ఆడిటోరియంతో కూడిన జిల్లా సాంస్కృతిక కేంద్రాల ఏర్పాటు.
★ జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో నృత్య, నాటక, సంగీత పోటీల నిర్వహణ,
★ వివిధ సాంస్కృతిక రంగాలలో యువ కళాకారులకు ఆర్థిక సహాయం
★ ఉపకార వేతనాల ద్వారా యువ కళాకారులకు నిష్ణాతులైన గురువుల వద్ద శిక్షణ.
★ రాష్ట్రస్థాయి గేయ, నాటిక విభాగం ఏర్పాటుకు కార్యక్రమాలు.
★ ప్రాచీన అముద్రిత గ్రంథాలను గుర్తించి ప్రచురించడం.
★ 1975 లో ప్రారంభించిన తరతరాల తెలుగుజాతి సంగ్రహాలయాన్ని సత్వరం పూర్తిచేయడానికి ఏర్పాట్లు.
★ మంగళ వాయిద్యమైన నాదస్వర వాయిద్యం అభివృద్ధికి సంగీత కళాశాలల్లో ప్రత్యేక విభాగాల ఏర్పాటు.
★ ప్రయివేటు సంగీత కళాశాలలకు గుర్తింపు, ఆర్థిక సహాయం.
★ పేద, వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం.
★ వివిధ అకాడమీల కార్యక్రమాల క్రమబద్ధీకరణ.
★ స్వచ్ఛంద సాంస్కృతిక సంస్థలకు ఆర్థిక సహాయం.
★ ప్రముఖ సంస్కృతి మూర్తులపేర ఉత్సవాల నిర్వహణ.
★ వివిధ రాష్ట్రాల మధ్య సాంస్కృతిక అవగాహన, సత్సంబంధాల పెంపుదలకు సాంస్కృతిక బృందాల పర్యటన నిర్వహణ.
★ హైదరాబాదులో బుద్ధ పూర్ణిమ ప్రాజెక్టువద్ద సిద్ధార్థుని, ఇరవై అయిదు ఇతర మహానుభావుల విగ్రహాల ప్రతిష్టాపన.

గతమెంతో ఘనకీర్తికల తెలుగుజాతి సాంస్కృతిక వైభవ పునరుద్ధరణకు
అంకితమైంది – ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

DIPR No. C8834/Advt II/C4/84 సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

సీరియల్

# తీరాగాని కదే తాళం

చక్కిలం విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"ఇప్పుడు చెప్పు. అసలు కారణం ఏమిటి ?"

జయంతి చాలాసేపు మాట్లాడలేదు.

మన్‌మోహన్‌కు కాబోయే భార్యగా తానక్కడికి వచ్చింది. జయంతిలాంటి అనాగరికురాలినీ, అవిద్యావంతురాలినీ, అంతస్తులేని దానినీ చేసుకోనని మన్‌మోహన్ ఖచ్చితంగా చెప్పాడు. ఆతర్వాత తానిక్కడుండటం అనవసరమే ననిపించింది అయితే కేవలం అతని అంగీకారం కోసమే కాచుకుని వున్నదానిలా అతనంగీకరించని వెంటనే వెళ్లిపోవడం చాలా పరిహాస్పదంగా వుంటుందనే ఉద్దేశంతో ఆగిపోయింది. కానీ పద్మిని తనమీద పగబట్టిన దానిలా అడుగడుగునా అవమానించాలని ప్రయత్నిస్తోంది. ఈ కుటుంబంలోని ఒక సభ్యురాలికి తన ఉనికి అంత ప్రాణసంకటంగా వున్నప్పుడు ఈ ఇంట్లో మొండిగా పడివుండటం చాలా అసహ్యంగా, అసభ్యంగా వుంటుంది.

తను ఇక్కడినుండి వెళ్ళిపోవడానికి, ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుంది. వెళ్ళిపోతూన్న తనకు సంగీత పాఠాలెందుకు ?

"నేను నేను మా ఊరు వెళ్ళిపోతాను అత్తయ్యా" అంది అతి నెమ్మదిగా.

"ఏమిటి ! ఏమిటంటున్నావ్ !" కళ్ళు పెద్దవిచేసి విచిత్రంగా చూసింది సుమిత్రమ్మ

జయంతి ఏమీ అనలేదు. సుమిత్రమ్మ పెట్టే చీవాట్లకోసం ఎదురుచూస్తూ తల వంచుకుని కూర్చుంది.

నిమ్మకు నీరెత్తినట్లు మౌనంగా కూర్చున్న జయంతిని చూసి సుమిత్రమ్మకు మండిపోయింది. ఆవేశాన్ని బలవంతాన అణచుకుంటున్న దానిలా పళ్లు బిగపట్టి అంది "నీకు...నీకు తెలుసా నీ వూరేదో ? అసలు నీవెవరో నీకు తెలుసా ? ఇంకోసారి 'మా ఊరు' అన్నావంటే..."

సుమిత్రమ్మ మాటలు పూర్తి కానేలేదు. మెట్లు దబదబ శబ్దం అయ్యేలా పద్మిని గబగబా దిగి వచ్చింది. ఆమె చేతిలో సూట్‌కేస్ వుంది ఆమె వెనకే హరికూడా దిగివచ్చాడు ఇద్దరూ హాల్లో కూర్చున్న వీళ్లవైపు చూడనుకూడా లేదు. బయటకు వెళ్ళి "డ్రైవర్, డ్రైవర్" అని కేకపెట్టింది పద్మిని.

ఆ సమయంలో డ్రైవర్ లేడు. రఘునాధరావుగారి కారు డ్రైవ్‌చేస్తూ వెళ్ళి వున్నాడు. బయటి వూళ్ళకు వెళ్ళినప్పుడు తప్ప ఎవరి కారు వాళ్లే డ్రైవ్ చేసుకోవడానికి ఇష్టపడటం వల్ల డ్రైవర్ ఒక్కడే వున్నాడు.

పద్మిని తన ఇంపాలా కారులో సూట్‌కేస్ పడేసి స్టీరింగ్ ముందు కూర్చుని స్టార్ట్ చేసింది.

చటుక్కున సుమిత్రమ్మ, జయంతి లేచి వరండాలోకి వచ్చారు. హరి పద్మినిని ఏదో బతిమాలుతున్నాడు. దిగిరమ్మని ప్రాధేయపడుతున్నాడు గద్దిస్తున్నాడు. పద్మిని అవేవి వినిపించుకోవటం లేదు కారు మూవ్ అయింది. కొన్ని అడుగులు కారుతోపాటే నడుస్తూ పద్మినికి ఏదో చెబుతూనే వున్న హరి ఇక లాభం లేదనుకుని స్పీడ్ పెరిగిన కారు డోర్ తెరచి లోపల కూర్చున్నాడు.

కారు రివ్వున ముందుకు వెళ్లిపోయింది.

"అయ్యో ! పాప ఇక్కడే వుండిపోయింది" అంది గాభరాగా జయంతి, అప్పుడే లోనుండి ఆయా తీసుకు వచ్చిన పాపను చూసి.

"అహంభావం ఆత్మీయతల్ని పెంచుకోనివ్వదు" పాపను జాలిగా చూస్తూ గొణిగింది సుమిత్రమ్మ.

జయంతి ఆయా చేతుల్లోంచి పాపను తీసుకుంది.

మరో రెండు గంటల్లోనే వార్త వచ్చింది. "సిటీ నుండి బయలుదేరిన ఓ ఇంపాలా కారు వూరి శివార్లు దాటిన రెండు కిలోమీటర్ల దూరంలో ఘోరమైన యాక్సిడెంట్‌కు గురి అయింది !"

## 13

హరి గదిలోకి అడుగుపెట్టింది జయంతి. అక్కడి దృశ్యం ఆ అమ్మాయి హృదయాన్ని కలిచి వేసింది.

హరి బాత్‌రూంకు వెళ్లాలని కాబోలు లేచి చేతుల్తో గాలిలో తడుముతూ నడవబోయి గది మధ్యనున్న సోఫా అడ్డు రాగా తూలి క్రింద పడ్డాడు.

జయంతి పరుగున వెళ్లి పట్టుకుంది.

తనను పట్టుకున్న జయంతి చేతిని తడిమి గాజులు తగలగా "ఎవరు? ఎవరూ ?" అన్నాడు కంగారుగా.

కన్నీళ్లను అదిమిపడ్తూ "నేను. జయంతిని" అంది.

"ఓహ్ !" అని జయంతి చేతిని వదిలించుకుని మంచం వైపు తడుముతూ వెళ్లాడు.

"మీరు ... బాత్‌రూంకు వెళ్లాలా ?" అడిగింది జయంతి.

బిడియంగా తల అడ్డంగా వూపాడు హరి.

"లేదు...అక్కర లేదు" అన్నాడు.

"ఫరవాలేదు. నేను తీసికెళ్తాను" అంది జయంతి, హరి దగ్గరగా వస్తూ.

మరేమీ అనలేదు హరి.

జయంతి హరిని బాత్‌రూంలో వదిలి తలుపు వేసింది. ఆమెకు కన్నీళ్లాగలేదు.

ఆ తర్వాత గంట లోపలే జయంతి నౌఖర్ల సహాయంతో గది మధ్యలోవున్న సోఫాలు, కుర్చీలు తీయించి వేసింది. బాత్‌రూంకు వెళ్లాలన్నా, చల్లగాలి కోసం బాల్కనీలోకి వెళ్లాలన్నా ఇప్పుడు హరికి అడ్డు తగిలే వేవీ లేవు.

* * *

ఏదో పని మీద మేడపైకి వెళ్ళిన జయంతి, హరి " రంగా, రంగా, ఒరేయ్ రంగా " అని కేకలు వేయటం విని హరి గదిలోకి పరిగెత్తింది.

హరి భోజనం చేస్తున్నాడు. అతనికి కొరబోయి నట్లుంది. నీళ్లకోసం చేతుల్తో

**జరిగిన కథ — 4 :** ప్రముఖ ఇండస్ట్రియలిస్ట్ రఘునాధరావుగారు జయంతిని తన ఇంటికి తీసుకొనివచ్చి, భార్య సుమిత్రకు పరిచయం చేస్తారు. ఆమె జయంతిని గుర్తిస్తుంది. తరువాత ఇంటిలోని సభ్యులకు ఒక్కొక్కరికి జయంతిని పరిచయం చేస్తారు. జయంతి మరునాడు ఒక్కొక్కరి గది పరిశీలిస్తూ మన్‌మోహన్ గదిలో అతని ఫోటోను చూస్తుంది వారం రోజుల్లో ఆ ఇంటికి పరిసరాలకి అలవాటు పడుతుంది జయంతి. జయంతిని కొత్త వంటమనిషి అన్నందుకు మన్‌మోహన్‌ను గట్టిగా కోప్పడుతుంది సుమిత్రమ్మ. గీత, జయంతి స్నేహంగా ఉండటం పద్మినికి నచ్చదు. పద్మిని తండ్రి తన తమ్ముడి కూతురుని మన్‌మోహన్‌కు చేసుకొమ్మని రఘునాధరావుగారిని అడుగగా ఆయన మనూకి జయంతితో సంబంధం స్థిరపడి నట్లు చెపుతారు. ఈ మాటవిని పద్మిని జయంతి విషయం తేల్చిచెప్పమని భర్తని నిలదీస్తుంది. గీతతో బజారుకెళ్లిన జయంతిని పద్మిని అవమానిస్తుంది. గీత బర్త్‌డే రోజు జయంతి పాడిన పాట విన్న సుమిత్రమ్మ జయంతిని సంగీతం మాస్టారు దగ్గిర సంగీతం నేర్చుకోమని చెపుతుంది. జయంతి తనకిపుడు సంగీతంమీద ఆసక్తి లేదని చెపుతుంది.

తడుముతున్నాడు. గట్టిగా దగ్గుతూ ఎడమ చేతితో తల మీద కొట్టుకుంటున్నాడు. అతని కళ్లలోకి నీళ్లు వచ్చాయి. ''రంగా, రంగా'' అని గట్టిగా పిలుస్తున్నాడు.

పరుగున వెళ్లి మూలనున్న స్టూల్ మీది కూజాలోని నీళ్లు గ్లాసులో వంచి అందించింది జయంతి. నీళ్లు తాగాడు హరి.

మణికట్టుతో కళ్లు తుడుచుకుంటూ ''ఎక్కడికి వెళ్లావురా ? నాకు కళ్లు లేవని తెలుసు కదా ? నీళ్లు పెట్టకుండాపోతే ఎలా ?'' అన్నాడు హరి.

''బావా'' అంది జయంతి బాధగా —

''ఓ ! జయంతీ, నీవా !''

రంగ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

రంగణ్ణి కేకలేసింది జయంతి.

''పోనీలే జయంతీ. నాకు ఏ ఒక్కటి అందుబాటులో లేకపోయినా కష్టమే. కానీ వాడికి ఎన్నని గుర్తుంటాయ్ ?'' వారించాడు హరి.

''వెళ్లు వెళ్లు'' అని కసిరింది జయంతి రంగణ్ణి.

హరి వారిస్తున్నా దగ్గరుండి అన్నీ వడ్డించింది. భోజనం పూర్తయ్యాక కుర్చీలోంచి లేపి మంచం దగ్గరకు నడిపించింది.

''నాకింకా ఏదెక్కడుందో, ఎంత దూరంలో వుందో అలవాటు కాలేదు'' అన్నాడు హరి మొహమాటంగా.

జయంతి గుండె బరువెక్కింది.

* * *

మేడ పైకి వెళ్తున్న జయంతికి సుమిత్రమ్మ నుండి పిలుపు వచ్చింది.

మంచం పక్కన వచ్చి నిలబడిన జయంతిని చూసి ''కూర్చో'' అంది సుమిత్రమ్మ.

జయంతి కూర్చుంది, పక్కనే వున్న కుర్చీలో.

జయంతి చేతిలోని కాలింగ్ బెల్ చూస్తూ ''అదెందుకు ? ఆ బెల్ పని చేస్తూనే వుందే !'' అంది సుమిత్రమ్మ.

''ఇది...ఇది...హరి బావగదిలోవుంచేందుకు బావ... బావ...''

నీరసంగా నవ్వుతూ అంది సుమిత్రమ్మ ''అర్థమైంది జయంతీ.''

ఆమె కళ్లలో పల్చటి నీటిపొర కదలాడింది.

''జయంతీ వాడెలా వున్నాడు ?''

యాక్సిడెంట్ జరిగినప్పటి నుండీ ఆమె ఆరోగ్యం పూర్తిగా దిగజారిపోయింది. కోడలి మరణం, కొడుకు అంధుడు కావటం— ఏ తల్లి గుండెలు ఆవిసిపోవు ?

''బావ కేమయింది అత్తయ్యా ? కళ్లు లేవన్న దొకటే లోపంగానీ ఆరోగ్యంగా ఆనందంగా వున్నారు.''

''నన్ను మభ్యపెట్టాలని చూడకు. కళ్లు లేని బ్రతుకు శూన్యమే కదా ? జయంతీ, మనూ ముందు హరి అందగాడు కాదని అనేవాళ్లు అందరూ. కానీ వాడి కళ్లు ఎప్పుడైనా పరిశీలనగా చూశావా నువ్వు ? కోటి కాంతులతో మణి దీపాల్లా వెలిగేవి. ఆ కళ్లు నవ్వేవి జయంతీ! వాడి సౌమ్యతకు, నచ్ఛలానికీ ప్రతీకలుగా ఎంత ప్రశాంతంగా వుండేవి ! కళ్లులేని నా కన్న తండ్రిని ఎలా చూడగలను జయంతీ ?'' సుమిత్రమ్మ నిగ్రహం కోల్పోయింది.

ఆ తల్లి హృదయావేదన జయంతిని కదిలించింది. ఎప్పుడూ గంభీరంగా, హుందాగా రాణిలా మసిలే సుమిత్రమ్మ, బేలలా అలా కుమిలి పోతూంటే జయంతికి చాలా బాధ అనిపించింది.

''ఊర్కోండత్తయ్యా. అక్క పోయినా మనకు బావయినా దక్కారు అందుకు సంతోషిద్దాం. కళ్లదేముంది ? ఏ లోటూ రాకుండా చూసుకోడానికి మనమంతా లేమూ ?'' అంది జయంతి.

''మనమంతా! ఎవరున్నారు అంతా ? కళ్ళు లేని నా బిడ్డను చూడడానికే నా గుండెలు మరిగి పోతున్నాయే ! ఇక ఈ అనారోగ్యంతో వాడికి నేను చేసే దేమిటి ? గీత పెళ్లి కావలసింది






కళారంజని (విజయవాడ) వారు ఇటీవల తుమ్మలపల్లి కళాక్షేత్రంలో ఏర్పాటు చేసిన నృత్య ప్రదర్శనలో తమిళనాడు రాజ నర్తకి కుమారి స్వర్ణముఖి భరతనాట్య ప్రదర్శన పలువురి ప్రశంసలని అందుకున్నది. ఒక అపురూపమైన నృత్య భంగిమలో నర్తకి స్వర్ణముఖిని చిత్రంలో చూడవచ్చు.

---

# ఈ రాగాని కదే తాళం

అది మాత్రం ఎన్నాళ్ళుంటుంది? ఉండిననాళ్ళయినా అన్నకు పరిచర్యలు చేసే శక్తి దానికి లేదు. చిన్నదీ, ఒక్కతీ అనీ దాన్నలా పెంచాను. మీ మామయ్య, మనూ మగవాళ్ళు. ఇక నా బిడ్డను చూసేదెవరు? వాడు.. వాడు... పనివాళ్ళ దయా దాక్షిణ్యాల పై..." సుమిత్రమ్మ కొంగు నోటికి అడ్డు పెట్టుకుని కుమిలిపోయింది.

"అదేమిటత్తయ్యా అలా అంటారు? నేను లేనూ?" నొచ్చుకుంది జయంతి.

బరువుగా నిట్టూర్చింది సుమిత్రమ్మ. "నీవు మాత్రం ఎన్నాళ్ళుంటావు జయంతీ? నీవు ఈ ఇంటి కోడలివవుతావనీ, కళకళలాడుతూ కడిమి చెట్టులా తిరుగుతూంటే చూడాలనీ ఎంతో ఆశించాను. మాకా అదృష్టం వుండొద్దూ? లేదు కాబట్టే వాడి బుద్ధి పెడదారిన "

"ఇప్పుడవన్నీ ఎందుకత్తయ్యా?" తల వంచుకుని అంది జయంతి.

"నిజమే అవకాశం లేనివాని గురించి ఆలోచించటం మూర్ఖత్వమే. ఆఁ, పాప ఎక్కడుంది?"

"పాలు పట్టి పడుకోబెట్టాను. నిద్ర పోతోంది."

"ఆయా ఏమైంది?"

"ఉంది. పాపకు విరేచనాలవుతున్నాయి. 'పాల సీసాలు సరిగ్గా కడగడం లేదేమో' అన్నారు డాక్టరు. అందుకని నేనే పాలుపట్టే పని తీసుకున్నాను."

నిట్టూర్చింది సుమిత్రమ్మ.

"దాని తల్లి నిన్ను ఆయాకంటే కనిష్టంగా చూసింది. దాని బిడ్డను నీవు కన్నతల్లిలా కనిపెడుతున్నావు."

"మీరిలా ప్రతిదానికీ నన్ను హెచ్చుచేయటం ఏమి బాగా లేదు. నన్ను పరాయిదాన్ని చేసి, పని చేసినందుకు నొచ్చుకుంటున్నారు" నెమ్మదిగా అంది జయంతి.

సుమిత్రమ్మకు కోపం పొంగులా వచ్చింది.

"ఏమిటన్నావ్? పరాయిదాన్ని చేశానా? ఔనౌను. నీవు పరాయిదానివే. వెళ్ళు వెళ్ళు" అంటూ కసిరింది.

లోలోపల నవ్వుకుంటూ ఇవతలకు వచ్చింది జయంతి.

## 14

పాప ఎంతకూ నిద్రపోలేదు, జయంతి పాపను భుజం మీద వేసుకుని బాల్కనీలో చల్ల గాలికి అటూ ఇటూ చాలాసేపు తిరిగింది.

పాపతల్లి బ్రతికి వుంటే కనీసం పాపను తాకనిచ్చేది కూడా కాదేమో! పద్మిని తనో చూరులో మెసలుతున్న పాములా ఎప్పుడెప్పుడు బయటికి తరుముదామన్నట్లుగా తారట్లాడి పోయింది. గొంగళి పురుగులా చీదరించుకుంది. ఆగర్భశత్రువులా మానసికంగా చిత్రహింసలు పెట్టాలని చూసింది. ఎన్నోసార్లు.. చాలాసార్లు హరి తననా బాధల్నించి రక్షించాడు. భార్య చేతలకు తను క్షమాపణలు చెప్పుకున్నాడు.

ఓసారి తను బాత్‌రూంలో స్నానం చేస్తోంది. తనకిచ్చిన గదిలో అటాచ్డ్ బాత్‌రూం లేదు. అందువల్ల తను పెరట్లో వున్న కామన్ బాత్‌రూంలో స్నానం చేసేది. ఆ బాత్‌రూంలో గుడ్డలు వేసుకునే రాడ్ విరిగిపోయింది. అందువల్ల బట్టలు తలుపుమీద వేసుకుని దాన్ని దగ్గరగా వుంచేది. ఆ రోజు స్నానం పూర్తి చేసి చూసే సరికి తలుపుమీద బట్టలు లేవు. తన గుండె ఆగినంత పనయింది. ఎవరు తీసి వుంటారు! ఎవరు తీసినా ఇప్పుడు తనెలా లోపలికి వెళ్ళాలి? వదలిన బట్టలు కట్టుకుందామంటే బకెట్లో అప్పుడే తడిపేసింది. ఆరుబయల్లో, బాత్‌రూం లోంచి పెరడంతా దాటుకుని ఇంట్లోకి వెళ్ళడం సాధ్యమయ్యే పనేనా? చాలాసేపు వేచివున్నా బయట అలికిడి కాలేదు. ఎవరూ రాలేదు. సిగ్గుతో, దుఃఖంతో తనకు మతిపోయినట్లయింది. చాలాసేపు చూసి "గీతా, గీతా, అత్తయ్యా" అంటూ పెద్దగా కేకలు పెట్టింది. "మంగమ్మా" అంటూ అరిచింది. ఏమయ్యారు వీళ్ళంతా? గీత, అత్తయ్య లేకపోవచ్చు. మంగమ్మ? "మంగమ్మా, మంగమ్మా" గొంతు చించుకుని అర్చింది తను. కాసేపటికి హరి గొంతు వినిపించింది. జయంతీ! ఎందుకలా కేకలు పెడుతున్నావ్? ఏం జరిగింది? బాత్‌రూంలో ఏమైనా జొరబడిందా? తలుపుతియ్ ముందు" అంటూ, ఆదుర్దాగా.

కేకలు పెట్టినందుకు తన్ను తానే తిట్టుకుంది. ఎంత ఘోరమైన పరిస్థితి. చల్లటి బాత్‌రూంలో దిగంబరంగా వున్నా ముచ్చెమటలు పోశాయి.

"జయంతీ! ఏమైంది! పలకవేం!" ఈసారి మరీ ఆదుర్దాగా.

తనకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది.

తన మౌనం హరికి మరీ కంగారు కలిగించినట్లుంది తలుపుమీద దబదబా బాదసాగేడు.

పద్మిని లాంటిది ఈ దృశ్యం చూస్తే..

తన గుండెలు దడదడలాడాయి

"ఏం లేదు. మరి... మరి... నా. బట్టలు..."

"ఆఁ, బట్టలు?"

"ఎవరో.. తీసికెళ్ళారు" బిడియంతో ప్రాణం పోయింది తనకు.

రెండు నిముషాలు నిశ్శబ్దం.

తర్వాత తలుపుమీద చిన్నగా తట్టిన శబ్దం.

తనకు తెలుసు.

తలుపు కొద్దిగా తెరిచింది.

హరి చీరె అందించాడు

"జయంతీ.. కుసంస్కారం ఇంట్లోని ఎవరిలో వున్నా ఆ తప్పు అందరిదీ. క్షమించు" వినీవినిపించకుండా వినిపించింది.

ఆ తర్వాత కొన్ని రుజువులు ఆధారంగా తెలిసింది గీత, అత్తయ్య ఇంట్లోలేని సమయంలో మంగమ్మను, రంగను హడావిడిగా బయటకు పంపించి పద్మిని ఈ పని చేసిందని!

ఇలాంటివి ఎన్నో! తన నవమానించే పనులు; తనను తరిమివేసే ప్రయత్నాలు! తనే మిగిలిపోయింది. ఆమే వెళ్ళిపోయింది. శాశ్వతంగా.

భారంగా నవ్వుకుంది జయంతి.

ఎప్పుడేం జరుగుతుందో, ఎందుకు జరుగుతుందో ఎవరూ ఊహించలేరు. తా నిక్కడకు వచ్చిననాడు తన గురి, గమ్యం మన్‌మోహన్. అతని కాబోయే భార్యగా అతని కోసం, అతని ఇల్లు అనుకుంటూ వచ్చింది. కానీ ఇక్కడికి వచ్చాక అతనికి తనేమీ కాదని తెలుసుకోవడానికి ఎన్నోనాళ్ళు పట్టలేదు. అభిమానంతో, అవమాన భారంతో తన గుండెలు చితికిపోయినా వున్న పాటున, అనుకున్న క్షణాన ఇక్కడినుండి వెళ్ళిపో లేక పోయింది. ముడి పడుతుందనుకున్న బంధం

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...

ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రోటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సీరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®
## పాలు వుండనే వున్నాయి




**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్
ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి
సిరిలాక్
పోస్టు బాక్సు నం 3 న్యూఢిల్లీ-110 008

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

విడిపోయినా అనుకోని అనుబంధాలు తనకాళ్ళకు సంకెళ్ళయి ఆగమంటున్నాయి

తల్లిలేని పాప, కళ్ళులేని బావ, ఆరోగ్యం లేని అత్తయ్య, మనశ్శాంతి లేని మావయ్య, అదుపులో పెట్టవలసిన ఆడపిల్ల గీత!

అనుకున్నవాడికి ఏమీ కాలేకపోయినా ఏమీ కాదనుకున్న వాళ్ళకు అన్నీ తానై వుండిపోవలసి వచ్చింది.

పాప నిద్రపోయి నట్లుంది.

పాపను నెమ్మదిగా పడుకోబెట్టి పక్కన తానూ పడుకుంది. ఆలోచనల మధ్య కళ్ళు ఎప్పుడు మూతపడ్డాయో! ఫోన్ మ్రోగుతోంటే వులికిపడి లేచింది జయంతి ఫోన్ అదేపనిగా మ్రోగుతోంది. బరువుగా వాలిపోతూన్న కను రెప్పలను బలవంతాన తెరచిపట్టి గబగబా క్రిందికి దిగివచ్చి ఫోన్ ఎత్తింది జయంతి.

వింటూన్న జయంతి ముఖం నల్లగా మాడి పోయింది. కళ్ళమీది నిద్ర పిట్టలా ఎగిరిపోయింది పెదిమలు వణకగా ఎడమ చేతితో గుండెలు పట్టుకుంది.

వినడం పూర్తయ్యాక రిసీవర్ హుక్ మీద పడేసి ప్రాణం వున్న బొమ్మలా గీత గదిలోకి పరిగెత్తింది.

జయంతి కుదిపి లేపుతోంటే బద్ధకంగా లేచి కూర్చుంది గీత.

విషయం చెప్పింది జయంతి.

కెవ్వున కేక పెట్టింది గీత.

గట్టిగా గీత నోరు అదిమి పట్టింది జయంతి

జయంతి చేతిని వదిలించుకుని కాళ్ళూ, చేతులూ, వణుకుతూండగా అంది గీత ''అమ్మకు, నాన్నకు చెబుదాం పద.''

''వద్దు గీతా. అసలే అత్తయ్య, మామయ్య గుండెలు పగిలి వున్నారు ఈ విషయం తెలిస్తే వాళ్ళు ..''

''మరేం చేద్దాం?'' గాభరగా అడిగింది గీత.

''మనం వెళ్దాం. అక్కడి పరిస్థితి చూసి ఆ తర్వాత నెమ్మదిగా చెబుదాం'' అంది జయంతి

తల వూపింది గీత.

ఇద్దరూ క్రిందికి దిగి వచ్చారు

మంగమ్మను, రంగాను లేపి ''మంగమ్మా పైన పాప నిద్రపోతోంది. జాగ్రత్త. మేము వచ్చేదాకా మేలుకునే వుండండి. అత్తయ్యగానీ, మామయ్య గానీ లేస్తే ఏమీ చెప్పకండి'' అని చెప్పింది జయంతి,

ఇద్దరూ బయటకు వచ్చారు.

''నీవు డ్రైవ్ చేయగలవు కదూ ?''

తల వూపింది గీత.

శబ్దం కాకుండా కారు బయటికి తీసి, వేగంగా ముందుకు పరిగెత్తించింది గీత.

కాసేపయ్యాక ''జయంతీ, నేను నెర్వస్‌గా ఫీలవుతున్నాను. యాక్సిడెంట్ చేస్తానేమోనని భయంగా వుంది'' అంది.

# ఈ రాగాని కదే తాళం

''కాసేపు కారాపు'' అంది జయంతి..

ఓ పక్కగా కారు ఆపు చేసింది గీత

''ఎందుకలా గాభరా పడ్తావ్? ఏదో ఫార్మల్‌గా తెలిపి వుంటారు గానీ మన మూహి స్తున్నంత ప్రమాదం ఏమి వుండదు. గాభరా పడకు. ఈ వేళప్పుడు టాక్సీలో వెళ్లడం మంచిది కాదని ఇలా రావలసి వచ్చింది కాస్త రిలాక్స్ అవు. ఫరవాలేదు. నెమ్మదిగా వెళదాం'' అంది జయంతి తను లోలోపల ఆదుర్దా పడుతూనే.

రెండు నిముషాల తర్వాతే ''ఫరవాలేదు వెళదాం పద'' అంటూ బయల్దేరదీసింది గీత.

ఇద్దరి బుగ్గల మీదా కన్నీళ్లు జారి పోతున్నాయి.

ఇప్పటికే అంధకారం నిండివున్న ఇంట్లో.

## 15

'శాంతి నర్సింగ్ హోం' లోకి కారు దూసుకు వచ్చింది. ఇద్దరూ లోనికి పరుగెత్తు కుంటూ వచ్చారు. వరండాలో ఓ అందమైన అమ్మాయి గాభరాగా పచార్లు చేస్తోంది. ఆమె నుదుటిమీద ఎడమవైపు చిన్న ప్లాస్టర్ చేసి వుంది. ఆ అమ్మాయి దగ్గరకు పరిగెత్తింది గీత.

''లీలా? అన్నయ్యకు ఏమైంది?'' ఏడుస్తూ అడిగింది.

''ఇద్దరం సెకండ్‌షో చూసి వస్తున్నాము. ఈ నర్సింగ్ హోం దరిదాపులో యాక్సిడెంట్ అయింది. నాకు నుదుట చిన్న గాయం అయింది. మన్‌మోహన్‌కు...''

### కర్మభూమి

చెయ్యని తప్పుకే
శిక్ష పొందినవారు
లోకాని కెదురీద
దలిచేరయా!

తప్పు చేసీ కూడ
తప్పించుకొనువారు
సుఖజీవనము గడుపు
తున్నారయా!

అటు యిటూ కాకుండ
మధ్య తరగతివారు
ఒదిగొదుగుతూ బతుకు
తున్నారయా!

పెట్టి పుట్టిరి – వారు!
వీరికింతే రాత !!
కర్మభూమిని తత్త్వ
మింతేనయా!

— లతిక

''ఆ? అన్నయ్యకు ?'' తొందరచేసింది గీత..

''బలమైన గాయాలు తగిలాయి. డాక్టర్ లోపల ... '' ఆ అమ్మాయి కళ్లలోనూ నీళ్ళూరాయి.

తలుపులు తెర్చుకుని డాక్టరు వచ్చాడు.

''రక్తం చాలా పోయింది. అర్జంటుగా రక్తం ఎక్కించాలి. బ్లడ్ బ్యాంక్‌లో అతని గ్రూప్ బ్లడ్ లేదు'' గాభరాగా అన్నాడు డాక్టర్.

గీత, లీల ఏమీ తోచనివాళ్లలా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

''డాక్టర్ నా రక్తం సరిపోతుందేమో చూడండి'' ముందుకు వచ్చింది జయంతి.

''ఓ. కే కం ఇన్‌సైడ్'' డాక్టర్ లోపలకు పరిగెత్తాడు

*   *   *

జయంతి పళ్ళుబుట్ట, ఫ్లాస్క్ తీసుకుని వచ్చేసరికి మన్‌మోహన్‌కు తెలివివచ్చి తేలిగ్గా వున్నాడు. అతనికి డాక్టర్ ద్వారా జరిగిన విష యాలన్నీ తెలిశాయి

గదిలోకి అడుగుపెట్టిన జయంతి తెలివి లోనే వుండి తనవైపు చూపుతిప్పిన మన్ మోహన్‌ను చూసి తడబడింది. ఒక్కక్షణం రెండు కాళ్ళూ ఒకచోట ఆగిపోయినా వెంటనే ముందుకు వచ్చి బుట్ట, ఫ్లాస్క్ కబోర్డ్ మీద పెట్టి మంచం పక్కనున్న కుర్చీని మరికొంచెం దూరం జరుపుకుని మౌనంగా కూర్చుంది

కళ్ళువాల్చుకుని చేతివేళ్ళను చూసుకుంటూ కూర్చున్న జయంతిని చూశాడు మన్‌మోహన్.

చూసీ చూడనట్లుగా చాలాసార్లు చూశాడు గానీ ఎన్నడూ ఇంత పరిశీలనగా జయంతిని చూడలేదు మన్‌మోహన్.

నల్ల చందనం గిన్నెలో తీసిపెట్టిన తాజా గంధంలా వుంది జయంతి ముఖం. చుట్టూ రేగి అలుముకున్న జుట్టు నడుమ విరామం లేని పనివల్ల కాబోలు బాగా చిక్కి మరీ నాజూకుగా కనిపిస్తోంది జయంతి. గంధం గిన్నెలో పార పాటున పడిన ఎర్రకుంకుమ రజనులా తడి పెదిమలు కొద్దిగా కంపిస్తున్నాయి వానిని దొండ పండనుకుందేమో ఆ చిలుక ముక్కు మరీ క్రిందకి సాగింది. ఎర్రవారిన ఆ కంటికొసలు నవ పారి జాతాలను మరిపిస్తూంటే వాటిపై వాలిన తుమ్మెదల్లా కనురెప్పలు రెపరెప లాడుతున్నాయి.

కొనదేలిన గెడ్డం, దానిమీద చిన్న నొక్కు అందాన్ని దాచుకున్న గుప్తనిధిలా వుంది! తెల్లగా పొడలు పొడలుగా పైకి సాగిన మెడ చుట్టూ, మెరుపుమ అంచుగా చేసుకున్న నీలి ఆకాశం లాంటి పైట చుట్టుకుంది.

'జయంతి మరీ అందమైంది' అనిపించింది మన్‌మోహన్‌కు.

''జయంతీ'' జీరవోయిన గొంతుతో పిలిచాడు మనమోహన్.

ఉలికిపడి చూసింది జయంతి.

మన్‌మోహన్ మొదటిసారిగా తనను పేరు

పెట్టి పిలుస్తూంటే ఏదోలా అనిపించింది ఆ అమ్మాయికి.

"నేను నిన్ను చాలా అవమానించాను. అయినా ..." పూర్తి చేయలేకపోయాడు మన్‌మోహన్. అతనికి సిగ్గుగా వుంది.

"రంగా వుండాలి ఏమయ్యాడో..." అంది ప్రక్కలకు చూస్తూ.

"ఇప్పుడే అలా బయటికి వెళ్లాడు."

"ఇక్కడే వుండమన్నాను" కొంచెం అసహనంగా అంది జయంతి.

"నేను చేసిన అవమానానికి ..." మన్‌మోహన్.

"పళ్లరసం ఇవ్వనా ?"

"ఊహూ. నిజానికి ఆ అవమానం ..."

గొంతు పెగుల్చుకుని అంది జయంతి "అందులో అవమానం ఏముంది ? పెద్దవాళ్లకు ఇష్టమైనంత మాత్రాన మీకూ ఇష్టం కావాలని ఎక్కడుంది ?"

"కానీ ..."

"నాకు అయిష్టమైతే నేనైనా మీలాగే చెప్పి వుండేదాన్ని."

"అంటే ...!"

కంగారు పడింది జయంతి. "మీకు ఒంట్లో కులాసాగా వుందా ?" అని అడిగింది గబగబా

"ఆ. నీవు ప్రాణదానం చేశావుగా."

"ప్రాణదానం చేసింది డాక్టరు."

"సమయానికి నీవు రక్తం ఇవ్వకపోయి వుంటే డాక్టరైనా ఏమీ చేయగలిగి వుండేవారు కాదు."

"ఆ సమయానికి నా స్థానంలో ఎవరున్నా అంతే చేస్తారు."

"ఆ సమయానికి చాలామందే వున్నారు" పేలవంగా నవ్వుతూ అన్నాడు మన్‌మోహన్.

"వాళ్లు భయంతో గుండె చెదిరివున్నారు రాయిలా గట్టిగా వున్నది నేను మాత్రమే."

"ఏమైనా... కృతజ్ఞతలు చెప్పడానికి కూడా నేను సిగ్గుపడుతున్నాను."

"కృతజ్ఞతలు చెప్పవలసినంత గొప్ప పని నేనేమీ చేయలేదు. సిగ్గుపడవలసినంత నేరం మీరూ చేయలేదు." జయంతి అంది.

డాక్టర్ గదిలోకి వచ్చారు. జయంతి లేచి నిలబడింది. డాక్టర్ జయంతి కేసి నవ్వుతూ చూసి "మనూ, సమయానికి ఈ అమ్మాయి రక్తం ఇవ్వబట్టి బ్రతికిపోయావోయ్. నీ గర్ల్ ఫ్రెండ్ – అదే స్కూటర్‌మీద ఎక్కించుకు వచ్చావే ఆ అమ్మాయి–కనీసం మాటవరసకైనా ఏమీ అనలేదు" అన్నారు.

మన్‌మోహన్ ముఖం తెల్లగా పాలిపోయింది.

జయంతి చటుక్కున లేచి నిలబడి "వెళ్లొస్తాను. గీత వస్తుంది" అనేసి తడబడే అడుగులతో బయటకు వచ్చేసింది.

(ఇంకా వుంది)

# వ్యక్తిగతం



రాజస్థాన్‌నుంచి రాజ్యసభకి ఇండిపెండెంటు అభ్యర్థిగా ఘనంగా గెలిచిన ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ కె కె బిర్లా...



బ్రయాన్ డేవిడ్ జోసెఫ్‌సన్ నోబెల్ బహుమతి గ్రహీత. ఈయన కేంబ్రిడ్జ విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్రంలో అధ్యాపకులు. ఆయన ఇటీవలే బొంబాయి వచ్చినప్పుడు తమకి వేదాంతం, ధ్యానం, సాంఖ్యం – ఇవంటే చాలా ఇష్టం అని చెప్పారు...



సోవియెట్ యూనియన్‌లో ఆర్చి బిషప్‌గా ఉంటున్న క్రయిస్తవ మతాధిపతి శ్రీ వ్లాడిమిర్ కోట్లియరోవ్‌ని ఇటీవలే కలకత్తాలో రామకృష్ణమిషన్ యొక్క సాంస్కృతిక విభాగంవారూ, ముస్లిమ్ ఇన్‌స్టిట్యూట్ వారూ సత్కరించారు



జనాబ్ షేక్ అబ్దాలయేవ్ సోవియెట్ యూనియన్‌లోని మధ్య ఆసియా దేశాల మహమ్మదీయ సంస్థలకి ఉపాధ్యక్షులు ఇటీవలే కలకత్తా వచ్చారు. అక్కడ ఆయనకి క్రయిస్తవ మతాధిపతి శ్రీ కోట్లియరోవ్‌కి లభించినట్లే సన్మానం లభించింది



ఐర్‌లాండ్ విప్లవ సేన నాయకుడూ, దౌర్జన్యవాదీ శ్రీ డోమినిక్‌మెక్ గ్లించీని ఇటీవలే పోలీసులు అరెస్టు చేశారు...



# వారఫలం

27-4-1984 శుక్రవారం మొదలు 3-5-1984 గురువారం వరకు

♈ మేషం: అనుకొన్న విధాన వ్యాపారం వ్యవహారాలు సర్దుబాటు చేసికొంటారు. నూతన వ్యాపారం మంచి ఫలితాన్ని అందిస్తుంది. అప్రయత్నంగా ఆదాయం అందుకొంటారు. స్త్రీలకు: వృత్తి యందు అధికాదాయ మున్నది.

♉ వృషభం: కోర్టు వ్యవహారాలందు కొంత విశ్రాంతి చిక్కుతుంది. హడావుడి సద్దుమణగుతుంది. ఆశించిన వ్యవహారం సుగమం అవుతుంది. ఉద్యోగ రీత్యా చేసిన యత్నాలు లాభదాయకాలు. వారమంతా ఏదో పోగొట్టుకొన్న వారిలాగు బాధపడుతారు. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహింపునకు రాగలవు.

♊ మిధునం: ఆరోగ్య మందు కొందరకు లోపం కనిపిస్తుంది. స్థితియందు కొంత పెంపు కనిపిస్తుంది. రాజకీయంగా మేలుసంభవం. లాభదాయకమైన వారంగా గ్రహించాలి. నూతన మిత్రులు దాపునకు రాగలరు స్త్రీలకు: ఉద్యోగమందు పెంపు లభ్యం.

♋ కర్కాటుకం: దూర ప్రాంతాలకు వ్యాపార కారణంగా కొందరు ప్రయాణించగలరు. కొందరకు కళా రంగాన అనుకూలత సిద్ధిస్తుంది. ఉత్తముల స్నేహం కూడ కొందరకు లభించనున్నది అధికోష్ణత వలన చాలమందికి ఆరోగ్యలోపం చెప్పదగిన అంశం. స్త్రీలకు: గృహకార్యాలతో హడావుడి అధికం కాగలదు

♌ సింహం: ఇల్లు మారటం, అప్పులు చేయవలసి రావటం, రావలసిన డబ్బు చేతికి అందకపోవటం. కొందర విషయాలలో చెప్పదగిన ముఖ్యాంశాలు. దైనందిన కార్యక్రమాలకు అంతరాయం ఏర్పడగల సూచనలున్నాయి. అనుకోకుండా బంధుమిత్రులను సందర్శింపగలరు. స్త్రీలకు: రాజకీయరంగానుభవం గల వారికి సదవకాశాలు లభించగలవు ఆదాయం కూడ లేకపోలేదు

♍ కన్య: వృత్తియందు పెంపు కనిపిస్తుంది బంధుమూలక సమాగమం, ఉద్యోగంలో పెంపు, అధవా 'ప్రమోషన్' లభించటం కొందర యందు చెప్పదగిన ముఖ్యాంశాలు జాయింటు వ్యాపారంలో చెప్పదగిన ప్రగతి కనిపిస్తుంది స్త్రీలకు నూతన వస్తువులు సేకరించుకోగలుగుతారు. శుభ కార్య ప్రస్తావనలుంటాయి, గ్రహించండి.

♎ తుల: బంధువులతో గాని, మిత్రులతో గాని మనస్పర్థలు రాగల అవకాశాలున్నాయి. వ్యాపారంలో యిబ్బంది కలిగే అవకాశం కూడా ఏర్పడనున్నది. ఎంతవచ్చినా వారాంతానికి చాలలేదే అనే బాధ ఏర్పడుతుంది స్త్రీలకు: రాజ్యాంగ రీత్యా మేలు సంభవం. వృత్తి యందు పెంపు లభిస్తుంది. ఆలోచనలు ఫలిస్తాయి.

♏ వృశ్చికం: భారీ వ్యాపారం చేయాలని గాని, జాయింటు వ్యాపారం చేయాలని గాని ఉబలాటపడుతారు, కాని యింకా కాలం అనుకూలం కాలేదు, గ్రహానుకూలత ఈవారం చెప్పదగిన స్థాయిలో లేదు, ఎంతో జాగరూకత అవసరం. స్త్రీలకు వృత్తియందు వికాస మున్నది, ఆరోగ్యమందు అభివృద్ధి ఉన్నది.

♐ ధనుస్సు: గ్రహించండి. రాశిస్థిత గ్రహం ఏ విధంగా మేలు చేయజాలదు. శని గ్రహానుకూల్యత గలదు. వ్యాపారం విస్తరించే యత్నాలు గాని, ప్రయాణం చేసే ఆలోచనలు గాని ఈవారం మానుకోవటం శ్రేష్ఠం. స్త్రీలకు నగలు, వస్త్ర, వస్తు సేకరణకు ఈ వారం అనుకూలం

♑ మకరం: మీ ఆరోగ్యంలో ఎంతో శ్రద్ధ అవసరం. దీర్ఘవ్యాధులున్న వారు యింకా జాగ్రత్త పడవలసిన అవసర మున్నది. ఆరోగ్యాభివృద్ధికై పాటుపడుట ఎంతైనా అవసరం. స్త్రీలకు. నూతన గృహప్రాప్తి కొందర విషయంలో నిశ్చయం. వస్తు సేకరణకు కూడ ఫలదాయక వారం.

♒ కుంభం. లావాదేవీలలో, వ్యవహార పరిష్కారంలో, భూసంబంధ, గృహసంబంధ విషయాలలో చాల మంది అనవసరమైన చిక్కులకు గురికావలసిన ఆగత్య మున్నది ఆదాయమందు కూడ కొంత లోపం కనిపిస్తుంది. స్త్రీలకు సుఖశాంతులు, కార్యానుకూలతకు అవకాశం గల వారం

♓ మీనం: వారాంతం సర్వ విధాలా శుభదాయకం. శుభ ప్రస్తావనలుంటాయి కొందర గృహాలందు వివాహాది కార్యక్రమాలు నిర్వర్తించెడి అవకాశాలుంటాయి. ఆశించిన ద్రవ్యం చేతికి అందే మార్గమున్నది స్త్రీలకు. విశ్రాంతి లేని పని అధికం, అధిక వ్యయం, ఆశించిన పనులు జరుగకపోవటం అనుభవానికిరాగలవు బంధువిరోధం పొడసూపే మార్గమున్నది. జాగ్రత్త!

– విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# గుండె గొంతుకలోన

పంతుల జోగారావు



“హేమా, ఇదిగో యిలారా, మాట” ముందు గదిలో నుంచి భర్త గొంతు కొంచెం గట్టిగా వినిపించడంతో కంగారుపడుతూ వెళ్ళింది హేమ. ముందుగదిలో డాక్టర్ రాఘవ డ్రస్ చేసుకుని సోఫాలో కూచుని ఉన్నాడు.

“ఏమయిందండీ, పిలిచారు” అంది హేమ.

“నీకీ మూగి ముండ తప్ప యీ ఊర్లో మరో పని మనిషి దొరకలేదా ?” విసుగ్గా అడిగేడు రాఘవ.

“ఏ మి ట ం డీ, ఏమైందసలు ? ” తెల్లబోతూ విషయం అర్థంకాక మళ్ళీ అడిగిందామె.

“ఈ మూగి పీనుక్కి తెలీదు, చెప్తే అర్థంకాదు.. చూడు, గదిలో దుమ్ము అంతా తుడిచి నా బూట్సు మీదకి ఎలా చిమ్మిందో ఇప్పుడే డర్బీ బూట్సుని పాలిష్ చేసుకునే సరికి నా తల ప్రాణం తోకకి వస్తుంది అసలీ ఊర్లో మరో పని వాళ్ళు దొరకనట్టు దీన్నే పెట్టుకోవడం ఎందుకు ? ఇవాళే పన్లోంచి తీసెయ్” రాఘవ కోపంగా అన్నాడు

హేమ అతను చూపించిన వేపు చూసింది అతను వేసుకోవలసిన బూట్సు ధూళి పేరుకు పోయి ఉన్నాయి దాని పక్కనే చీపురు పడి

# గుండె గొంతుకలోన

వుంది. హేమకి నవ్వు ముంచుకొచ్చింది. నవ్వితే భర్త ఏమనుకుంటాడో అని పెదిమిల మధ్యే నవ్వుని అదిమి పెట్టింది.

''అయ్యో, ఇది మన లిల్లీ పనండీ . ఇవాళింకా రంగి పనిలోకి రానేలేదు. లిల్లీ యిందాక చీపురు పట్టుకోవడం చూసేను ఇదన్నమాట అది చేసిన నిర్వాకం. .'' అంది

అంత కోపంలోనూ రాఘవకి నవ్వు వచ్చింది తల్లిదండ్రుల మాటలు వినిపించి ఆడుకుంటున్న లిల్లీ వచ్చి తల్లి వెనక్కి చేరింది. కూతురి తల నిమురుతూ ''ఏమ్మా గది తుడిచింది నువ్వేనా?'' అనడిగింది హేమ.

''ఊ ..'' తలూపింది లిల్లీ

రాఘవ నవ్వేస్తూ ''నాటీ గర్ల్ ... నా బూట్సు ఎలా పాడయిపోయాయో చూడు నీ కెందుకమ్మా యిలాంటి పనులు ..''అన్నాడు

''ఒక్కక్షణం మీరలా కూచోండి... పాలిష్ చేసి ఇస్తాను'' అంటూ వాటినందుకుంది హేమ

ఇంతలో వీధిలో రంగి గొంతు వినిపించింది. దానికి మాటలురావు. మూగది. కాని, రకరకాల ధ్వనులు నోటితో చేస్తూ, చేతులు త్రిప్పుతూ తన భావాలు యితరులకి అర్థమయేలా చెప్పడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది.

రాఘవకి దాని గొంతు వింటేనే తగని చిరాకు. ''ఏమిటలా వికారంగా అరుపులూ కేకలూను— అడవి మనిషిలా. నోరు మూసుకుని, నీ పని నువ్వు చేసుకుపోరాదూ ?'' అని గట్టిగా కసిరేడు ఒకరోజు.

అతని మాటల్తో అది కళ్ళలో నీళ్ళు పెట్టుకుంది. పెరట్లోకి వెళ్ళి గిన్నెలు తోముతూ వెక్కివెక్కి ఏడవసాగింది. దాని ఏడుపు వినడానికే వికారంగా వుంది

దాని బాధ చూడలేక— ''అదేమిటండీ, మూగదాన్ని పట్టుకుని మీ చిరాకంతా దానిమీద చూపిస్తారూ? పాపం నోరూవాయీ లేని మనిషది. ఏదో తన పని తను చేసుకుపోతోంది. దానివల్ల మీకొచ్చిన యిబ్బందేముంది ! దానిమీద నోరు చేసుకుంటారేం, పెరట్లో ఎంతలా కుమిలి పోతోందో చూడండి ...'' అంది రాఘవతో.

''మూగిముండ మాటలు రాకపోతే రానట్టు నోరు మూసుకుని పడుండాలి కాని... ఆ అరుపు లేమిటి.. దాని గొంతు వినిపిస్తే కారం నలిచి నట్టుంటోంది నాకు ..'' అని విసుక్కున్నాడు రాఘవ.

రాఘవకి ఆ వూరన్నా, ఊర్లో మనుషులన్నా అసహ్యం ఆ కోపం అందరి మీదా చూపిస్తూ ఉంటాడు. రంగిని చూస్తే మొదటి నుంచీ అతనికి మంటగా ఉంటోంది— కారణం, దాన్ని కుదిర్చి పెట్టింది అత్తగారు కనుక !

డాక్టరు కోర్సు పూర్తి కాకుండానే రాఘవకి హేమతో వివాహమయింది. కాని, కాపరానికి రాలేదు కోర్సు పూర్తయేసరికే ఉన్న ఆస్తి కాస్తా హరించుకుపోయింది. హౌస్‌సర్జను చేసే నాటికి చేతిలో చిల్లిగవ్వ లేదు అప్పుడు ఆదుకున్నదీ— తరువాత యీ ఊళ్లో క్లినిక్ పెట్టించి ప్రాక్టీసు చేసుకునేందుకు సహాయం చేసిందీ కూడా హేమ తండ్రి అవధానిగారే. చివరికి అతని సహాయం అందుకోవలసిరావడం రాఘవకి తీరని అవమానంగా తోచింది అయినా మరో మార్గం కనిపించక ఊరుకోక తప్పిందికాదు కాని న్యూనతా భావాన్ని అతను అధిగమించలేకపోతున్నాడు. ఆ కోపం, చిరాకు అందరిమీదా ప్రదర్శిస్తూ ఉంటాడు. మంచి టౌన్లో ప్రాక్టీసుపెట్టి రెండు చేతులా సంపాదిద్దామనుకున్న అతని ఆశ ఆశగానే మిగిలిపోయింది. తన కలలనీ, భవిష్యత్తునీ, ఎవరో కసిగా కాలరాచివేస్తున్నట్టు బాధపడుతూ ఉంటాడు. ఏదో తెలీని అసంతృప్తి అతన్ని వెంట తరుముతూ ఉంటుంది. ఊర్లో పెద్దగా పోటీ లేకపోవడంచేత నాలుగు డబ్బులు వస్తున్నప్పటికీ అతని మనసులో అగాధం మాత్రం పూడ్చుకో లేదు. తన వృత్తి ధర్మాన్నికూడా మరిచిపోయి ప్రవర్తిస్తూ ఉంటాడతను. వచ్చిన రోగుల దగ్గర కర్కశంగా ఫీజు వసూలు చెయ్యందే పరీక్షించదు అందరివలనా తనకి తీరని ద్రోహమేదో జరిగిపోయినట్లుగా ఊహించుకొంటూ, అందుకు ప్రతీకారం తీర్చుకుంటున్నట్లుగా అతను ప్రవర్తిస్తూ ఉంటాడు హేమ అతని ప్రవర్తనని గమనిస్తున్నా ఏమీ అనలేక ఊరుకుంటూ ఉంటోంది.

వీధిలో రంగి గొంతు వినిపించి రాఘవ మరింత విసుగ్గా హేమవేపు చూసేడు. ''అదిగో, మీ మూగిముషాణం వచ్చింది పనిలోకి .. కాస్త నోరు మెదపకుండా పని చేసుకోమని చెప్పు'' అన్నాడు హేళనగా

ఆ వెటకారం భరించరానిదిగా తోచింది హేమకి

''మీకిది ధర్మంకాదు అది మూగదే కావచ్చు అంతమాత్రంచేత దాన్ని చులకనచేసి మాట్లాడ్డం మీకు తగదు, మీకసలు మా వాళ్ళ మీద కోపం. ఆ కసినీ, చిరాకునీ యిలా అందరి మీదా వెళ్ళగక్కుతూ ఉంటారు'' ఉండబట్టలేక అనేసింది

''నోర్ముయ్.. నోటికొచ్చింది వాగకు నీకు దానిమీద అంత సానుభూతి, దయవుంటే పనిమనిషిగాకాదు — స్వంత చెల్లెలిగా చూసుకో నాకోసం యింటికి ఫ్రెండ్సూ వాళ్ళు వచ్చి పోతుంటారు — వాళ్ళముందు దీని వికారపు గొంతు విని నేను సహించలేను మరో పని మనిషి దొరకనట్టు దీన్ని తెచ్చి మన నెత్తిమీద పెట్టింది మీ అమ్మ ఆవిడ్నానాలి అసలు ''

అతని కోపం తమ కన్నవారి మీదకి మళ్ళడంతో హేమ ఓ క్షణం మాట్లాడలేదు తర్వాత చెప్పడానికి ప్రయత్నిస్తూ చెప్పింది ''అది కాదండీ - మూగిదయితేనేం చెప్పిన పని జాగ్రత్తగా చేసుకుపోతుంది చాలా నమ్మకస్థురాలయిన మనిషండీ ఈ ఊర్లో అలాంటి పని మనిషి దొరకడం కష్టం అయినా కాస్త నిశ్శబ్దంగా ఉండమని చెబుతానులెండి ''

రాఘవ కోపంగా 'హుఁ' అంటూ పేపరు అడ్డం పెట్టుకుని మరేం మాట్లాడలేదు హేమ సిద్ధం చేసిన బూట్లు తొడుక్కుని క్లినిక్‌కి బయలుదేరాడు

హేమ నిట్టూరుస్తూ ఉండిపోయింది

* * *

మర్నాడు ఉదయం రంగి ఎంత పొద్దెక్కినా పనిలోకి రాలేదు ముందురోజు తనకీ భర్తకీ జరిగిన సంభాషణ విన్నాదేమో ! ఎంత బాధ పడిందో . ఛీ ఏం మనిషి ఈయన ? ఎంత చదువుకుంటే మాత్రం ఏం లాభం — సంస్కారం మరిచిపోయేక ఎదుటి మనిషిలోని శారీరక లోపాన్ని ఎత్తి చూపెడుతూ హేళన చెయ్యడం ఎంత నీచం !

హేమ కాలుగాలిన పిల్లిలా యింట్లో అటూ యిటూ తిరుగుతోంది. ఎక్కడి పని అక్కడే ఉందింకా. భర్త క్లినిక్‌కి వెళ్ళిపోయేడు. లిల్లీ కాన్వెంటుకి వెళ్ళిపోయింది. కాఫీగ్లాసులూ, టిఫిన్ ప్లేట్లూ యింకా అలాగే పడి ఉన్నాయి బాత్‌రూంలో తడిపి ఆరేయవలసిన బట్టలు బకెట్ నిండా వున్నాయి అంట్లగిన్నెలు సరేసరి ఇల్లంతా చిందరవందరగా ఉంది. లేచి చీపురు తీసుకుని గది తుడుద్దామనుకుంటూ వుంటే రంగి గొంతు వినిపించింది. ''హమ్మయ్య'' అనుకుని హాలులోకి వెళ్ళింది హేమ.

రంగి నిలబడివుందక్కడ. దాని చంకన దాని కొడుకు — ఏడాది పసిబిడ్డ ఉన్నాడు. వాడి ఒంటిమీద జుబ్బాగుడ్డ కూడా లేదు చింకి తువ్వాలు వాడిమీద కప్పింది రంగి ముఖం

---

ఇటీవల చిలకలూరిపేట డి.ఆర్ ఎన్. డిగ్రీ కళాశాలవారు నిర్వహించిన అంతర్ కళాశాల కథల పోటీలలో ద్వితీయ బహుమతి పొందిన కుమారి బి మంజులకి బహుమతి నందజేస్తున్న కళా సదస్సు అధ్యక్షుడు శ్రీ కందిమళ్ల నారాయణమూర్తిని చిత్రంలో చూడవచ్చు.



కూడా పీక్కుపోయి వుంది. దానికళ్ళు రాత్రంతా నిద్ర లేనట్టుగా ఎర్రగా తయారయి వున్నాయి. బాగా ఏడిచినట్లుగా ఉంది. ముఖం ఉబ్బిపోయి వుంది. చిరుగుల చీర, రవిక. తైల సంస్కారం లేని జుత్తు. లోతుకుపోయిన దవడలు

దాని రూపం చూసి జాలివేసింది హేమకి పాపం, ముగ్గురు పిల్లలు దానికి. పుడుతూనే మూగిదానిగా పుట్టింది. కట్టుకున్న మొగుడు దాని కాపురంలో నిప్పులు పోసి ఎక్కడికో పోయేడు. అప్పట్నుంచీ అదే నాలుగిళ్ళలో పాచిపనులు చేస్తూ నెట్టుకొస్తోంది.

రంగి చేతిలో బిడ్డని చూపిస్తూ "వాడికేమయిందే. పాపం, వొంట్లో బాగు లేదా ?" అనడిగింది హేమ.

ఆపాటి సానుభూతి పలుకులు అంతవరకు ఎవరి నోటినుండి కూడా విననిదానిలాగా రంగి గుండె పగిలినట్లు బావురుమంది

"ఛ ఛ.. ఊరుకోవే ఊరుకో డాక్టరుగారు యిప్పుడే క్లినిక్కి వెళ్ళిపోయేరు కొంచెం ముందుగా రాలేకపోయావా?. సరేలే క్లినిక్కి తీసికెళ్ళి చూపించు" అని ఊరడించింది

మరో రెండు మూడు నిముషాల వరకూ రంగి ఏడుపు ఆపుకోలేకపోయింది తర్వాత బెక్కుతూ మూగిభషలోనే హేమకి ఏదో వివరించబోయింది కాని హేమకి అది చెప్తున్న దేమిటో అర్థమే కాలేదు.

ఆ మూగ హృదయం తన వేదనని ఏమని చెప్పుకోగలదు ?

తన గుండెలోని బాధని ఎలా వివరించ గలదు ?

ఆ పిచ్చితల్లి దుఃఖించగలదు కానీ -- తన దుఃఖానికి కారణం మరొకరితో మాటలలో ఎలా పంచుకోగలదు !

ఆ అమాయకపు గుండె గొంతుకలో కొట్లాడుకోవలసిందేకానీ —

ఆ గుండె బరువు దించుకోవడం సాధ్యం కాదు.

ముందు రోజు సాయంత్రం కొడుకుని తీసుకుని రాఘవ క్లినిక్కి వెళ్ళాననీ — గేటుదగ్గర పని కుర్రాడు ఫీజు లేనిదే లోపలకి వదల నన్నాడనీ — తన గొంతు వినయినా రాఘవ జాలిపడి రానిస్తాడని పెద్దగా అరిస్తే — రాఘవ మండిపడ్డాడనీ — నోటికొచ్చినట్టు తిట్టిపోసేడనీ కొడుకుని సరిగా చూడనైనా చూడకుండానే ఏదో మందుచీటీ రాసి ముఖాన కొట్టి పంపించే డనీ — ఆమె హేమతో చెప్పుకోలేకపోయింది.

ఒక యింజక్షనో, మాత్రో యిస్తాడను కున్న రంగి హతాశురాలయింది. మనుష్యుల్లో — ముఖ్యంగా డాక్టర్లలోకూడా అలా కర్కశంగా ప్రవర్తించగలిగే వ్యక్తులుంటారని ఆమెకి తెలీదు

రాత్రంతా రంగి కొడుకు మందులేకుండా అలాగే ఉండిపోయేడు. ఒళ్ళెరుగని జ్వరంలో మూసిన కన్ను తెరవలేదు ఈ మనోవేదన హేమతో చెప్పుకోడానికి భగవంతుడామెకి నోరు యివ్వలేదు. తన బాధ తనలోనే దిగమింగుకుని, కళ్ళలో నీళ్ళు కుక్కుకుని వుండిపోయింది రంగి.

చింకితువ్వాలు హాలులో ఓ మూల పరిచి పిల్లాడిని దానిమీద పడుకోబెట్టి, పాచిపని చెయ్య డానికి పెరట్లోకి దారితీసింది. కొడుకు ఆ పరిస్థితిలో వున్నప్పటికీ అది వచ్చి పని చెయ్య బోవటం చూసి హేమ మనసు బాధపడింది వద్దని వారించబోయింది కానీ—పెరట్లో పేరుకు పోయిన అంట్లగిన్నెలూ అవీ గుర్తొచ్చి మరేం అనలేకపోయింది హేమ

పనంతా పూర్తిచేసి వెళ్ళొస్తానన్నట్లుగా సౌంజ్ఞచేసి పిల్లడ్ని ఎత్తుకుని యింటికి వెళ్ళి పోయింది రంగి.

* * *

ఆ సాయంత్రం రంగి విషయమై హేమకీ, రాఘవకీ చిన్న ఘర్షణ జరిగింది రాఘవ కఠినంగా అన్నాడు "నాన్సెన్స్ — దాని వికారపు గొంతు, ఆ ఆ అరుపులు యింటిదగ్గరే భరించలేక పోతుంటే — క్లినిక్కొచ్చి నానా అల్లరీ చేసిందది ఫీజు తీసుకోకుండా కంకణం కట్టుకుని క్లినిక్ పెట్టుకుని కూచోలేదక్కడ "

"అది మన యింట్లో పనిచేసే పనిమనిషే కదండీ ఉచితంగా చూస్తే ఏం తరిగిపోతుంది మనకి "

"పనిమనిషేకాని యింట్లో మనిషికాదు కదా అది చేస్తున్న పనికి జీతం యిస్తున్నాం దట్సాల్ దానిలాంటివాళ్ళు ఈ ఊర్లో చాలా మంది వున్నారు అసలే దిక్కుమాలిన ఊర్లో అలాంటి బికారి వెధవలే ఎక్కువ వాళ్ల దొంగ ఏడుపులకీ, రంగి నటనలకీ కరిగిపోతే మన పని అంతే "

"మీరు డాక్టరు మీ వృత్తి ఎంత పవిత్రమయిందో నేను చెప్పనక్కరలేదు కాస్త పేదసాదలని చూడకపోతే ఎలాగండీ ?" తెగించి అంది హేమ

"ఒహో.. నాకే నీతులు చెప్తున్నావన్న మాట... మీ నాన్న ప్రాక్టీసు పెట్టుకోడానికి మదుపు పెట్టాడన్న అహంభావంతోనే కదా నాకిలా నీతులు చెప్పగలుగుతున్నావు ?" అని అరిచేడు రాఘవ.

తమ సంభాషణ అటుతిరిగి యిటుతిరిగి మళ్లీ తన తండ్రి ప్రస్తావన వచ్చేసరికి మరేం మాట్లాడలేకపోయింది హేమ

తన తండ్రి యిచ్చిన డబ్బు అతనికంత చేదయినదయితే ఎందుకు తీసుకోవాలి ? పెళ్లికి ఎందుకు కట్నం పుచ్చుకున్నారు ? చదువుకునే రోజుల్లో మనీఆర్డర్లు ఎలా అందుకున్నారు తన తండ్రిపై అతనికెందుకంత అక్కసు అతని మాటల్లోని వెటకారం ఆమెకు ములుకులా గుచ్చుకుని బాధించింది

తల దించుకుని మౌనంగా ఉండిపోయింది

* * *

రెండు రోజులు గడిచేయి. ఆ రోజు సాయంత్రం ఏడుగంటలు కావస్తోంది రాఘవ క్లినిక్లో పేషెంట్లని చూస్తున్నాడు కంపౌండరు మందుల బల్ల దగ్గర హడావిడిగా ఉన్నాడు. మరో పని కుర్రాడు ద్వారం దగ్గర నిల్చుని రోగుల్ని ఒక్కొక్కరినే లోపలికి పంపిస్తున్నాడు

ఇంతలో ద్వారం దగ్గర రంగి గొంతు గాభరాగా వినిపించింది. రాఘవ చిరాగ్గా తలెత్తి చూసేడు రంగి లోపలికి నెట్టుకొని రావడానికి పని కుర్రాడితో ఘర్షణ పడుతోంది. వాడామెను లోపలికి రానివ్వడంలేదు. అది మరింతగా పెనుగు లాడుతోంది. అర్థంకాని భాషలో బిగ్గరగా అరుస్తోంది. దాని కేకలతో క్లినిక్ మారుమ్రోగి పోతోంది.

గొంతు చించుకుని అరుస్తూ ఏదో



చెప్పడానికి ప్రయత్నిస్తోందామె. ఆమె కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి దెయ్యాన్ని చూసిన దానిలా గజగజలాడిపోతోంది.

''సెస్ .. ఆగే నీయమ్మ .. నీకంటే ముందు చాలామంది వచ్చేరు పేద్ద .. ఫీజ యిచ్చేదానిలా తోసుకుని వచ్చేస్తున్నావు .. ఫో.. నోరు మూసుకుని అక్కడకు పోయి కూచో '' అని కసురుతున్నాడు పని కుర్రాడు

అది తన పట్టు విడవకుండా అతన్ని తప్పించుకుని రావటానికి ప్రయత్నం చేస్తోంది వాడు దాని జబ్బ పట్టుకొని వెనక్కి తోసేడు వెనక్కి తూలిపడబోయి నిల్రదొక్కుంది. ఆమె ఒంటిమీద చిరుగుల పైట జారిపోయి, బొత్తాలు లేని జాకెట్టులోనుంచి వాలిన వక్షోజాలు కనిపిస్తున్నాయి కాని — ఇదేమీ పట్టించుకునే స్థితిలో లేదామె.

ఈ దృశ్యం చూసి రాఘవ ఒళ్ళు అసహ్యంతో జలదరించుకుపోయింది. అతనికి శరీరంమీద తేళ్ళూ జెర్రెలూ ప్రాకినట్లనిపించింది. అతనికి రంగి ప్రవర్తన అసభ్యంగాను, పరమ రోతగానూ తోచింది. దాని కొడుక్కి ప్రాణంమీదకి ముంచు కొచ్చింది కాబోయ. తనని దాని మురికి కొంపకి తీసుకుపోడానికి వచ్చినట్లుంది హెల్ విత్ హెర్ సన్. ఈ ముండని మెడపట్టుకుని గెంటించెయ్యాలి. .ఎంత న్యూసెన్స్ చేస్తోంది. ఇప్పుడు దీని కొంపకి వెళ్ళడమా! ఫీజ బాగా యిచ్చేవాళ్ళ యిళ్ళకి తప్ప ఎక్కడకీ వెళ్ళడం తనకిష్టం వుండదు. ఎంత చావు బ్రతుకుల్లో వున్నా రోగిని క్లినిక్‌కి తీసుకురావలసిందే —

రాఘవ ఆలోచనలు తెగక ముందే రంగి బలమంతా ఉపయోగించి, పనికుర్రాడ్ని నెట్టుకుని లోపలికి వచ్చి రాఘవ కాళ్ళమీద పడిపోయింది వెక్కి వెక్కి ఏడుస్తూ గిగ్గోలు పెట్టెయ్యడం ప్రారంభించింది ఇంక లాభం లేదు .. దీని న్యూసెన్స్ భరించలేనిదిగా వుంది ఇప్పుడు దీని వెంట వెళ్ళక తప్పేలా లేదు కాదని భీష్మించుకు కూచుంటే అందరి దృష్టిలోనూ నురీ కర్కోటకుడనిపించుకునే ప్రమాదం వుంది

అయిష్టంగానే కుర్చీలోనుంచి లేచి, పద అన్నట్టుగా తలవూపి రంగి వెంట బయలు దేరాడు రాఘవ కంపౌండరు మందుల కిట్ పెట్టుకుని అతడిని అనుసరించేడు ఏదో సాధించేనన్న తృప్తితో రంగి అక్కడికక్కడే చేతులెత్తి గాలిలోనే దండాలు పెట్టేస్తోంది తనలో తనే ఏదో మాట్లాడుకుంటున్నట్టు అరుస్తూ బయలుదేరింది

అలా బయలుదేరిన రంగి తన పూరింటి ముందు ఆగలేదు!

డాక్టర్ రాఘవ ఆశ్చర్యపోయాడు తెల్లబోతూ ప్రశ్నార్థకంగా ఆమెవేపు చూసేడు

# గుండె గొంతుకలోన

అక్కడ కాదన్నట్టుగా రంగి అడ్డంగా తల వూపుతూ ముందుకి నడిచింది గబగబా ఏ సంగతీ అర్థంకాక రాఘవ ఆమెని అనుసరించేడు

రంగి వడివడిగా నడుస్తూ ఓ సందు తిరిగి అక్కడ ఆగిపోయింది —

ఆమె వెనుక అసహనంతో, చిరాగ్గా, కోపంగా ధుమధుమలాడిపోతూ వస్తున్న రాఘవ కొయ్యబారిపోయినట్లు నిలబడిపోయేడు!

అతని జవసత్వాలూ ఉడిగిపోయినట్లయేయి జీవచైతన్యం కోల్పోయిన వాడిలా అయిపోయేడు కళ్ళముందు గాఢమయిన చీకటి తెరలు కదలాడు తున్నట్లనిపించింది

''రండి రండి.. '' అన్నట్లుగా చేతులో అభినయిస్తూ గుండెలు బాదుకుంటూ రంగి వేగంగా ఆ యింట్లోకి దారితీసింది

ఆ యింటి తలుపుమీద ''డాక్టర్ ఎన్ రాఘవ, ఎం బి బి ఎస్'' అన్న బోర్డు ఉంది .

* * *

రాత్రి పదకొండు గంటల ప్రాంతం

డాక్టర్ రాఘవ చేతుల్లో ముఖం పెట్టుకుని కుమిలిపోతున్నాడు అతని హృదయం పశ్చాత్తాపంతో దహించుకుపోతోంది. ఎదురుగా మంచంమీద సగం కాలిన శరీరంతో మూలుగుతూ పడుకునివుంది లిల్లీ పాప కాలిన గాయాలమీద మందు రాసి చేతులు శుభ్రం చేసుకుని అలసటగా కుర్చీలో కూలబడిపోయింది హేమ ఆమె ముఖం దైన్యంతో పీక్కుపోయి వుంది

తల్లి వంట చేస్తూన్నప్పుడు ఆమె వెనుకనే తిరుగుతూ తల్లి పరాకుగా ఉన్నపుడు స్టౌమీద గిన్నె ముట్టుకోబోయి తూలి పడిపోయిందా పిల్ల. ఫ్రాక్ అంటుకుంది హేమ భయంతో కేకలు

## పచ్చినిజం!

నీ స్వార్థం మట్టుబెట్టి<br>
నిస్వార్థం గుండెలోన<br>
నిజాయితీకి పీట వేసి<br>
నీతి కొరకు కోట కట్టినా<br>
నీ తోడి సమాజం<br>
నీతొడ్డిన సమాజం<br>
నీకోసం తన నైజం<br>
నిజం నిజం మార్చబోదు!!!

— యస్వీ.కె. మల్లిక్

వేస్తూ స్పృహతప్పి పడిపోయింది. అక్కడే ఉన్న రంగి చప్పున మంటలు చేతుల్తో ఆర్పడానికి ప్రయత్నించి సాధ్యంకాక నీళ్ళుపోసి ఆర్పేసింది ఆ ప్రయత్నంలో దాని అరచేతులు బొబ్బ లెక్కాయి. లిల్లీకి ప్రాణగండం తప్పింది... మంటలు ఆర్పేసాక స్పృహకోల్పోయి వున్న హేమ ముఖంమీద నీళ్ళుజల్లి ఆమె కొంచెం కదిలి నట్లనిపించేక, భయంతో ఆదరాబాదరాగా రాఘవని తీసుకురావడానికి క్లినిక్‌కి పరుగెత్తింది రంగి.

జరిగిందంతా తలచుకుంటూ ఉంటే రాఘవ మనసు విలవిలలాడిపోతోంది తను మనిషేనా? రంగిని ఎంత నీచంగా, లోకువగా చూసేడు.. రంగి లేకపోతే లిల్లీ తమకి దక్కేదా? అతని గుండె జలదరించుకుపోయింది ఆలోచించడానికే భయం వేస్తోంది రంగిని ఎంత హేయంగా తూలనాడేడు తను! ఆమె మూగదవడం ఒక శాపమైతే -- అందుకు మనిషిగా, జాలి, సానుభూతి చూపించడానికి బదులు ఏం చేసాడు తను! తన చదువు, డిగ్రీ, విజ్ఞానమూ అన్నీ ఏమైపోయేయి!

రంగికి తన కృతజ్ఞతలు ఎలా తెలియ జేయడం? ఆమె మూగ గుండెకి ఏ భాషతో చెప్తే అర్థమవుతుంది. అతనికి చప్పన రంగి కొడుకు గుర్తొచ్చేడు అవును వాడికి జబ్బుగా వుందని కదూ మొన్న క్లినిక్‌కి తీసుకొచ్చింది ఇప్పుడెలా ఉన్నాడో

భర్త చాలాసేపటినుంచి సోఫాలో కూచుని ఏదో ఆలోచిస్తూ తనలోతనే బాధపడడం గమనించింది హేమ లిల్లీకి ఆ ప్రమాదం జరిగేక ఆమె తీవ్రంగా చలించిపోయింది ఇప్పుడిప్పుడే ఆమె ఆ షాక్ నుంచి కోలుకుం టోంది

భర్త డ్రస్‌చేసుకుని, మెడలో స్టెతస్కోప్ వేసుకుని మందుల కిట్ స్వయంగా తనే పట్టుకుని ఎక్కడికో బయలుదేరుతూ ఉండటం చూసి అడిగింది — ''ఎక్కడికండీ యింత రాత్రివేళ ఏదైనా అర్జంటు కేసు వచ్చిందా?'' అని

రాఘవ ఆగి, ఆమె మొఖంలోకి చూసి అన్నాడు · ''రంగి యింటికి హేమా! దాని కొడుక్కి ఎలా ఉందో. చూసివస్తాను తలుపు వేసుకో రంగి ఋణం యిలాగయినా తీర్చుకోవాలి నేను .'' అంటూ వీధిలోకి దారి తీసాడు

''రంగి రంగి కొడుకు. మధ్యాహ్నం చని పోయే. డంఢీ . మన పాలమనిషి చెప్పింది.. సాయంత్రం ''

వీధి మెట్లు దిగబోతూఉంటే – వెన్ను జలదరించుకుపోయేలా హేమ మాటలు రాఘవ చెవులకి పిడుగుల్లా వినిపించేయి

అతని అడుగు మరి ముందుకు సాగలేదు.★

# గా॥ గోపాలరెడ్డిగారి వివాహం

## ఉన్నవ లక్ష్మీనారాయణగారి పౌరోహిత్యము

సుప్రసిద్ధ కాంగ్రెసువాదులు, మద్రాసు స్థానిక స్వపరిపాలనా శాఖామాత్యులు, రెడ్డికుల సంభవులునైన శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి గారికిని, నెల్లూరు వాస్తవ్యులు శ్రీమంతులు జాతీయవాదులు నగు శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారి ద్వితీయ పుత్రిక శ్రీమతి చిరంజీవి సౌ॥ లక్ష్మీకాంతమ్మకును ఈ నెల 8వ తేదీ సాయంత్రం 6.30 గంటలకు సుముహూర్తము నందు, మదరాసు నగరంలో పచ్చయప్ప హాస్టలు ఆవరణంలో మహావైభవోపేతంగా వివాహం జరిగింది.

జగమెరిగిన బ్రాహ్మణులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు పౌరోహిత్యం నెరపిరి. వైదిక మంత్రాలనే తెలుగున అనువదిస్తూ ఆధునిక పద్ధతిలో వివాహతంతు జరిపారు. ముఖ్యమంత్రార్థాలన్నీ వధూవరులచేత తెలుగులోనే చెప్పించారు. వివాహ సంస్కారం యావత్తు ఒక్క గంటలోపుగ ముగింపబడింది.

### ఉన్నవ లక్ష్మీనారాయణగారి ప్రబోధము

లౌడు స్పీకరులు ఏర్పాటు చేయటంచేత లక్ష్మీనారాయణ పంతులుగారు చెప్పిన మాటలు, ముత్తయిదువులు పాడినపాటలు యావత్తూ సదస్యులందరికి చక్కగా వినుపించినవి. వధూవరులకు కట్నాలు, కానుకలు చదివించరాదని ముందుగా తెలియచేయటంచేత చదివింపులు మాత్రం జరగలేదు.

వివాహ మంత్రాలు చదవటానికి పూర్వము శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారీ విధంగా ఉపన్యాసము చేశారు :

"ప్రస్తుతం దేశంలో ప్రజల అభిప్రాయాల్లో కలుగుతున్న మార్పులనుబట్టి వివాహ విధానంలో కూడా మార్పులు అవసరమని తోచుతున్నది. నాలుగైదు రోజులు దీర్ఘ కాలంలో జరిగే వివాహతంతు క్లుప్తపరచటం అవసరం. అదిగాక ప్రస్తుత వివాహ విధానములు కొందరికి వేదోక్తంగాను కొందరికి పురాణోక్తంగాను. కొందరికి కేవలం తంతు రూపంగాను జరుగుతున్నవి. అలా గాకుండా హిందూ జాతికి యావత్తు సరిపడే ఏకవిధానము అవసరం. కొందరు వైదిక మంత్రములతో చేయ కూడదనీ, కొందరు తెలుగు మాటలతో చేయించవలెననీ, కొందరు ఊరక రిజిష్టరు చేయించుకుంటే చాలుననీ నూతనులు అభిప్రాయపడుతున్నారు. వైదిక పద్ధతిని తీసివేసేయెడల మన పూర్వనాగరికమునకు విజ్ఞానమునకు సంబంధము పూర్తిగా విడిపడి పోతుంది. మనము పూర్వార్జితమును విడిచిపెట్టకూడదు. పూర్వపద్ధతిలో అనవసరమైనవి తీసివేసి ప్రధానమైనవిమాత్రం వుంచుకొని వేదమంత్రములకు తెలుగుచేసి చెప్పుకొనుచు అందరికి వర్తించునట్లు చేయవలెను. తిరువాంకూరు మహారాజుగారు హిందూదేవాలయములలోనికి పోవుటకు జన్మతః హిందువులకేకాక, ఇతరులు హిందూమతంలో చేరినవారికి హక్కు కలదని చెప్పినారు. వేదములు ఒకరి హక్కు కావు. మంత్రద్రష్టలలో చాలమంది బ్రాహ్మణేతరులు స్త్రీలున్నారు. వారు కనుగొన్న మంత్రాలకు కూడ వారికి హక్కు లేదనటం అక్రమము. హిందువుడైన ప్రతివానికిని వేదములందు

వధూవరులు : శ్రీ గోపాలరెడ్డి, లక్ష్మీకాంతమ్మగార్లు



హక్కున్నది. మానవులందరకు అవి తరుణో పాయములే కనుక వైదిక పద్ధతిని అవసరమైన మార్పులతో హిందువులు అన్ని జాతులవారికి వర్తింపచేయుట న్యాయమని ఆ పద్ధతిని అవలంబిస్తున్నారు. పెద్దవా రీపద్ధతి నవలంబించిన ఇతరులందరకది ఆదర్శకమగును. అందరును ఈ మార్గమ్మునను సరింతురు గాక అనిరి.

## వధూవరులకు పట్టాభిగారి హితోక్తులు

శ్రీ పట్టాభి సీతారామయ్యగారు వధూవరుల నాశీర్వదిస్తూ యిలా చెప్పారు : ''భార్యాభర్తలు ఉభయులూ ఏక స్వరూపమేననీ, భార్య అర్ధాంగి అనీ మన పెద్దలు వర్ణించారు. అందుచేత ఆలుమగలు ఒకరిమనస్సుఒకరుకనిపెట్టి భార్యకు కోపం వస్తే భర్త కొంచెం తగ్గుతూ తెలివితక్కువచేత భర్త కోపపడితే భార్య అతన్ని నల్గురిలో వెర్రిచేయకుండా చూచుకుంటూ పరస్పరం అనుగుణ్యంగా అనుకూలంగా సంసారం నిర్వహించుకోవాలి. భార్యాభర్తలు సమానులనే భావం కూడదు ఒకరికొకరు విధేయులనే భావం వుండాలి. సమానవస్తువులు దూరంగా తొలగిపోతవి కాని దగ్గరకు చేరవు. ఒకరికొకరు లోబడి వుంటాము. అనుకొన్నప్పుడే పరస్పరం అనురాగం వుంటుంది. 40, 50 యేండ్లు చాలా దెబ్బలుతిని సంసారంలో అనుభవం గడించి చెప్పుతున్న ముక్కలివి ఈ దంపతులిరువురూ సమస్త సంపదలతో పుత్రపౌత్రాభి వృద్ధిగా చిరకాలం వర్ధిల్లవలెనని అందరి పక్షాన ఆశీర్వదిస్తున్నాను.''

పిమ్మట సుమారు వేయిమంది అతిథులకు షడ్రసోపేతంగా బల్లలమీద భోజనాలు ఏర్పాటు చేయబడినవి. గోపాలరెడ్డి దంపతులు అతిథివర్గాన్ని అంతా స్వయంగా సంభావించారు

కాకినాడ అనసూయ సోదరీమణు లిద్దరు గీత, గోవిందకృతులు, మంగళహారతులు చక్కగా పాడేరు.

కొల్హాపూరు సంగీత విదుషీమణి రసకిన్నర పద్మావతి శాలిగ్రాంగారు తన మంజులమైన గానంతోటి శ్రోతలను తనియచేశారు గోపీనాథ్, తంగమణిగార్లు తిరువాంకూరు నుండి ఆ ప్రభుత్వం వారి అనుమతితో వచ్చి తమ నాట్య ప్రదర్శనంతో అతిథులందరినీ సంతోషపెట్టేరు. అనంతరం నవ్యసాహిత్య, పరిషత్కవులందరు దంపతులకు కృతిసమర్పణాలు చేశారు. ●

ఆంధ్రపత్రిక
1938 మే 11
సంచిక నుంచి



సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

(గత సంచిక తరువాయి)

పచ్చని పందిరిలో ఆకుపచ్చని తోరణాలు ఆహ్వానిస్తున్నాయి.

శుభ్రప్రదమైన నిలువెత్తు గడపలు నూతన దంపతుల రాకకోసం నిరీక్షిస్తున్నాయి.

పెళ్ళి కళ పుట్టిపడుతున్న భవనం జరగబోయే తంతు కోసం ఆరాటపడుతోంది. ఎన్నాళ్ళ కోరికనో తీర్చుకోవాలని ఉబలాటపడుతోంది.

పెళ్ళివారి బస్సు హుందాగా గుమ్మం ముందు ఆగింది.

పెళ్ళికొడుకునూ — పెళ్ళి కూతుర్నీ చూడాలని — చుట్టుప్రక్కల జనం ఎగబడి ముందుకు త్రోసుకువస్తున్నారు.

కృష్ణారావు స్థితీ— ఆయన అదం అందరికీ తెల్సినదే. అయితే జమీందార్ల ఇంటి ఆడపడుచునీ — అందంలో బంగారు బొమ్మ కూడా సాటిరాదనీ — ఆ నోటా ఆ నోటా విన్న జనం తండోపతండాలుగానే ఇంటి ముందు మూగివున్నారు.

బస్సు దిగబోతూ పద్మిని ముందుకు పడబోయింది — నిల్రదొక్కుతుంది.

ఎడమ కన్నదురుతుంటే — అంత సందడిలోనూ భయంకర నిశ్శబ్దం అంతర్లీనమై వున్నట్టనిపించింది కృష్ణారావుకి

అక్కయ్యతోబాటు ఆ ఇంటి గుమ్మం ముందు నిలబడ్డ కృష్ణప్రియ గుండెలు లయ తప్పుతున్నట్టు భయంగా అదోలా అన్పించింది.

ముత్తైదుచేత దిష్టినీళ్ళు తెప్పించిన శ్రీహరిగారి మోహం ఎందుకో కళావిహీనంగా వుంది.

కృష్ణారావు కళ్ళు తులశమ్మ కోసం వెతికాయి.

ఆవిడ పెళ్ళవగానే — ఇక్కడ జరగబోయే తంతుకోసం శ్రీహరిగారితోబాటు వచ్చేసింది.

దిష్టి తీస్తున్న ఆవిడ మోహంలోనూ కళలేదు.

''లక్ష్మి ... అమ్మాయిలిద్దర్నీ పైకి తీసుకువెళ్ళి—ముందర కాఫీలూ అవీ ఇప్పించు.''

లక్ష్మికి పురమాయిస్తూనే — కృష్ణారావు చెయ్యి పట్టుకుని పక్కగదిలోకి తీసుకు వెళ్ళాడాయన.

కందిన మోహంతో కళ్ళు తుడుచుకుంటూ నిలబడ్డ తల్లిని చూసి మరింత తెల్లబోయాడు కృష్ణారావు.

''ఏమిటమ్మా ఇదీ ... బాబాయ్ ... ఏమైంది ???''

వొణికే చేతులతో — జేబులోంచి టెలిగ్రాం తీసిచ్చాడు శ్రీహరిగారు. అది యశోద మరణ వార్తని తెలుపుతూ — రామచంద్రరావు ఇచ్చిన టెలిగ్రాం.

స్థాణువులా నిలబడిపోయాడు కృష్ణారావు.

''మీతో బయలుదేరి మీ కన్నా ముందే వచ్చేసిందిరా ఈ టెలిగ్రాం — ''

బాబాయి మాటలు వినపట్టం లేదు.

ఈ కొద్దిరోజుల అనుబంధంలోనూ ఆవిడ చూపిన ఆత్మీయత, ఆప్యాయతా, కన్నతల్లిని మరపించే మమకారం— అల్లుడిలోనే కొడుకునూ చూసుకుని మురిసిపోయిన ఆవిడ సుతిమెత్తని మనసూ — పంచప్రాణాలూ కూతుళ్ళ మీదే నిలుపుకున్న ఆవిడ మాతృ హృదయం— పద్మినిని తన చేతిలో పెట్టినప్పుడు— ఆవిడ దాచుకోలేక పోయిన వర్ణనాతీతమైన ఆనందం. ఆ వెంటనే కూతురు తనకి దూరమైపోయిందన్న ఆవేదనా.. తను బయలుదేరే సమయంలో— పద్మిని సున్నితమైన మనసును వివరిస్తూ — ప్రత్యేకంగా — తనతో చెప్పుకున్న అప్పగింతలూ. . బస్ కదులుతుంటే — బస్సునే వెన్నంటిన ఆవిడ దీనమైన చూపులూ —

''భగవాన్ ! ఏమిటి నీ లీలలు !''

కృష్ణారావు కళ్ళు చెమర్చటం చూసిన తులశమ్మ గుండెల్లోంచి దుఃఖం తన్నుకు వచ్చింది.

''బాబాయ్ ! ఇప్పుడేమిటి చెయ్యటం ?''

''వెంటనే బయలుదేరటమే. ఆ పిల్లల్తో పోయినట్టు చెప్పద్దు. సీరియస్‌గా వుందని చెప్పి నువ్వు, అమ్మా వెళ్ళండి. లక్ష్మి, నేనూ ఇక్కడుండి— చుట్టాల్ని సమాధానపర్చి పంపివేస్తాము .. కారులో బయలుదేరటం మంచిది.''

''అమ్మా !—''

తులశమ్మ దుఃఖం దిగమ్రింగుతూ నిస్సహాయంగా చూసింది.

''మనమొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు మనకి మంచి రోజులొచ్చాయనుకున్నాను. మనమే తేరుకోలేదు— తల్లిదండ్రీలేని ఆ పిల్లలు —''

విషయం వింటూనే నిశ్చేష్టురాలై నిలబడి పోయింది లక్ష్మి.

''లక్ష్మి విన్నావుగా— ఆ పిల్లలికి ఎలాగో నచ్చచెప్పి తల్లికి సీరియస్‌గా వుందని మాత్రం చెప్పి— సామాన్లవీ కార్లో పెట్టించేసెయ్యి — ఐదునిముషాల్లో కారొచ్చేస్తుంది. ముందర వాళ్ళకి టిఫినూ అదీ బాగా పెట్టించు .. ఇదిగో అమ్మా... కళ్ళు తుడుచుకో— వాళ్ళదగ్గిర ఏ మాత్రం తేలకూడదు సుమా ...''

కందువాతో మోహం తుడుచుకుంటూ

---

**జరిగిన కథ — 8 :** కృష్ణారావుని పెళ్ళి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది. అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్థ ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్ళి చేసుకోమని బోధిస్తాడు. కృష్ణారావు తను తన అన్నగారి, వివేకానందుని, తండ్రిగారి అడుగుజాడల్లో నడుచుకోవాలనుకుంటునట్లు బాబాయి శ్రీహరిగారితో చెపుతాడు సంసారం సాగిస్తూనే ఈ దీక్ష కొనసాగించవచ్చని నచ్చచెప్పచూస్తారు శ్రీహరి బాబాయి కృష్ణ గొప్పతనం ఆయన గుర్తించినా తులశమ్మగారి కోరిక తీర్చటం తన బాధ్యతగా తలచి కృష్ణను పెళ్ళి చేసుకోమని కోరుతాడు. కృష్ణ తన లక్ష్యానికి సన్యాసమే మేలైనదని శ్రీహరి బాబాయితో చెపుతాడు. అందుకాయన సంసారం చేస్తూనే నిష్కామ బుద్ధితో మనసు నిశ్చలంగా ఉంచుకొంటే భగవంతునికి ఆత్మీయుడవ వచ్చని కృష్ణతో చెపుతారు తులశమ్మగారు గత జీవితాన్ని శ్రీహరిగారితో చెప్పి హృదయ భారాన్ని తగ్గించుకొంటారు. కృష్ణారావు తల్లి ఆవేదనని చూసి చలిస్తాడు తల్లి కోరిక ప్రకారం పెళ్ళి చేసుకొనుటకు అంగీకరిస్తాడు కృష్ణ. కృష్ణ పెళ్ళి పద్మినితో నిశ్చయమవుతుంది.



హడావుడిగా వెడుతున్న శ్రీహరిగార్నే అయోమయంగా చూస్తూ వుండిపోయింది లక్ష్మి.

* * *

"అత్తయ్యగారూ కోపం తెచ్చుకోకండి ... మాకున్నది అమ్మ... మా అమ్మ ఒక్కతే — మా కింకెవ్వరూ లేరు . అమ్మకేదైనా ఐతే — మేం బ్రతకలేం . ."

"........ ...."

"అత్తయ్యగారూ — విసిగిస్తున్నామని కోపం తెచ్చుకోవద్దు. అమ్మకేం కాలేదు కదా—"

"ఏం బావగారూ—మీరేం మాట్లాడరేం ? మీ రిద్దరూ అలాగుంటే మా కింకా భయంగా వుంది అమ్మ బాగానే వుందా ? వెళ్ళ గా నే మాతో మామూలుగానే మాట్లాడుతుంది కదూ . ."

కృష్ణప్రియ కొత్తను మరిచి — పిసిపిల్లలా బ్రతిమాలుతోంది. క్షణం కూడా నిగ్రహించుకోలేని బేలతనంతో కన్నీళ్లు పెట్టుకుంటోంది తులశమ్మ వోదార్పు సరిపోవటంలేదు.

కృష్ణారావు అనునయ వాక్యాలు ఊరట కలిగించటంలేదు.

"అక్కయ్యా ! అమ్మే — అమ్మేమై పోయిందోనే .. మన పిచ్చి అమ్మే .."

పద్మిని వొళ్లో మొహాన్ని దాచుకొని పసిపిల్లలా వెక్కిళ్ళు పెడుతున్న కృష్ణప్రియను పట్టుకోటం అసాధ్యమైపోతోంది.

పద్మిని నిర్వికారంగా వెనుకకు వాలి వుంది. ఆ కళ్ళు పిచ్చిగా ఎటో చూస్తున్నాయి.

క్రరలా బిగుసుకుపోయినట్టు చలన రహితంగా కూర్చుండిపోయిన పద్మినిని మధ్య మధ్య కదిలిస్తూనే వుంది తులశమ్మ.

చల్లగా వున్న చేతుల్ని ఓదార్పుగా నిమరటం తప్ప మరేం చెయ్యలేకపోతోంది.

"కృష్ణా... మధ్యలో ఎక్కడైనా ఆపమనరా— కాఫీ అదీ తాగుతారేమో ... పిల్లలు మరీ శోషపోతున్నారు "

తులశమ్మను వారించింది కృష్ణప్రియ.

"వొద్దొద్దు ... ఒక్క నిముషం కూడా ఆపద్దు అక్కడ అమ్మేమైపోయిందో—చూట్టానికూడా ఎవ్వరూ లేరక్కడ. మావయ్య మంచివాడేగానీ అత్తయ్య అమ్మని చూడదు. దయచేసి త్వరగా పోనివ్వమనండి—డ్రైవర్..."

కృష్ణప్రియ చేతుల్లో మొహాన్ని దాచుకుంది. కారు వేగాన్ని పుంజుకుంది

* * *

"డ్రైవర్...వద్దు అంత త్వరగా వద్దు. దయచేసి మెల్లిగా పోనివ్వండి. అత్తయ్యగారూ ఇంటి దగ్గర కొచ్చేస్తున్నాం ... నాకు భయంగా వుంది...గుండాగిపోతుందేమో... అత్తయ్యగారూ నేను నేనిలా ఐపోతున్నానేమిటి ?— అక్కయ్యా ! అమ్మ కేదో అయిందే... నా మనసు చెపుతుందే అక్కయ్య."

అప్పటిదాకా అతి ప్రయత్నం మీద నిగ్రహించుకుంటున్న తులశమ్మకి దుఃఖం ఆగలేదు.

"ఊరుకో తల్లీ— మన చేతుల్లో ఏదీలేదు. వాడిలా ఎందుకు చేశాడో ఇంకా ఏంచేద్దామనుకుంటున్నాడో—"

తులశమ్మకన్నీళ్లు చూసేసరికి కృష్ణప్రియ పైప్రాణాలు పైకే పోయాయి. ఒక్క కుదుపున ఆగింది కారు.

కారును చుట్టబెట్టిన జనాన్ని అయోమయంగా చూసింది కృష్ణప్రియ

పిల్లల్నిద్దర్నీ చూట్టంతోనే ఘొల్లుమన్నారందరూ.

జరిగింది అర్థమై — పిచ్చిగా పరుగు తీసింది కృష్ణప్రియ

"అమ్మా !"

నిశ్చలంగా, ప్రశాంతంగా, చిరునవ్వు వదనంతో — సుఖనిద్రలో వున్నట్టు దీర్ఘనిద్ర పోతున్న ఆ యశోద కట్టెమీద పిచ్చిదాన్లా పడిపోయింది కృష్ణప్రియ.

అప్పటికే హిస్టీరియా రోగిలా బిగుసుకుపోయి పిచ్చిచూపులు చూస్తున్న పద్మిని — ఎదుటి దృశ్యం చూడగానే — విరుచుకుపడిపోయింది మరుక్షణంలో స్మృతి తప్పిపోయింది.

* * *

భారాన్నంతా నెత్తిన వేసుకుని రామచంద్రరావుగారే — కర్మకాండంతా యధావిధిగా జరిగించారు

పెళ్ళికోసం వుండిపోయిన బంధువుల్లో



ఇటీవల ఇండియా ఇంటర్‌నేషనల్ సెంటర్ (ఢిల్లీ)లో ప్రఖ్యాత నర్తకి శ్రీమతి బాలసరస్వతికి శ్రద్ధాంజలి ఘటించేందుకు సుప్రసిద్ధ నర్తకి యామినీ కృష్ణమూర్తి సంతాపసభ ఏర్పాటు చేసిన సందర్భంగా తీసిన చిత్రం. శ్రీమతి కపిలా వాత్స్యాయన్, శ్రీమతి యామినీ కృష్ణమూర్తి, శ్రీ రాంగోపాల్, కేంద్ర సమాచార మంత్రి శ్రీ హెచ్ కె.ఎల్. భగత్‌గార్లని చిత్రంలో చూడవచ్చు.

# కర్మ యోగి

ముఖ్యమైన కొందరు పన్నెండోరోజుదాకా విధిగా వుండిపోయారు. రామచంద్రరావు భార్యా, ఒకరిద్దరు పిల్లలు మటుకు మూడోరోజుదాకా వుండి వెళ్ళిపోయారు, ఐశ్వర్యానంతా పోగొట్టుకున్న యశోద తరఫున — దగ్గర బంధువులమని చెప్పుకుని పన్లంతా నెత్తిన వేసుకు చెయ్యగల అవసరం— చేస్తే వస్తే ప్రయోజనం లేదుకనుక ఎక్కడివాళ్ళక్కడే లాంఛన ప్రాయంగా పలకరించి తప్పుకున్నారు

ఇంత హడావుడిలోనూ — తులశమ్మకూ — కృష్ణారావుకూ ఏ మాత్రం లోటు జరక్కుండా నమ్మకమైన తన నౌఖర్ని—ఇరవైనాలుగ్గంటలూ వాళ్ల ఆధీనంలో వుంచారు రామచంద్రరావుగారు కొత్త వియ్యాలవారికి మర్యాదకి లోటు రానివ్వక పోయినా — తులశమ్మ — కృష్ణారావులకీ — ఈ పరిస్థితులూ - ఈ పరిస్థితుల్లో మరియాదలూ— ఇబ్బందిగా బాధగానే వున్నాయి

వున్న కొద్ది రోజుల్లోనే — అక్కడ పరిస్థితులన్నీ పూర్తిగా అర్థంచేసుకుంది తులశమ్మ.

జమీందార్ల ఇంటి ఆడపడచు యశోద బాగా ఆస్థిమంతుడైన భుజంగరావుకి ఇల్లాలైంది. బాగా స్థితిమంతుడైనా భుజంగరావుకు లేని వ్యసనమంటూలేదు ఐతే అన్నీ గుంభనంగా గుట్టుగా జరిగిపోయేవి

యశోద నగలతో సహా సర్వం హరించుకుపోయాక — ఒళ్ళు గుల్లైపోయాక — భుజంగరావు కళ్ళు తెర్చుకున్నాయి ఎన్ని దుర్గుణాలున్నా భార్యనీ — ఆడపిల్లలిద్దర్నీ కంటికి రెప్పలా చూసుకునేవాడు. తనకోసం ప్రాణాల్నైనా ఇవ్వగల స్థానాన్నీ — అనురాగాన్నీ వాళ్ళనుంచి సంపాదించుకుని నిశ్చింతగా కళ్ళుమూశాడు ఒక్కగానొక్క చెల్లెలు యశోదను ఆదుకుంటూ — ఇంతకాలం అండగా నిల్చాడు రామచంద్రరావు. ఐతే రామచంద్రరావు భార్య దుర్గకి అతనిలా ఆదుకోటం సుతరామూ ఇష్టంలేదు. కారణం ఇప్పుడూ ఎప్పట్లాగే వీళ్ళు ఎన్నదగ్గ ధనికుల్లో ఒకరు యశోద స్థితి ఈనాడు చితికిపోయింది. పైగా ఇద్దరు ఆడపిల్లలు రామచంద్రరావు తన ఆస్తిలో వాళ్ళకేమైనా పెడుతున్నాడేమోనని వెయ్యికళ్ళతో కనిపెట్టుకునే వుంటుంది యశోదతో పూర్తిగా సంబంధాలు తెంచుకోవాలని దుర్గ త్వరపడటానికీ కారణాలున్నాయి. దుర్గకి ఒక్కగానొక్క కొడుకు. మూడు తరాలదాకా తరగని ఆస్థికి వారసుడు పైగా పద్మినీ, కృష్ణలకు ఇద్దరికీ ఈడైనవాడే ఇద్దర్లో ఎవరి అందం చూసినా — ఎవర్ని ఇష్టపడ్డా — తనకు రావల్సిన కట్నం పోవటం అటుంచి — రెండో పిల్లపెళ్ళి బాధ్యత మీదపడటమే కాకుండా — యశోద మరింత దగ్గరౌతుంది అందుకే — బంధువుల్లోనూ — తనవాళ్ళలోనూ, తెల్సినవాళ్ళలోనూ యశోదన్నా, ఆవిడపిల్లలన్నా విముఖత్వం కలిగేలా కట్టుకథలల్లి ప్రచారం చేసింది అనుకున్న దానికన్నా ఎక్కువ ఫలితాన్నే అందుకుంది. కారణం ఐశ్వర్యం వుంది మాటకారితనం, నోటిదురుసూ — ఎక్కువగా వున్నాయి అన్నిటినీమించి ఉత్తమ నటికి ఉండదగ్గ లక్షణాలకన్నా ఎక్కువే వున్నాయి. వున్నవి లేనట్టూ, లేనివి వున్నట్టూ — కల్పించి — గంటల తరబడి అనర్గళంగా ఉపన్యాసాలుఇవ్వగలదు. అనవసరంగా ఏడవగలదు. ఎదుటివాళ్ళని ఏడిపించగలదు. పగపట్టిన త్రాచులా బుసకొట్టగలదు. పగతీర్చుకోగలదు. నీచులు దుష్టశక్తుల్ని ప్రసన్నం చేసుకున్నట్టు — ఆవిడచుట్టూ చేరిన గ్రహాలన్నీ దుష్టత్వానికి ప్రతిరూపాలే. పుట్టటానికి ఆడపుటకలేగానీ — ఒకొక్క గ్రహం ఎంత నీచానికైనా దిగజారగలదు. ఆకాశరామన్న ఉత్తరాలు సృష్టించటం — ఇంటింటికీ వెళ్ళి దుర్గమ్మగారి తరఫున ప్రచారాలు చెయ్యటం — ఆ కారణంగా యశోద కుటుంబాన్ని బజారుపాలు చెయ్యటం వాళ్ళ ధ్యేయం

యశోద పిల్లల్లో ఎవరూ తన ఇంటి కోడలు కాకూడదు

వాళ్ళ అందచందాలూ— సద్గుణాలూ— వాళ్ళకి హారాలు కాకూడదు.

అందుకే రామచంద్రరావు పద్మినికి దూర సంబంధాలు వెతకటం మొదలు పెట్టాడు. పద్మినిని తన కోడలుగా చేసుకోవాలన్న కోరికని తన భార్యవల్ల చంపుకోవల్సి వచ్చింది. తన కూతురుకన్నా ఎక్కువగా చూసుకునే పద్మినిని— తన ఇల్లనే నరకంలో పడెయ్యటం ఆయనకిష్టం లేదు తన కూతురు అంబి అన్ని విధాలా తల్లి నోట్లోంచే ఊడి పడింది ఈ దుర్గా, అంబిలు ఈ అమాయకురాళ్ళను బతకనివ్వరు. అందుకే వీళ్ళైనంత దూర ప్రాంతాలల్లో సంబంధాలు కుదిరితే బావుంటుందనుకున్నాడు దైవేచ్ఛవల్ల కృష్ణారావు సంబంధం కుదిరింది పిచ్చి యశోద ఇంత ఆనందాన్ని తట్టుకోలేకపోయింది. అప్పటికే మానసింగా ఎన్నో విధాలుగా దెబ్బతిన్న పిల్లలూ, ఈ అదృష్టం వెతుక్కుంటూ రావాటాన్ని ఎంతో అదృష్టంగా భావించారు ఐతే దురదృష్టంగా భావించింది దుర్గ ఇంత మంచి సంబంధాన్ని కన్న కూతురుకి కాకుండా చెల్లెలి కూతురుకి నిశ్చయించుకు వచ్చిన భర్తమీద తిరగబడింది అయితే తాంబూలాలూ—ఏర్పాట్లూ వెంట వెంటనే జరిగిపోవటంతో— పగబట్టిన త్రాచులా బుసలు కొట్టడం తప్ప మరేమీ చెయ్యలేకపోయింది.

రామచంద్రరావు నౌకరు ద్వారా, కొంతా— ఇరుగు పొరుగు ద్వారా మరికొంతా— ఇంకా మంచితనం చావని బంధువుల దగ్గర మరికొంతా సమాచారాన్ని సేకరించిన తులశమ్మ మనసులో కోడళ్లపట్ల జాలీ, ప్రేమా అనుకోనంతగా పెరిగిపోయింది తల్లి ద్వారా విషయాలు విన్న కృష్ణారావులోనూ సానుభూతి చోటుచేసుకుంది.

''కృష్ణా! విన్నావుగా. తల్లీ తండ్రీ లేని పిల్లలు పైగా జీవితంలో ఎన్నో ఎదురు దెబ్బలు తిన్నారు. ఇద్దరికీ కూడా మనకన్నా ఆత్మీయులూ— మనల్ని మించిన 'నా' అన్నవాళ్ళు వుండరు కృష్ణప్రియను నేనూ వదినా చూసు

కుంటాము. పద్మినిని నువ్వెలా చూస్తావో ఏమిటో—''

తల్లి మంచితనంలో దైవాన్నే చూడగలుగుతున్న కృష్ణా— తన్లో తను గొణుక్కుంటున్నట్టన్నాడు—

''భగవంతుడు వాళ్లకి అన్యాయం చెయ్యడులే అమ్మ.''

సంతోషం ఎక్కువకాలం బ్రతికిస్తుందనే ఆశను అతిసంతోషమే మృత్యురూపంలో హరించి సర్వం శూన్యం అయితే ఈ ప్రపంచంలో తమ కోసం తమకంటూ మిగిలివున్నదీ శూన్యంగానే వుంది.

ఆ భావననుండి బయటపడలేని పద్మినీ, కృష్ణప్రియులకు కన్నీరుకూడా కరువైపోయింది.

అతి విచిత్రమైన స్థితిలో వున్న వాళ్ళిద్దరినీ వోదార్చే పరిస్థితి కాదది వాళ్ళలో ఏర్పడిన శూన్యాన్ని నింపగల శక్తి ఒక్క కాలానికే వుంది. అడ్డూ ఆపూ లేకుండా ప్రవించే కన్నీటికే — గుండెల్లో మండే అగ్నిజ్వాలలను చల్లార్చే శక్తి వుంటుంది

అందుకే — వాళ్ళని ప్రస్తుతం కాలానికే — వాళ్ళ భవిష్యత్‌ను దైవానికే వదిలినా — వెళ్ళబోయే ముందు తటపటాయిస్తూనే — నాలుగు ముక్కల్లో ధైర్యం చెప్పాడు కొత్తదనం పోని పిల్లలిద్దరూ — మోకాళ్ళ మధ్య తలలు వాల్చుకుని వెక్కిళ్ళు పెట్టారు

''కృష్ణా—ఇవాళ పన్నెండోరోజు ఎటువంటి పరిస్థితుల్లోనూ రాత్రి దీపాన్ని చూడకూడదు వెళ్ళటం తప్పనిసరి అదీగాక లక్ష్మి ఒక్కతె ఎలా సతమతవౌతుందో ఏమిటో— ''

''నువ్వనేదేమిటమ్మా ?''

''ఏం లేదురా, పిల్లలిద్దర్నీ మనతో తీసుకు వెడదామని వుంది ఇప్పుడేకదిపితే కుర్రసన్యాసులు మరీ దిగులుపెట్టుకుంటారేమో —కదపకుండా మనదారిన మనంవెడితే — పద్మినితో బాటు కృష్ణప్రియ రాకపోవచ్చు. దానికి అభిమానం ఎక్కువ పైగా అమ్మతిరిగిన ఈ ఇంట్లోంచి బైటకు రానని భీష్మించుకు కూర్చుంది. దానికి తోడుగా పద్మినిని కొన్నాళ్ళుంచాల్సిందే తప్పదు. ఆ కొన్నాళ్ళు ఎంతోకాలం లేదని తెల్సినా— పాపం వాళ్ళని చూసేవాళ్ళెవరూ ఇక్కడలేరురా. ఎంత సేపు — ఆ రామచంద్రరావుగారు తిరగాల్సిందే. ఇప్పటికే ఆయన తిరిగి సగమయాడు—''

తల్లి చెప్పబోయేది సూటిగా చెప్పలేకపోతోంది. తడబాటులో ఉద్దేశ్యం అస్తవ్యస్తంగా వున్నా తల్లి మనసులో మధనపడే అసలు విషయాన్ని అర్థం చేసుకోగలిగాడు కృష్ణారావు.

తల్లికి —పద్మినినీ, కృష్ణప్రియనూ ఇద్దర్నీ తీసుకువెళ్ళాలని వుంది. మరో అండలేని — కృష్ణప్రియ ఇక్కడ ఎక్కువకాలం వుండలేదు కూడా. అర్థబలం, అంగబలం లేని ఈచోట కృష్ణను వుంచటం శ్రేయస్కరం కాదన్న తల్లి వాదనలో



# కర్మయోగి

బలంవున్నా, తననోటి ద్వారా చెప్పటానికి సాహసించలేకపోయాడు కృష్ణారావు అన్ని సమస్యల్నీ కాలమే పరిష్కరిస్తుంది ఎటువంటి బాధలైనా కాలమే నివారణ చూపించ గలుగుతుంది

అందుకే మాట్లాడలేదు కృష్ణారావు.

''బాబూ మీకు తెల్సి చేసుకున్నారో — తెలియక చేసుకున్నారో తెలీదు—కానీ ఏ మాత్రం తెల్సున్నవాళ్లైనా, పద్మినిని వివాహం చేసుకోరు కారణం ఏమిటంటారు ఆ అమ్మాయికి మూర్ఛలరోగం. అదిప్పటిది కాదు. తండ్రి పోయినప్పట్నుంచీ మొదలైంది. ఇంతకాలం తల్లి సంరక్షణలో తల్లి తెలివితేటలవల్ల కప్పబడి పోయింది ఐనా మీలాంటి వాళ్లొకరిద్దరికి తెల్సుననుకోండి. ఇప్పుడు మీరు గమనించారో లేదో— తల్లి పోయిన రోజు నుంచీ — మూర్ఛలు మళ్లీ మొదలయాయి. ఆ రామచంద్రరావు తెలివిగలవాడు కనుక మీ కంట పడనివ్వకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. అందుకే మిమ్మల్నిద్దర్నీ అతఃపురంలో పెట్టి రాజ మర్యాదలు చేస్తున్నాడు. కారణం తెలుసుకున్నారా ? మీ మీద అభిమానం కాదు — అమ్మాయికి దూరంగా కనపడకుండా వుంచటానికే. మీరు గమనించారో లేదో తులశమ్మ గారు అమ్మాయిల గదిలోకి వెళ్లినప్పుడల్లా — తెలివిగా—పద్మిని దగ్గరకు రానివ్వకుండా చేయిస్తున్నాడు. నేరంగా చెప్పటంలేదు గానీ ముందు ముందు మీ సంసారం నరకమైపోతుంది. అదే బాధ.''

రామచంద్రరావు బావమరిది అవకాశం దొరికినప్పుడల్లా కృష్ణారావు చెవులు కొరుకుతూనే వున్నాడు.

ఐనా నిర్లిప్తంగానే వుండిపోయాడు కృష్ణారావు.

''ఏరా—ఏమిటిదీ ? మన పద్మినిని గురించి ఇలా అనుకుంటున్నారేమిటి ?''

## మామూలే !

విన్నకొద్దీ
చెప్పుడు మాటలు
తిన్నకొద్దీ
తీపి
వెగటని — తప్పని
తెలుసన్నది
ప్రసూతి వైరాగ్యమంత.

— మాధవరపు కృష్ణ

తల్లి ఆందోళనను తేలిగ్గా తీసిపారేశాడు కృష్ణారావు

''మనం నమ్ముకున్నది ఆ భగవంతుడిని. నమ్మవల్సిందీ ఆయననే ఎవరో ఏదో అన్నారని బాధ పడట మెందుకమ్మా. అదే నిజమైనా ఇప్పుడు మనం చెయ్యగలిగింది మటుకేముంది ? చెయ్యాల్సిందల్లా ఆవిడ మనసుకి బాధ కలగనియ్యకుండా చెయ్యటమే. పద్మిని గాజు బొమ్మ లాంటిదని వాళ్ల అమ్మగారే అన్నారు. గాజు బొమ్మలాగే జాగ్రత్తగా చూసుకుంటే సరి.''

తులశమ్మ కళ్ళు ఆర్ద్రంగానూ, ఆనందంగానూ మెరిశాయి

తన కొడుకు నుంచి ఈ రకమైన సమాధానం వస్తుందని ముందుగా అనుకోకపోవటం వల్ల— ఈ ఆనందం అంతై— ఇంతై— కళ్ళ నిండుగా కమ్ముతుంది.

''భగవంతుడా— పెళ్ళే వద్దన్న వాడిచేత కూడా పసుపుతాడు కట్టించావు. పెళ్ళాన్నెలా చూస్తాడా అనుకునే సమయంలో— వాడి నోటి వెంట ఈ మాత్రం చల్లని మాటలు అన్పిస్తున్నావు. నిజంగా— నువ్వున్నావు తండ్రీ ... నువ్వున్నావు —''

తులశమ్మ ఆనందం చూసిన కృష్ణారావులో ఒక విధమైన తృప్తి చోటు చేసుకుంది

ఆ తృప్తి అందించిన సంతృప్తి సరికొత్తగా వుంది.

''పద్మినీ వెళ్ళొస్తాం తల్లీ. మీకెవరూ లేరనుకోకండి. అమ్మలాంటి దాన్ని నేనున్నాను. పుట్టిల్లైనా, మెట్టినిల్లైనా మనిల్లే నీకు. నువ్వెప్పుడు వుండలేననుకుంటే అప్పుడే చెల్లాయిని తీసుకుని వచ్చేసెయ్యి. ఆ పసిది ఇక్కడుండి మాత్రం ఏం చేస్తుంది ?''

ఓదార్పుగా దగ్గరకు తీసుకున్న అత్తగార్ని బేలగా చూస్తుండిపోయింది పద్మిని

''అమ్మాయ్ కృష్ణా — మనసును రాయి చేసుకోవాలమ్మా నిద్రాహారాలు మానేసి అలా కుళ్ళి కుళ్ళి ఏడిస్తే పోయినవాళ్ళు తిరిగొస్తారా చెప్పు వస్తారంటే చెప్పు. జీవితాంతం అన్నమూ తిండీ మానేసి ఏడుస్తూ ఎదురు చూద్దాం. చూడూ — మీ నాన్నగారు తిరిగి వచ్చారా ? మా రామకృష్ణుడు వచ్చాడా ? పోయినవాళ్ళు ఎవరుమటుకొచ్చారు ? ఇవాళ పోయినవాళ్ళకోసం రేపు పోబోయే మనం దుఃఖపడటం ఏం బావుంటుంది చెప్పు. అందరం ఒక చోటికి జేరుకోవల్సిన వాళ్ళమే వాళ్ళు వెళ్ళబోయే రైలు ముందరిది — మనం వెళ్ళాలనుకున్నా ఆ కాలం వచ్చేదాకా ఆగటం తప్పనిసరి.''

పైకి వోదారుస్తున్నా — ఆ దుఃఖం ఎటువంటిదో — మనసులో ఎటువంటి దావానలాన్ని సృష్టిస్తుందో బాగా తెల్సు తులశమ్మకి. కడుపు నిండినవాళ్ళు ఆకలితో అలమటించే వాళ్ళను వోదార్చటం తేలిక. అయితే ఆకలి తీర్చటం ఆత్మీయుల విధి.

# మైసూర్ ల్యాంప్స్
## 'మెరుపు వెలుగు' పోటీ



**మొదటి బహుమతి:**
**50,000 రూ. విలువగల**
**బంగారం ఆభరణాలు**
**(లేక 50,000 రూ. నగదు)**

**రెండు ద్వితీయ బహుమతులు**
**ఒక్కొక్క బహుమతి: స్కూటర్**
**(లేక నగదుగా 11,000 రూ.)**

**మూడు తృతీయ బహుమతులు:**
**ఒక్కొక్క బహుమతి: మోపెడ్**
**(లేక నగదుగా 5,000 రూ)**

**నాలుగవ బహుమతులు: యాషై.**
**ఒక్కొక్క బహుమతి: వాచ్**
**(లేక నగదుగా 300 రూ)**

**1000 సమాధానపు**
**బహుమతులు: టీషర్టు**
**ప్రతివారము మొట్టమొదటి**
**ఎంట్రీ బహుమతులు: యాషై**

### బంగారములాంటి అవకాశము

నమ్మ శక్యముగాని ఎన్నో విలువైన బహుమతులు మీ కోసము కాచుకొని వున్నాయి 50,000 రూ విలువగల బంగారు ఆభరణాలను ఒకసారి ఊహించుకోండి వాటిని గెలుచుకొనే ఎంట్రీ మీదేగావచ్చు
అంతేకాదు స్కూటర్లు, మోపెడ్లు వాచ్‌లు. ఇతర 1000 ఆకర్షణీయ బహుమతుల సంతర్పణ

### పాల్గొనడము చాల సులభము

ఎంట్రీ ఫారంలో చూపబడ్డ 5 చిత్రాలను గమనించండి అందులో వివిధ రకాల వెలుగునిచ్చే సాధనాలు టార్చ్ లైట్, ట్యూబ్ లైట్, పెట్రొమాక్స్, ఒత్తి తో వెలిగే దీపము, బల్బ్ మరియు వాటిలో వెలుగును వెదజల్లేందుకు వాడే ప్రధాన ఉపకరణాలు చూపబడ్డాయి మీరు చేయవలసిందల్లా వెలుగునిచ్చే సాధనానికి దాని ప్రధాన ఉపకరణముతో జత చేయడమే ఉదాహరణకు బ్యాటరీ సెల్స్ (B) టార్చ్‌లైట్ యొక్క ప్రధాన ఉపకరణము కాబట్టి 'B' ని టార్చ్‌లైట్ చూపబడ్డ బాక్స్‌లో టార్చ్‌లైట్ క్రింద వ్రాస్తే సరిపోతుంది అలాగే తక్కిన A, C, D, E అక్షరాలను తత్సంబంధ బాక్సులలో ఆయా పరికరాల క్రింద వ్రాయాలి చాల సులభము గదా!

### వాక్యాన్ని పూర్తి చేయండి

దిగువ ఇవ్వబడ్డ వాక్యాన్ని ఒకే ఒక పదంతో పూర్తి చేయండి
మైసూర్ ల్యాంప్స్‌తో ఆ
ప్రకాశవంతమైంది
ఉదాహరణకు మేము ఆవాక్యాన్ని ఈ విధంగా పూర్తి చేశాము.
మైసూర్ లాంపులతో ఇల్లు
ప్రకాశవంతమైంది
ఇంతకంటె మంచి పదముతో వాక్యాన్ని మీరు పూరించాలి పొందబోయే గొప్ప బహుమతులను బాగా జ్ఞప్తి కుంచుకోండి మీ ఎంట్రీలను వెంటనే పంపండి

మొదట చేరిన ఎంట్రీలు మొట్టమొదటి ఎంట్రీల బహుమతితో బాటు ఫైనల్ బహుమతులకు గూడ అర్హత పొందగలవు
మీ కిష్టమైనన్ని ఎంట్రీలను పంపుకోవచ్చు ప్రతి ఎంట్రీతో బాటు మైసూర్ ల్యాంపు బల్బ్ పాకెట్ నుండి కత్తిరించబడ్డ పూర్తి సైజు ధర కలిగియుండే లేబుల్ విధిగా జతచేర్చి పంపాలి బల్బ్ ఏ వాటేజ్‌దైనా సరే 25, 40, 60 లేక 100 వాట్ ప్రతి ఎంట్రీతో బాటు దరగల లేబుల్ వుండి తీరాలి



మొట్టమొదటి ఎంట్రీలు ప్రతివారము మాకుచేరిన ఎంట్రీలలో మొదట చేరిన 50 న్యాయమైన ఎంట్రీలకు ప్రతి ఎంట్రీకి 50 రూ గిఫ్ట్ చెక్కుమూలకంగా పంపబడును

### నియమాలు నిబంధనలు

ఎంట్రీలు ఇంగ్లీషులోగాని లేక ఇతర భారతీయ భాషలలోగాని పంపవచ్చు. ఎంట్రీ ఫారంను పంపే కవరు పై "మెరుపు వెలుగు పోటీ" అని విధిగా వ్రాసి, తగిన పోస్టేజి స్టాంపు అంటించి సాధారణ పోస్టుతో మాత్రమే పంపాలి న్యాయ నిర్ణేతలదే తుది నిర్ణయము అందుకు ఎంట్రీదారులందరూ బద్ధులైయుండ గలరు ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు అంగీకరించబడవు గడువు దాటిన తర్వాత అందిన ఎంట్రీలకు, మాకు చేరని వాటికి చేరువాటిక నక్రమ పద్ధతిలో చేరినవాటికి మైసూర్ ల్యాంప్స్ వారు జవాబ్దారి కానేరరు ఈ పోటీలో పాల్గొనేందుకు భారతదేశంలో నివాసమేర్పరచుకున్న వారందరూ అర్హులే మైసూర్ ల్యాంప్ వర్క్స్ లిమిటెడ్, క్లారియన్ అడ్వర్టైజింగ్ సర్వీసెస్ లిమిటెడ్ వుద్యోగులు మరియు వారి దగ్గర బంధువులు ఈ పోటీలో పాల్గొనేందుకు అనర్హులు

మొదటి మూడు బహుమతి విజేతల పేర్లు పత్రికల్లో ప్రకటించబడును. ఇతర విజేతలకు పోస్టు ద్వారా తెలియజేయబడును బహుమతులు భారతీయ వున్న చట్టమునకు లోబడినవి

### బాగా జ్ఞప్తి కుంచుకోండి

నిజమైన కాంతి ప్రసార సాధనాన్ని గుర్తించేది సులభము, వాక్యాన్ని పూర్తి చేయడము గూడ సులభమే మీ అదృష్టము పండే సమయము దగ్గరలోనే వుంది ముగింపు తేది 16 జూలై 1984. ప్రతి వారము మొదట చేరిన ఎంట్రీలకు బహుమతులున్నాయి
మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా

**ది మైసూర్ ల్యాంప్ వర్క్స్ లిమిటెడ్**

పోస్టుబాక్స్ నెం 5551
మల్లేశ్వరం వెస్ట్ పోస్టు
బెంగుళూరు 560055

### మైసూర్ ల్యాంప్స్ అధికృతమైన

ఎంట్రీ ఫారం




ఒక పదముతో వాక్యాన్ని పూర్తి చేయండి.

మైసూరు లాంప్స్‌తో ఆ ______________ ప్రకాశవంతమైంది.

పేరు ______________

విలాసము ______________

CLARION/MLW/84177

# ఇవే మన పద్యాలు




స్త్రీలు గల్గుచోటు శెల్లాటములు గల్గు
స్త్రీలు లేని చోటు చిన్నబోవు
స్త్రీల జూచి మరువ శేకూరు యోగంబు
విశ్వదాభిరామ వినుర వేమ.

## కర్మయోగి

కన్నీళ్ళు తుడుస్తూ — కృష్ణప్రియను గుండెలకు హత్తుకుంది తులశమ్మ. గుండెల్ని చీల్చుకుంటూ వచ్చింది దుఃఖం.

ఏడుపు ఆపుకోలేక పసిపిల్లలా వెక్కిళ్ళు పెట్టింది కృష్ణ

"ఊరుకోమన్నానా — మీకెవరూ లేరని అనుకోవద్దన్నానా— బాధ వుంటుంది ఎందు కుండదూ— అది సహజం. అందులో కన్నతల్లి— అమ్మా— మీ అమ్మలాంటి దాన్ని— ఎటువంటి లోటు లేకుండా చూసుకుంటాను. నాకు నువ్వొకటీ— అక్కయ్య వొకటీ కాదు. నీ స్వంత ఇంటి కొచ్చినట్టే రామ్మా —"

అక్కచెల్లెళ్ళకి వోదార్పు అందిందో లేదో కాని —

అక్కడే వుండి వినోదం చూస్తున్న బంధువులకి మటుకు బాధగానే వుంది. తల్లి పోవటంతో— ఈ అక్క చెల్లెళ్ళు దిక్కులేని వాళ్ళవుతారని ఊహించారు. పద్మినికి పెళ్ళైనా— వ్యాపించిన వదంతులవల్ల — ఆ అమ్మాయి సంసారం ఎంతోకాలం సాగదనీ— అత్తగారు తన్ని తగలేస్తారనీ ఆశపడ్డారు.

ఎటువంటి ముద్దూముచ్చట్లూ లేకుండా— ఎటువంటి వేడుకలూ జరక్కుండా—ఏ అల్లుడూ— మామూలుగా వుండగలడని ఎవ్వరూ అనుకోలేదు. అసలు పెళ్ళాన్నే ఏలుకోరనుకున్నవాళ్ళు—మరదల్ని కూడా తీసుకువెడతాననటం— పూర్తి బాధ్యతను స్వీకరిస్తాననటం— ఇలా బాధే అన్పించింది చాలా మందికి.

చేప గిట్టునపడి — నిస్సహాయంగా తన్నుకుంటూంటే — చూసి ఆనందించే రాక్షస ప్రవృత్తి ఎంతో మందిలో అజ్ఞాతంగా వుంటుంది.

అత్తపోరు వల్ల కృష్ణప్రియ జీవితం అలా అయుంటే సంతోషించేవారు మరి.

పద్మిని కాపురంలో కలతలొచ్చి — తిరిగొస్తే— కడవలకొద్దీ కన్నీరు కార్చే అవ్వలు ఆ అవకాశం లేకుండా పోయినందుకు బాధపడ్డారు.

"రామచంద్రరావుగారూ — అమ్మాయి అత్తారు అతి మంచివాళ్ళల్లే వున్నారల్లేవుందే."

ఆడంగితనంపోని పెద్దమనిషి అక్కసు దాచుకుని విధిలేక అంటుంటే— రామచంద్రరావు గుండె మంట కాస్త చల్లారినట్లైంది.

"వెళ్ళేముందు చెప్పకూడదంటారు—ఐనా వుండబట్టటంలేదు — అమ్మాయిలిద్దరి ఆరోగ్యం అంత బావున్నట్టు లేదు. వుండగలిగినంత కాలం వుంచి ఇద్దర్నీ మా దగ్గిరకు పంపెయ్యండి."

పరిస్థితులు అర్థం చేసుకున్న ఆ తల్లికి రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టాడు రామచంద్రరావు.

నొచ్చుకునటున్నట్టు చూసింది తులశమ్మ.

"బావుంది. ఎందుకలా? ఇప్పుడు సంబంధం కలిసింది కనుక మా అమ్మాయిలే అందుకే రమ్మని చెప్పే స్వాతంత్ర్యం నాకుందనుకుంటున్నాను—"

చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకున్నాడు రామచంద్రరావు.

"వుందమ్మా వుంది. తప్పకుండా మీకే వుంది. మా యశోద ఏ లోకంలో వుందో గానీ, దాని ఆత్మకు ఇంతకు మించిన ఆనందం మరొకటుంటుందా? — దాని పిల్లలు అదృష్టవంతులు—"

రామచంద్రరావు మరొకసారి అనుకున్నాడు. ఎన్నోసార్లు అనుకున్నాడు. కృష్ణారావు, తులశమ్మల కారు కనుమరుగయేదాకా— అలాగే నిలబడిపోయాడు.

(ఇంకా వుంది)

దగ్గరకొచ్చి గమనించండి

# సూపర్ రిన్
# విమ్ముతూన్న మరింత తెల్లదనం
## దీనికి సరిపడే డిటర్జంట్ బిళ్ల మరొకటి లేదు.

**సూపర్ రిన్ తెల్లదనం**
**మిరుమిట్లు గొల్పుతుంది :**

దగ్గరగా వచ్చి చూడండిక.
ఆకర్షణీయమైన, కొత్త ర్యాపర్,
మరి దాంతోబాటే తాజాదనం
చిందే సరికొత్త సువాసన!




హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS RIN 69 2315 TL

ఈ ఉత్తమ సందేశాన్ని చెబుతూ ఉపన్యాసం విరమిస్తున్నాను,'' అంటూ కూర్చున్నాడు.

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. శ్రీనివాసరెడ్డి నిర్మించిన వినయ్‌మూవీస్ ''ముఖ్యమంత్రి'' చిత్రం ఏప్రిల్ 19న విడుదల.

## "డిస్కోకింగ్" తో పాత్రికేయుల గోష్ఠి

డిస్కోకింగ్ చుట్టూ కొందరు పత్రికా విలేకరులు కూర్చొని ఉన్నారు– వారిలో ఒకరు (గణేశ్‌పాత్రో) ''ఒసిబిసా పర్యటనలో కూడా వసూలు కానంత మొత్తం మీ ప్రోగ్రాంకి వసూలైంది కదా, ఇంత రికార్డు సాధించినట్టు తెలియగానే మీకేమనిపించింది ?'' అని ప్రశ్నించారు.

డిస్కోకింగ్ (బాలకృష్ణ) సమాధానం : ''ఇది నా రికార్డు అనుకోవడంలేదు నేను. ప్రజలకు డిస్కో సంగీతం పట్ల గల రికార్డు. అంతే !''

''మీరు డిస్కో డాన్సు ఎక్కడ నేర్చుకున్నారు ?''

''ప్రకృతిని చూసి నేర్చుకున్నాను– అడుగడుగునా లయ విన్యాసాలతో నిండిన ఈ జగత్తు నా గురువు, నా తల్లి, నాకు దైవం.''

''మీ విజయానికి మీ తల్లిగారు ఎంతవరకు బాధ్యులు ?''

''ఆమె చిన్నప్పుడు నేర్పిన మాటలే ఈరోజు నాకు పాటలయ్యాయి, చిన్నప్పుడు ఆమె సవరించిన నాతప్పటడుగులే ఈరోజు ప్రజలు ఆదరించే నా అడుగులయ్యాయి. నేను పుట్టకముందే ఆమె నా గురించి కన్న కల– ఈరోజు నేనయ్యాను,'' అంటూ డిస్కోకింగ్ వెళ్లి తల్లి పక్కన కూర్చున్నాడు.

కెమెరా క్లిక్‌మంది.

తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అశోక్ నిర్మించిన శ్రీ విష్ణు ఫిలిమ్స్ ''డిస్కోకింగ్'' చిత్రం ఏప్రిల్ రెండోవారంలో విడుదల.


'డిస్కోకింగ్' లో బాలకృష్ణ, తులసి


'దానవుడు' శోభన్‌బాబు

## మెహబూబ్ ప్రొడక్షన్స్

''తెనాలి పరిసరాలలో ఏప్రిల్ రెండవవారం నుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగిస్తాం,'' అన్నారు బొబ్బిలి ప్రకాశరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మెహబూబ్ ఖాన్ సమర్పించే చిత్రంలో రామకృష్ణ, ప్రభ నాయకానాయికలు. హరిబాబు మాటలు,పాటలు రాశారు. మాధవరావు సంగీతం, సి. హెచ్. యజ్ఞనారాయణ ఛాయతో, సి. పళని, మెహబూబ్ బేగం నిర్మాతలు.

# సినిమా

## "బంగారు కాపురం" రెండో షెడ్యూల్

"మార్చి 1 నుంచి 14 వరకు జరిగిన మొదటి షెడ్యూల్‌లో నాలుగు పాటలు, కొన్ని సన్నివేశాలు పిక్చరైజ్ చేశాం," అన్నారు సి. చంద్రశేఖరరెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బూర్లె రామకృష్ణారావు సమర్పించే శ్రీ పంచవటి చిత్రాలయవారి పై చిత్రం రెండో షెడ్యూల్ ఏప్రిల్ 1 నుంచి 10 వరకు, చివరి



'సితార'లో భానుప్రియ

షెడ్యూల్ మే 1 నుంచి 10 వరకు జరుగుతాయి. కృష్ణ, జయసుధ, జయప్రద, రావు గోపాలరావు, అల్లురామలింగయ్య, రమణమూర్తి బాలాజీ, ఎస్. వరలక్ష్మి, అన్నపూర్ణ, స్వప్న ప్రియ, అనుపమ, వై. విజయ, స్మిత, జయమాలిని, అనూరాధ వగైరా తారాగణం. కోగంటి విజయకుమార్ నిర్మాణ సారథి — సత్యానంద్ సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతం, లక్ష్మణ్‌గోరే ఛాయ, భాస్కరరాజు శిల్పం, గౌతంరాజు కూర్పు, పొన్నతోట రఘురాం ప్రొడక్షన్, మన్నె రాధాకృష్ణ—రావ్‌సూరి సహదర్శకత్వంతో కోగంటి విశ్వేశ్వరరావు నిర్మాత.



కృష్ణ, జయసుధ, 'బంగారు కాపురం'

'కాప్ యాప్'లో జితేంద్ర, రాధ



# సంపూర్ణ ఆరోగ్యానికి-సంతృప్తికర మైన భోజనానికి

1



**A. S.** బ్రాండ్ పప్పునూనె మరియు మాన్షన్ బ్రాండు నువ్వులనూనెతో తయారయ్యే వంటకాలతో మీరు ఎన్నడూ చేయనంత సంతృప్తిగా భోజనం చేస్తారు వంటకాల్లో వచ్చే రుచి, కమ్మదనం అద్వితీయం.

2




అన్నిరకాల ఊరగాయలను సంవత్సర పొడుగునా మెత్తబడనీయకుండ, రుచికరంగా, ఘుమఘుమలాడుతూ, తాజాగా ఉంచుతుంది.

3



గుండెపోటు, రక్తపోటు అరికట్టడంలో గొప్పగా సహాయపడుతుంది.

**16, 4, 2** కేజీల డబ్బాలలో ఇండియన్ గవర్నమెంట్ వారి అగ్‌మార్కు సీలుతో లభించును.






SAIKRUPA/ASC/83

అంబటి సుబ్బన్న అండ్ కో. సామర్లకోట A P.

## జి. వి. — ఆదోని

దేవుళ్ల పటాలకు, విగ్రహాలకు టెంకాయలే ఎక్కువ కొడతారెందుకు? మరే యితరమైనవేనా యివ్వొచ్చుగా?

★ ఇవ్వొచ్చు. కాని అది పూజార్లకి లాభసాటి కాదు.

భార్యలను చిత్రహింసలు పెట్టే భర్తల పైనా, భర్తలతో వంట చేయిస్తూ హాయిగా కూర్చుని మీలాంటి రచయిత్రిలు రాసిన నవలలు చదువుతూండే భార్యలపైనా మీ అభిప్రాయం ఏమిటి?

★ భార్యలను చిత్రహింసలు పెట్టే వాళ్లు సాడిస్టులు. వారి పాలపడ్డ భార్యలకి ధైర్యం వుండి— బయటపడ కల్గాలి. ఇక వంటొచ్చిన భర్త, చదవనేర్చిన భార్యలంటారా— అది వారి స్వంత విషయం కదా— వాళ్లు హాయిగా వుంటే మనకెందుకు అనవసరపు బెంగ?!

## బి. వి. ఆర్. — కొత్తపట్నం

మన ముఖ్యమంత్రిగారు ప్రధానమంత్రి అయితే ప్రజలు మెచ్చుకుంటారా? తిట్టుకుంటారా?

★ ఆ పొజిషనుకి ఎక్కేశాక— ప్రజలేమనుకున్నా బాధలేదు.

## కె. డి. బి. — మచిలీపట్నం

ఉత్తమ రచనకు కొన్ని లక్షణాలున్నట్టే ఉత్తమ రచయిత్రులకు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉండాలా? ఏమిటవి?

★ ఉత్తమ రచన లక్షణాలేమిటో మీరు చెప్పందే? మానిందే మందు/ఆడిందే సినిమా అన్నట్టు అచ్చయినదే— ఉత్తమ రచనా? లేక ఎడిటర్స్ మెయిల్ చేసినదే ఉత్తమ రచయితా? ఎప్పుడు బాగుండేవి బాగులేనివి వుంటాయి. ఉత్తమ, చెత్త లాంటివి నాకు అర్థం కావు




## సి.హెచ్. ఆర్. — కర్నూలు

నేను అతిగా ఆత్మవిమర్శన చేసుకుంటాను. అందుకని అందరిలో చులకనగా భావించ పడుతున్నాను

★ ఆత్మ విమర్శన అంటే మనని మనం ఆడిపోసుకోవడం కాదు తమ్ముడూ— క్షణంపాటు మనం చేస్తూన్నది తప్పో ఒప్పో అని ఆలోచించుకోవడం. 'నే నుట్టి వెధవాయినోయ్' అంటే అంతా 'తమరుట్టి వెధవాయి' అంటారు. అది లోక నీతి, అందుకే వ్యక్తిగా మనని మనం గౌరవంగా చూసుకోవడం కూడా చాలా ముఖ్యం అంటాన్నేను

## పి. యి. ఎమ్. — కాశీబుగ్గ

ఒక ఆడది మోసం చేసినంత మాత్రాన ఎంతో విలువైన వస్తువు పోగొట్టుకున్నట్టుగా బాధపడుతున్న నా స్నేహితునికి మీరిచ్చే సలహా ఏమిటి?

★ మననడిగి మోసపోయాడుటండీ— మన సలహా పాటిస్తాడనుకుందుకు? ... అయినా— ఇలాంటి విషయాలకి— స్వంత వైద్యమే మేలు

మీరిచ్చే సమాధానాలు నాకు చాలా యిష్టం అంటే నమ్ముతారా?

★ నమ్మాలనే వుంది!



## కె. కె. — కుణుతూరు

కట్నం అనే పదం ఆడదానిపాలిట పిశాచం. మీరేమంటారు?

★ పిశాచాన్ని నేను చూడలేదు. కట్నం పీడితులను చూశాను. అడిగిన వారికీ సిగ్గుండదు. 'ఇచ్చేనా' పిల్లకి పెళ్లి చేసేద్దామనుకునే వారికీ సిగ్గులేదు అనిపిస్తుంది నాకు.

## డి. ఆర్. — తిరుపతి

ప్రేమ పవిత్రమైనది కదా. ఆ మాటకు పవిత్రత లేకుండా చేస్తున్నారు నేటి యువతరం. ఆవేశం తప్ప ఆలోచన వుండడం లేదు

★ ఆ మాట అన్నారు బాగుంది కాని ప్రేమలో పవిత్రతకంటే ఆత్రుతేకద ఎక్కువ?!

## ఎమ్. కె. ఎమ్. — అమలాపురం

మీరు డాక్టరా?

★ ఆం డా॥ కె. రామలక్ష్మి, పిహెచ్‌డి. (గాస్ అండ్ గాసిప్!) అందుకే వేసుకోను. మరీ మీరంతా బాధపడతారని!

## ఎమ్. ఎమ్. కె. — హైద్రాబాదు

మాకు ఇంగ్లీషు మాట్లాడ్డం రావాలంటే ఏంచెయ్యాలి! గ్రామరు ఎంత చదివినా అర్థం కాదు.

★ ఇంగ్లీషు రావాలంటే—మాట్లాడాలి — గ్రామరు తల్చుకుంటూ కాదు భావం మోసిందా అనుకుంటూ ..ఎదుటివారు తప్పులు కరెక్టుచేస్తే బాధపడకూడదు.. భాషవచ్చిన వారితో మాట్లాడాలి — మళ్లీ రానివారితో 'యిసెడ్ ఐసెడ్' అంటూవుంటే వున్న భాష కాస్తా పోతుంది!..

## జె. ఎస్. — ముదిమాణిక్యం

నేనెన్ని ప్రశ్నలు వేసినా జవాబు శూన్యం. కాని— ప్రేమించి పెళ్లి చేసుకోవాలా? పెళ్లి చేసుకొన్నాక ప్రేమించాలా లాటి వాటిని ప్రచురిస్తున్నారు. ఇంతకంటే ఘోరం వుందా?

★ లేదు బ్రదర్. కాని మీ ప్రశ్న యింత కంటే ఘోరమైంది కాదు కదా?!

## పి. యి. ఎమ్. — కంచరపాలెం

మీరు చాలా కోపిష్టి అని చాలా మంది అంటుంటారు. నిజమా?

★ ఏమిటీ? నా కోపం చవిచూసి— ఆ వార్త చెప్పడానికి— వాళ్లింకా మిగిలే వున్నారా! అంటే నా రాక్షసత్వం కాస్త క్షీణిస్తుందా ఏమిటి— అనుమానంగా వుంది.

## టి. ఎల్. ఆర్. — మారంపల్లి

ఆత్మశాంతికై రెండు నిముషాలు మాత్రమే మౌనం పాటిస్తారెందుకు?

★ ఆ రెండునిముషాలూ—ఎంత సుదీర్ఘంగా అనిపిస్తాయో తెలియదా మీకు? ★

# మామయ్య కోరిక

గుడిసేవ సుందరరామయ్య

'సీతారావుడూ... నన్ను కూడా ఓసారి విమాన మెక్కించరా!'

అయిదేళ్ల క్రితం మామయ్య నాతో అన్న మాటలు గుర్తుకు వచ్చి నా కళ్లు చెమ్మగిల్లాయి.

పైలట్ ఆఫీసర్‌గా నాకు వుద్యోగం వచ్చిందని తెలియగానే మామయ్య కోరిన మొదటి కోరిక అది. నాకు తెల్సినంతలో మామయ్య ఎప్పుడూ ఎవ్వరినీ ఏదీ కోరేవాడు కాదు. కోరవలసిన అవసరం కూడా ఆయనకు లేదు. అంతే కాదు! పదిమంది కోరికలు తీర్చగల శక్తి, సామర్థ్యాలు ఆయనకున్నాయి.

మామయ్య వాళ్లది నెల్లూరుకు దగ్గర్లో వున్న ఓ పల్లెటూరు. ఆ వూళ్లో మామయ్య మకుటంలేని మహారాజులా చెలామణి అయ్యాడు. అక్కడ రకరకాలైన కులాలవాళ్లున్నారు. పేదవాళ్లున్నారు. గొప్పవాళ్లున్నారు. అయినా అంతా మామయ్యనే గౌరవిస్తారు, అభిమానిస్తారు, ఆరాధిస్తారు. అందుక్కారణం ఆయన అలవర్చుకొన్న ఉన్నతమైన వ్యక్తిత్వమే. ధనవంతులెందరో వూరినంతట్నీ తమ గుప్పెట్లో పెట్టుకోవాలని ఎంతో ప్రయత్నించి విఫలమయ్యారు.

మామయ్యకు ఊహ తెల్సేనాటికే తాతయ్య పదెకరాల మాగాణి భూమిని, ఇరవై ఎకరాల మెట్టభూమిని రూపాయిలుగా మార్చి తాగేశాడు. మామయ్యకు ఆయన వదిలివెళ్లిన ఆస్తి కేవలం ఆ తర్వాత షావుకారుదగ్గర తాతయ్య లోగడ చేసిన పదివేల అప్పుకు వడ్డీకట్టి ఆ బాకీక్రింద పెద్దలనాటి పెంకుటిల్లును, విశాలమైన స్థలంతోసహా జమకట్టి ఋణవిముక్తుడయ్యాడు.

అన్నీపోగా ఆయనకు మిగిలిన ఆస్తి రెండెకరాల మాగాణిభూమి, పెళ్లికి ఎదిగివున్న మా అమ్మ. అదృష్టంకొద్దీ మాగాణిభూమి వూరికి ఆనుకొనే వుండటంచేత చేలోనే రెండు నిట్టాళ్ల పాక వేయించాడు. చేలోనే ఓ చిన్న చెరువు త్రవ్వించాడు.



రెండెకరాల మాగాణి, పదివేల అప్పు. అలాంటి దుర్భర పరిస్థితుల్లో మామయ్య సంసార బాధ్యతలను స్వీకరించాల్సివచ్చింది. అదే సమయంలో అమ్మ, పెద్దమ్మలకు పెళ్లి చేయాల్సిన బాధ్యతకూడా ఆయన మీదే పడింది. ఆ పరిస్థితులను తల్చుకోటానికే భయం వేస్తూంది.

మరి... మామయ్య ఆ రోజుల్లో ధైర్యంగా నిలబడి పరిస్థితులను ఎదుర్కొని, తన బరువు బాధ్యతలను నల్గురూ మెచ్చుకునేట్లుగా నిర్వర్తించాడంటే అందుక్కారణం ఆయన ఆత్మస్థైర్యం, పట్టుదల, కృషి అని చెప్పాలి.

సెకండరీస్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్న రేణుకయ్యగారికి పెద్దమ్మనిచ్చి వివాహం చేశాడు.

ఇరవై సంవత్సరాలైనా నిండకముందే అరక చేతధరించి భూమినే నమ్ముకొని ధైర్యంగా నిలబడిన మామయ్యను చూడగానే పెద్ద పెద్ద రైతులు సహితం ఆశ్చర్యపోయారు 'వ్యవసాయం సంగతి ఈ కుర్రవాడికేం తెల్సు ?' అని హేళన చేసినవాళ్లున్నారు.

'పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటారు రైతు బిడ్డంటే అలా వుండాలి. వృద్ధిలోకి వస్తాడు !' అని మెచ్చుకున్నవాళ్లూ వున్నారు.

భూసారపు స్వభావాన్ని గుర్తించి, వ్యవసాయంలోవున్న మెళకువలను తెల్సుకొని, సకాలంలో నాట్లు వేయించి, తగు రీతిలో నీటిని మళ్లలో నిల్వవుంచి ఆ వూళ్ళో అందరికంటె

ఎక్కువ దిగుబడిని సాధించకల్గాడు మామయ్య. తనకున్న రెండెకరాలను చేయటంతో తృప్తిపడ లేదు. చేనుకు ఆనుకొనివున్న మరో అయిదెకరాల మాగాణిని కౌలుకు తీసుకొన్నాడు. అంతకు మునుపు అయిదు బస్తాలుకూడా పండని ఆ బంజరుభూమిని సాగుచేసి రెండేళ్ళలో ఎకరానికి ఇరవై బస్తాల దిగుబడినిచ్చే బంగారు భూమిగా మార్చేశాడు.

మామయ్య ఏ చేలో కాలుపెడితే ఆ చేలో బంగారం పండుతుందనే భావన వూరి ప్రజలకు కల్గింది. ఎంతోమంది రైతులు తమ పొలాలను కౌలుకు తీసుకోమని, అవసరమైతే కావాల్సిన పెట్టుబడిని కూడా పెడతామని మామయ్య వెంటపడ్డారు.

శక్తికి మించిన భారాన్ని మోయటానికి సిద్ధపడ్డాడు మామయ్య సాగుచేయాల్సిన పొలం ఎక్కువ కావటంతో కొన్ని నూతన పద్ధతులను ప్రవేశపెట్టాల్సిన అవసరం కల్గింది. దగ్గర్లో వున్న నెల్లూరుకు వెళ్లి అక్కడ వ్యవసాయ శాఖాధికారులను కల్సుకొని అధిక దిగుబడినిచ్చే వరి రకాలను తెల్సుకొని తానే మొట్టమొదటి సారిగా ఆ వూళ్లో హైబ్రిడ్ రకాలను ప్రవేశ పెట్టాడు. ల్యాండ్ మార్టగేజ్ బ్యాంకుకు వెళ్లి తన భూమిని తాకట్టు పెట్టి ఓ ట్రాక్టర్‌ను కొన్నాడు.

ట్రాక్టర్ కొన్న దగ్గర్నుంచి మామయ్యకు బాగా కల్సివచ్చింది. కౌలుకు తీసుకొన్న భూములను దున్నటమే కాకుండా ట్రాక్టర్‌ను కిరాయి కొరకు ప్రక్క వూళ్లకు కూడా పంపే వాడు. దాంతో రాబడి విపరీతంగా పెరిగింది. ధనధాన్యాలతో, పాడిపంటలతో మామయ్యవాళ్ల లోగిలి కళకళలాడుతూ వుండేది. చేలోనే ఇటుక తీయించి చక్కని బిల్డింగ్‌కూడా కట్టించాడు మామయ్య.

మామయ్య జీవితంలో వ్యవసాయానికి ఎంత ప్రాధాన్యతనిచ్చినా సంసారపు బాధ్యతలను ఏనాడూ విస్మరించలేదు. అమ్మకు గొప్ప సంబంధం చూసి పెళ్లి చేయమని ఎంతోమంది మామయ్యకు సలహానిచ్చారు. కాని మామయ్యకు తెల్సు అమ్మకు తమ మేనమామ కొడుకును పెళ్లి చేసుకోవాలనే వుద్దేశ్యం వున్నట్లు. అప్పట్లో నాన్నకు ఆస్థి ఓ మూడెకరాల మాగాణి మాత్రమే వుండేది. స్కూల్ ఫైనల్ వరకు చదివి వుండటంచేత నెల్లూరు దగ్గర్లోనే వున్న ఓ యి. డి. సబ్ పోస్టాఫీసులో పోస్టు మాస్టరు వుద్యోగం వచ్చింది. అయిదెకరాలు కట్నంగా యిచ్చి ఓ శుభ ముహూర్తాన మామయ్య అమ్మ పెళ్లిని ఘనంగా చేశాడు.

అదే సంవత్సరం మామయ్య కూడా పెళ్లి చేసుకొన్నాడు. అత్తయ్యది కూడా దగ్గర్లోవున్న పల్లెటూరే. అయితే వాళ్ల నాన్నగారు మాత్రం

# మామయ్య కోరిక

నెల్లూర్లో ఓ మిల్లును కంట్రాక్ట్‌కు తీసుకొని ధాన్యవ్యాపారం చేసేవాడు. రైతుల ద్వారా మామయ్య గుణగణాలను తెల్సుకొని కన్యాదానం చేశాడాయన ...

నేను పుట్టేనాటికే మామయ్య ఇరవై ఎకరాల మాగాణికి ఆసామీ అయ్యాడు. నేను పుట్టిన అయిదేళ్లకు నాన్న చనిపోవటంతో అమ్మ మామయ్య దగ్గరకు వచ్చేసింది. స్కూల్ ఫైనల్ వరకు నేను మామయ్యవాళ్ల వూళ్లోనే చదువుకొన్నాను. నాతోపాటే మామయ్య పిల్లలు వాసు, గోపీ, సీత, రాజేశ్వరికూడా స్కూలుకు వచ్చేవారు. వాసు, గోపీలు కూడా స్కూలు ఫైనల్ పాసయ్యారు. ఆడపిల్లలు మాత్రం టెన్త్‌క్లాసుతో చదువు ఆపేశారు. మామయ్య ప్రోత్సాహంతోనే నేను నెల్లూరు కాలేజీలో జాయినయ్యాను. వాసు, గోపీలను కూడా కాలేజీ చదువులు చదివించాలనుకొన్నాడు మామయ్య. కాని అంతలోనే ఆకస్మాత్తుగా అత్తయ్య చనిపోవటం, మామయ్యకు ఉబ్బసం జబ్బు రావటం దురదృష్టకరమైన సంఘటలనే చెప్పాలి. తండ్రిని ఎంతో అభిమానించే గోపీ, వాసులు ఆయన్ని వదిలి నెల్లూరు వెళ్లి చదువు కోటానికి నిరాకరించారు. మామయ్యకూడా గట్టిగా చెప్పలేకపోయాడు. వాళ్లిద్దరూ మామయ్యకు వ్యవసాయంలో సాయంచేస్తూ వుండిపోయారు.

నేను ఎమ్. ఏ. పాసయ్యాక సీతను నాకిచ్చి వివాహం చేయాలనుకొన్నాడు మామయ్య. నా వుద్దేశం ఓ రోజున అడిగాడు. మొదట్నుంచీ ఆ యింట్లోనే పెరగటంచేత సీత, రాజేశ్వరిలను నేను తోబుట్టువులుగానే చూశాను. అదీగాక కాలేజీలో చదువుకొంటుండగా నాకు అన్నపూర్ణతో పరిచయం అయింది. పెద్దలు అనుమతి యిస్తే ఆమెను వివాహం చేసుకోవాలనుకొన్నాను. మామయ్యకు ఆ విషయం ఎంతో బాధపడుతూ చెప్పాను నా మనసులోని మాటను ధైర్యంగా చెప్పినందుకు మామయ్య నన్ను అభినందించాడు తనే మాట్లాడి అన్నపూర్ణతో నా పెళ్లి జరిపిస్తా నన్నాడు.

నాకు పైలట్ ఆఫీసర్‌గా సెలక్షన్ రాగానే మామయ్యే పూనుకొని మా వివాహం జరిపిం చాడు. సీతను ఓ బ్యాంకు ఆఫీసర్‌కు, రాజేశ్వరిని ఓ కాలేజీ లెక్చెరర్‌కు యిచ్చి వివాహాలు జరిపిం చాడు. ఆ తర్వాత గోపీ, వాసులక్కూడా సాంప్రదాయకమైన కుటుంబాల సంబంధాలనే చేశాడు.

కొడుకుల పెళ్ళిళ్లతో మామయ్య సంసారపు బాధ్యతలను పూర్తిగా తీర్చుకొన్నట్లే ! అయితే వయసు పెరిగినప్పటికీ ఆయన వ్యవసాయాన్ని అశ్రద్ధ చేయలేదు.

దుక్కులు దున్నించటం దగ్గర్నుంచి చేలను తడిపి వరినాట్లు వేయించటం, ఎరువులు చల్లిం చటం, కలుపులు తీయించటం, కోతలు కోయిం చటం, కుప్పలు వేయించటం చివరకు ధాన్యం నూర్పించి యింటికి తోలించి పురి కట్టించేవరకు మామయ్య ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేవాడు. అలా కష్టపడటంచేతనే తన పిల్లలకు దారిద్ర్యం అంటుకోకుండా చూడకల్గాడు ఖర్చుపెట్టే ప్రతి పైసా మామయ్య కష్టార్జితమే! అందుకే అనవసరపు ఖర్చులు చేయటానికి యిష్టపడడు. నాకు తెల్సినంతవరకు మామయ్యకు జత బట్టలు తప్ప ఎప్పుడూ ఎక్కువ వుండవు. కొడుకులు, కూతుళ్లు కుట్టిస్తానంటే ఒప్పుకొనేవాడు కాదు.

'వయసు మళ్ళిపోయిన నాకెందుకురా యివన్నీ ! ఆ డబ్బుపెట్టి మీ పిల్లలకు కుట్టించు కోండి !' అనేవాడు. మామయ్య నిరాడంబరుడు. కష్టజీవి. కరుణార్ద్ర హృదయుడు. అందుకని మామయ్యంటే నాకెంతో యిష్టం. ఇంతమంది వున్నా మామయ్య ఒక్కగానొక్క కోరికను ఇంత వరకు తీర్చలేకపోయాం. మామయ్య కోరికను తీర్చే బాధ్యతను నేనే స్వీకరించాలనుకొన్నాను. ఎటూ దీపావళి రాబోతూంది ! ప్రతి దీపావళికి మామయ్యకు కూతుళ్లను, అల్లుళ్లను యింటికి పిలవటం అలవాటు. వాళ్లతోపాటు నన్ను, అన్నపూర్ణనుకూడా పిలుస్తుంటాడు మాలో ఎవ్వరు వెళ్లకపోయినా ఎంతో బాధపడతాడు.

ఆయన మనసు బాధ పెట్టడం ఎవరికీ యిష్టంలేదు కనుక ఎన్నిపనులున్నా మానుకొని మేమంతా పండక్కి మామయ్య వాళ్ల వూరు వెళ్లక తప్పటంలేదు.

మామయ్య ఇంతకు ముందు కలకత్తా చూడలేదు కాబట్టి దసరా పండక్కి యిక్కడకు వస్తే అందరం కల్సి దీపావళికి మామయ్య వాళ్ల వూరు వెళ్లొచ్చు. అప్పుడు మద్రాసు వరకు మామయ్యను ఫ్లయిట్‌లో తీసుకు వెళ్లొచ్చు అనుకొన్నాం నేను, అన్నపూర్ణ. ఆ విషయమే మామయ్యకు వుత్తరం రాశాను. వారంరోజులకే మామయ్య దగ్గర్నుండి వుత్తరం వచ్చింది. చేలలో దోమకాటు ఎక్కువుగా వుందని తను దసరాకు రావటానికి వీలుపడదని దీపావళి ముందు వస్తానని జవాబు రాశాడు.

మామయ్య యిక్కడకు వచ్చి నాల్గురోజు లైంది. ఈ నాల్గు రోజుల్లో మామయ్యను కార్లో కలకత్తా అంతా త్రిప్పాము అన్నపూర్ణ, నేను. కాళికాదేవాలయం, రామకృష్ణ మఠం, బిర్లా ప్లానిటోరియమ్, విక్టోరియా మ్యూజియమ్, హౌవుర్రాబ్రిడ్జి మొదలగు ముఖ్య ప్రదేశాలను చూపించాము.

మామయ్య ఎంతో సంతోషించాడు.

'నా జన్మలో ఈ కలకత్తా నగరాన్ని చూస్తాననుకోలేదురా అబ్బీ !' అన్నాడు మామయ్య ఎంతో కృతజ్ఞతతో.

అంతలోనే అన్నపూర్ణ అందుకొని 'అంతే కాదు బాబాయ్ ! మీ మేనల్లుడు మిమ్మల్ని

ఎల్లుండి విమానం ఎక్కించబోతున్నారు !' అంది.

''ఏరా ! అమ్మాయి చెప్పేది నిజమేనా ?'' అంటూ నన్నడిగాడు.

''నిజమే మామయ్యా ! ఎంతో కాలం నుంచి నీ మనసులో మిగిలిపోయిన కోరికను తీర్చాలను కొంటున్నాను. మనం ముగ్గురం ఎల్లుండి ఫ్లయిట్‌లో మద్రాసువెళ్ళబోతున్నాం..''

''నాకు చాలా ఆనందంగా వుందిరా! అసలు విమానం ఎక్కాలన్న కోరిక నాకు చిన్నప్పట్నుంచీ వుండేది. ఆకాశంలో స్వేచ్ఛగా పక్షిలా ఎగురుతున్న విమానం కన్పించగానే అది కనుమరుగయ్యే వరకు అలానే చూస్తూండిపోయేవాణ్ణి ! పెద్ద చదువులు చదివి నేను కూడా విమానంలో ప్రయాణం చేయాలనుకొన్నాను. నాన్న చనిపోవడంతో నా కలలన్నీ కల్లలయ్యాయి.

మీ పెద్దమ్మ వాళ్ళు రాజమండ్రిలో వుండగా గోదావరి పుష్కరాలు వచ్చాయి. ఆ సందర్భంలో రాజమండ్రి చుట్టూ తిప్పటానికి విమానాన్ని ఏర్పాటు చేశారు. ఓ రోజు మేమంతా గోదావరిలో స్నానం చేసి విమానం ఎక్కాలనుకొన్నాం. స్నానవాటికలో మీ పెద్దమ్మ కొడుకు హరి తప్పిపోయాడు. రెండ్రోజులయిన తర్వాత పోలీసుస్టేషన్లో వాడు దొరికాడు ఆ హడావుడిలో విమానం ఎక్కాలన్న వుత్సాహమే పోయింది ఆనాటి నుంచి విమానం ఎక్కాలన్న కోరిక నా మనసులో మరుగున పడసాగింది. అయితే నీకు పైలట్‌ఆఫీసర్ వుద్యోగం రాగానే నా కోరిక కొత్త వూపిరిని పోసుకొంది. ఆ కోరిక త్వరలో తీరబోతుందన్నమాట ! చాలా సంతోషం !''

ఆ మాటలంటున్నపుడు మామయ్య కళ్ళు ఆనందంతో మెరిశాయి. ఆ కళ్ళలో అంతులేని సంతృప్తిని, కృతజ్ఞతను నేను చూడగల్గాను. కాని ...

ఇంతలోనే ఎంతటి ఘోరం... జరిగిపోయింది ... –''ఏమండీ ! బాబాయి కళ్ళు తెరిచాడు'' అన్న అన్నపూర్ణ మాటలు వినగానే వరండాలో కుర్చీలో కూర్చుని గతాన్ని నెమరు వేసుకొంటున్న నేను వర్తమానంలోకి వచ్చాను.

కుర్చీలోంచి గబగబ లేచి మామయ్య వున్న గదిలోకి వెళ్ళాను.

బెడ్‌మీద మామయ్య పండుకొని వున్నాడు. గుండెలవరకు దుప్పటి కప్పకొన్నాడు.

గుమ్మంలో నన్ను చూడగానే దగ్గరకు రమ్మని చేత్తో సైగచేశాడు.

నేను మంచం దగ్గరకు వెళ్ళి మామయ్య తల దగ్గరే కూర్చున్నాను.

''ఏం మామయ్యా ! ఎలా వుంది ?'' అని అడిగాను.

''ఆయాసంగా ... వుందిరా...'' అన్నాడు ఓ చేత్తో గుండెను రుద్దుకొంటూ.

''డాక్టర్‌గారొచ్చి ఇంజక్షన్ చేసి వెళ్ళారు మామయ్యా ! నీకు మెలకువ రాగానే తెలియజేయమన్నారు. అన్నపూర్ణ డాక్టర్‌గారికి ఫోన్ చేయటానికి వెళ్ళింది. కాస్సేపట్లో డాక్టరుగారొస్తారు !'' అన్నాను.

''పిల్లలంతా ... వచ్చే వుంటారు ... మనూరికి వెళ్దాంరా !'' ఆయాస పడుతూనే అన్నాడు

''నీవు ధైర్యంగా వుండు మామయ్యా ! నీ ఆరోగ్యం బాగయ్యాక మనమంతా కల్సే వెళ్దాం ! ... ''

అలా కాదన్నట్లు చేత్తో సంజ్ఞ

కొన్ని నిమిషాలు నా కళ్ళల్లోకి అలానే చూస్తూండిపోయాడు. మామయ్య అలా చూస్తుంటే నాకెంతో విచారం కల్గింది సూర్యగోళమంత ప్రకాశవంతమైన ఆనాటి మామయ్య కళ్ళు ఈనాడు బిత్తర చూపులు చూస్తున్నాయి. సింహంలా బ్రతికిన మామయ్య యిలా చితికి పోయాడేమిటన్న భావం కల్గగానే నా మనసులో దుఃఖం ఆగలేదు.

నా కళ్ళలో నీళ్ళు చూడగానే మామయ్య కూడా కంట తడిపెట్టాడు.

వణుకుతున్న చేతులతో నా చేతిని తన చేతుల్లోకి తీసుకొన్నాడు.

''సీతారావుడూ .. నన్ను. .మనూరిలోనే. . మట్టి చేస్తారుకదూ...''

ఆ మాటలు వింటుంటే నా గుండెల్లో దడ ఏర్పడింది మామయ్య పరిస్థితి క్షణ క్షణానికి క్షీణించసాగింది. అన్నపూర్ణ, నేను డాక్టర్‌కోసం ఎదురు చూటడం మినహా ఏమీ చేయలేకపోయాం !

కాని .. కాని... డాక్టర్ వచ్చేవరకు మామయ్య ఆగలేదు.

* * *

విధి ఇంత నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తుందని కలలోకూడా వూహించలేదు నేను.

జీవితంలో ఎంతో ఎత్తుకు ఎదగగల్గిన మామయ్య. . ఈనాటికి... ఆకాశంలో . విమానమ్మీద స్వేచ్ఛగా వాయువులు పీల్చుకొంటూ ప్రయాణం చేస్తాడనుకొన్నాను

కానీ ...

జరిగిందేమిటి ?

విమాన ప్రయాణం చేసింది ఆత్మను విడిచిన ఆయన శరీరం మాత్రమే !

ఎయిర్‌పోర్ట్‌లో బంధుమిత్రులంతా మామయ్యకు ఘనంగా స్వాగతం చెప్పాలనుకొని వుత్సాహపడ్డారు. కాని... వారి వుత్సాహం... విషాదంగా మారింది. ఠీవిగా తలెత్తి నడిచివచ్చే మామయ్య మెడలో వేయాల్సిన పూలదండలను— ట్రాలీమీద మెల్లగా తీసుకువస్తున్న ఆయన శవపేటికమీద వుంచాల్సి వచ్చింది విధి వైపరీత్యం అంటే ఇదేనేమో ! ★

**అంకితం**

మూడేళ్ళక్రితం మమ్మల్నందర్నీ విడిచి వెళ్ళిన మామయ్యకు.

– గుడిపేవ సుందరరామయ్య

# వయసుకన్న వంటే మిన్న!

జకోస్లవేకియాకి చెందిన 57 ఏళ్ల మగ్ధ ఆనే పాపకు వివాహేచ్ఛ (పునర్వివాహేచ్ఛా!) కలిగి, తాను రెండు పదుల వయస్సుదాననసీ, అతి సుందరిననీ, సంగీత నాట్య సుందరిననీ, తనను పెళ్ళాడనెంచినవారు ముందుకు రావల సిందని పేపర్లో వొహ ప్రకటనచేస్తే ముద్దుగా ఒకే అప్లికేషనొచ్చేసరి కామెకు వొళ్ళు మండి, తన అసలు కథను పేపర్లో ప్రచురించేసరికి వందలకు వందలు అప్లికేషన్లు వచ్చాయట. తాను ఎంచక్కా చవులూర వంట చేయగలనని రాసిన పాయింటుమీద చాలామంది ఆ మగ్ధను కోరారట— జిహ్వా చాపల్య మంత చేటా!

## కౌగిలింతల మహత్యం!

కెనడాకు చెందిన డాక్టర్ వర్జీనియా సతీర్ అనే వొహామె హాయినికొల్పే కొన్ని విషయాలు బయటపెట్టిందట. రోజుకు నాలుగు కౌగిలింతలు వో మనిషి మనస్సును అనవసరమైన సెక్సు వూహల నుంచి తప్పించగలవట. [ఆడా మగా — ఎవరైనా సరే] రోజుకు డజను కౌగిలింతలు అయితే స్త్రీ పురుష దేహానికి చాలా మంచిదట. మనిషి నిట్టూర్పులు లేకుండా జీవించాలంటే రోజుకు నాలుగు కౌగిలింతలు తప్పనిసరి అనీ, ఎనిమిదయితే ఆ రోజు చాలా హాయిగా వుంటుం దనీ, డజనవుతే అత్యద్భుతమనీ ఆమె అన్నారట. శారీరక లైంగిక సంబంధం లేకుండా జస్ట్ వో ఘాటు కౌగిలింత నరాలమ వుత్తేజపరుస్తుందనీ, అది రక్తం శీఘ్రంగా శుభ్రపడడానికి సహక రిస్తుందనీ కూడా ఆమె అన్నారట — ఆహా గుడ్ డాక్టర్!




# షాలక్షని పేరి

## విద్యుత్ ఘాతానికి ప్రేక్షకుల బలి!

తూత్తుకూడిలో వో చోట రోడ్డు నాటకం బహు రంజుగా సాగుతుండగా వున్నట్టుండి ఝామ్మని గాలి వీచేసరికా పక్కనున్న వో చెట్టు కూలి, కరెంటు తీగలమీద పడేసరికందులో వో తీగ తెగి నాటకం చూస్తున్న వాళ్ళమీద పడ్డదట దాంతో నాటకం చూస్తున్నవారిలో అయిదుగురక్కడికక్కడే చనిపోయారట.

## కులాంతర వివాహం అవమానమా!

కరీనంగర్ జిల్లాకు చెందిన వో గ్రామానికి చెందిన చిరంజీవి అనే వో యువకుడు తన కులం కాని అమ్మాయిని వివాహం చేసుకోడాన్ని అక్కడి , వొప్పక, అది ఆ అమ్మాయిని అవమ పరిచిన చర్యగా ఎంచి, అతని కుడి చెయ్యి మణికట్టు వరకూ, ఎడమ చేతివేళ్ళా నరికిపారేశారట.

## జోకుల్లో ప్రపంచ రికార్డు!

కెనడాలో 50 ఏళ్ళ ఫిలిప్ కాంప్బెల్ అనే అసాధ్యుడు స్టేజిమీద నలభై గంటలు ఏకబిగిన నిలబడి, శ్రోతలకు జోకులువేసి, వినిపిస్తూనే ఆ నలభై గంటలూ గడిపి ప్రపంచ రికార్డు స్థాపించాడట. అంత క్రితం ఒహతను 28 గంటలు ఈ పని చేసి, అంతకు ముందున్న రికార్డును బద్దలేశాట్ట. ఇహేముంది మంొహాడి కాంప్బెల్ రికార్డు బద్దలేయాలంతే!

## రెండుముక్కలయిన చెక్కయిలు!

న్యూజర్సీకి చెందిన యూనీ ష్మైడార్ అనే ఆయన తన భార్యతో వేగలేక, వేరే గత్యంతరం లేక ఆమెకు 1976 లో విడాకులు యిచ్చాడట తన ఏకైక ఆస్తి అయిన వో చెక్కలతో అతి సుందరంగా బోల్డు ఖరీదుచేసే విధంగా కట్టుకున్న యింటిని రంపం పెట్టి ఖచ్చితంగా రెండు ముక్కలుగా కోయించి, వో ముక్క ఆవిడకు యిచ్చేశాడట. ఆ యిల్లు 80 వేల డాలర్ల విలువట. దాన్ని రెండు ముక్కలుగా కోయడానికి వో పెద్ద కంపెనీ చెయిన్ రంపాలు వాడి బహు ప్రయాసతో ఆ కోతపని చక్కగా చేసిందట.

## పాప్‌మ్యూజిక్‌లో భారత వనిత అగ్రస్థానం!

కేరళకు చెందిన షీలాచంద్ర అనే అమ్మాయి బ్రిటనులో "పాప్ మ్యూజిక్" పాడి, బ్రిటనును ఆనంద ఆశ్చర్యానుభూతులతో ఒక్క వూపువూపి, టాప్ పాప్ సింగరై కూర్చున్నదట. భారతదేశానికే గాక, ఏషియాకీ యింతటి గౌరవం దక్కడం యిదే మొదలుట. కేరళ క్రిస్టియన్ కుటుంబంలో పుట్టిన ఈమె 1962 లో తలిదండ్రులతోపాటు లండన్‌లో స్థిరపడినదట.

## పెరుగులో పోషక విలువలు!

పెరుగులో మామూలు మనిషి వూహించిన కన్నా మహత్ వుపకార గుణాలున్నాయని విజ్ఞాన వేత్తలు ప్రకటించారట. పెరుగు ఎక్కువగా వాడడం వల్ల దృఢమైన శరీరం ఏర్పడు




తుందిట. పిల్లల శరీరానికి పెరుగుపట్టించి కాస్సేపు వుంచి, ఆనక స్నానం చేయిస్తే శరీరం అతి మృదువుగా తయారవుతుందట. పెరుగు లోని బాక్టీరియా చర్మాన్ని మృదువుగా చేస్తుందట. పెద్దవారు తలంటుకునేటపుడు ముందు పెరుగుతో తల మర్దనా చేసుకుని, వో పావుగంట ఆగి ఆనక స్నానం చేస్తే, కళ్ళకు మంచిదనీ, చుండ్రు వంటివి దరికిజేరవనీ సైన్సు అంటోంది. పళ్ళరసంలో పెరుగు కలిపి ముఖానికి రాసుకుని, కాస్సేపుంచుకుని ముఖం కడుక్కుంటే ముఖ చర్మం చాలా మృదువుగా వుంటుందట. పెరుగు బియ్యంపిండిలో కాని, నిమ్మరసంలోగానీ కలిపి ముఖానికి పట్టించి, వో పావుగంటాగాక చన్నీళ్ళతో కడుక్కుంటే ముఖ చర్మం అతి మృదువుగా తయారవుతుందట. ★

# సన్‌రైజ్
# కాఫీ-బిస్కెట్‌ల సదుపాయం

## ఉచితం!

ప్రతి 50 గ్రా.ల సన్‌రైజ్
రీఫిల్ ప్యాక్‌తోబాటు
ఒక పార్లే గ్లూకో బిస్కెట్ ప్యాకెట్




కొత్త
Nestlé
**సన్‌రైజ్**
ఇన్‌స్టెంట్

ప్రాతఃకాలపు ఆ తాజాతనాన్ని అనుభూతి చెందేందుకు

HTD-FSL-8212 TEL




(గత సంచిక తరువాయి)

కొద్దిగా కోలుకుని ఇంట్లో సులభంగా తిరుగాడ గలుగుతున్నా పరశురాం మళ్ళీ ఆఫీస్‌కి వచ్చేందుకు ఆసక్తి కనబరచటం లేదు హరి తన సంతకం కోసం తెచ్చిన కాగితాలన్నీ సంతకాలు చేసి ఇచ్చేస్తాడు ఇంట్లోనే. హరికిది ఆశ్చర్యంగా ఉంది. ఈయనకింత హఠాత్తుగా బిజినెస్‌మీద ఆసక్తి ఎందుకు తగ్గిపోయిందా అని! ఎవర్నీ నమ్మకుండా అన్నీ స్వయంగా చూసుకుంటున్న వ్యక్తి ఎందుకిలా నిర్లిప్తంగా అయిపోయారా అనీ అనిపిస్తుంది.

కానీ పరశురాం మనసులో చేస్తున్న ఆలోచనలు, వేస్తున్న ప్లాన్లు వేరుగా ఉన్నాయి. ఆఖరిదాకా ఆయన బయటపడదలచుకోలేదు. ఈసారి ఇన్నాళ్ళు జబ్బుపడగానే, "నా హయాం అయిపోయింది. ఇంకా ఏదో చేయాలని ప్రాకులాడటం దండుగ" అనిపించింది పరశురాంకి. అందుకే ఏ స్వామీజీ ఆశ్రమానికయినా వెళ్ళిపోదామని ఆలోచన చేస్తున్నాడు. ఆరోగ్యం పూర్తిగా కుదుట పడిందనిపించిన తర్వాత తన ప్రణాళికలు ఒక్కొక్కటే అమలు చేయటం ప్రారంభించాడు.

ఒకరోజు కంపెనీ లాయర్ని పిలిపించి, తన మనసులో పెట్టుకున్న ఆలోచనలకి అనుగుణంగా అవసరమయిన కాయితాలు అన్నీ తయారు చేయించాడు. తను వెళ్ళాలని నిర్ణయించుకున్న ఆశ్రమానికి ఉత్తరాలు రాసి తగిన ఏర్పాట్లు చేసుకున్నాడు.

తను వెళ్ళాలిసింది ఆదివారం అనగా, శుక్రవారంనాడు రాత్రి కొంచెం త్వరగా ఇంటికి వచ్చెయ్యమని చెప్పాడు హరికి

అతను "పేపర్స్ డిస్పాచింగ్ ఉంటుంది, కష్టం అవుతుంది" అని చెప్పినా విన్పించుకోలేదు. "ఫరవాలేదు ఇవాళ్టికి ఇంకెవరికయినా ఒప్పగించి వచ్చెయ్యి" అని సలహా ఇచ్చాడు.

ఎనిమిది గంటలకి ఇంటికొచ్చాడు హరి. వంటమనిషికి చెప్పి ప్రత్యేకంగా స్పెషల్స్‌తో భోజనం తయారుచేయించి ఉంచాడు పరశురాం. రోజూకంటే ఎక్కువగా కబుర్లు చెప్పి నవ్విస్తూ భోజనం చేశాడు, హరినీ కరుణనీ రెండు పక్కలా కూర్చోబెట్టుకుని.

భోజనం అయిన తర్వాత ఇద్దరినీ తన గదికి తీసుకువెళ్ళాడు.

టేబిల్‌మీద తయారుగా ఉంచుకున్న కొన్ని కాగితాల్లోంచి ఒక కవర్ తీసి హరిప్రసాద్ కిచ్చి చదువుకొమ్మన్నాడు. అది కంపెనీ వ్యవస్థాపకుడు, అధ్యక్షుడు అయిన పరశురాం, పరశురాం అండ్ కం. జనరల్ మేనేజర్‌గా, హరిప్రసాద్‌ని అపాయింట్ చేస్తున్నట్లు టైప్ చేయబడిన ఉత్తరం.

చదివినా అర్థం కానివాడిలా, "ఏమిటిది?" అనడిగాడు హరి ఆశ్చర్యంగా. "ఆఖరు క్షణాల్లో చెప్తున్నాడని కోపగించుకోవద్దు ఇద్దరూ. నేను శ్రీ సచ్చిదానందస్వాముల వారి ఆశ్రమానికి వెళుతున్నాను. ఆదివారమే ప్రయాణం."

"ఎందుకు?" అని ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"ఎందుకు అంటే సరిఅయిన సమాధానం నా దగ్గర లేనిదే మీకేమీ చెప్పాలి? కరుణని గురించి నాకేం దిగులులేదు. నీవున్నావు. తగిన సంబంధం చూసి పెళ్ళి చేయటం నీ బాధ్యతకే వదిలివేస్తున్నాను. దానిపేరున పెళ్ళికీ, అన్ని అవసరాలకీ నాకు శక్తి ఉన్నంత బాంక్‌లో వేసాను. ఇదిగో ఆ పుస్తకం" అని పాస్‌బుక్ ఒకటి తీసి హరి చేతికే అందించాడు.

కరుణ ఏం మాట్లాడాలో అర్థం కాని దానిలా అయోమయంగా చూస్తోంది. కూతుర్ని దగ్గరికి తీసుకున్నాడు పరశురాం. "డాడీ వెళుతున్నారనీ బెంగ పెట్టుకోవద్దు కరుణా! ఎక్కడున్నా నా మనసు నా బంగారు తల్లి దగ్గరే ఉంటుంది. నీకెప్పుడయినా చూడాలనిపిస్తే వచ్చి చూసి వెళ్ళొచ్చును. ఏమీ అభ్యంతరం ఉండదు. నీకేం భయంలేదు. బావ అన్నీ చూసుకుంటాడు" అని బుజ్జగిస్తున్నట్లుగా చెప్పాడు.

ఏడుపు ఆగలేదు కరుణకి "ఛీ! ఏడుస్తావా? తప్పకదూ? నేనేం ఈ దేశాన్ని విడిచి పోతునాన్నా అమ్మా" అనడిగి నవ్వించబోయాడు. ఆయన మాటతీరే ఇద్దరికీ తెలుస్తోంది, ఆయన అంతే నిర్ణయించేసుకున్నాడనీ, ఎవరెన్నిచెప్పినా వినిపించుకోడని

"ఇదుగో, ఇవన్నీ నీకు ఆఫీసులో అవసరం అయ్యే కాగితాలు" అని మరో బొత్తి కవర్ను హరి చేత పెట్టాడు.

"ఇంత బరువు, బాధ్యత నీ భుజాలమీదవేసి నీకు కంగ్రాచ్యులేషన్స్ చెప్పను నా భారాన్ని

**జరిగిన కథ — 20:** హరిప్రసాద్, రమణల పెళ్ళికి వచ్చిన రావును అతని కోరికపై అరుణకు పరిచయం చేస్తాడు హరి. 'గోరంత దీపం' పత్రిక ఎడిటర్ పదవి హరిప్రసాద్ చేతుల్లోకి వచ్చింది. రావు 'గోరంత దీపం' బిజినెస్ మేనేజరుగా చేరుతాడు. గర్భంతో ఉన్న రమణ కోరికపై రమణ, హరి వూళ్ళు తిరిగిరాను వెళుతారు. అరుణకి ఫోన్ చేసి పార్కుకి రమ్మని కోరుతాడు రావు. అరుణ రావును పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది కర్నూల్లో త్రీ స్టార్ హోటల్ ప్రారంభోత్సవ సందర్భంలో ఆ హోటల్ యజమానిని ఇంటర్వ్యూ చేస్తాడు హరి. విశ్వమూర్తికి గుండెపోటు వస్తే హాస్పిటల్లో చేరుస్తాడు హరి. హాస్పిటల్లో విశ్వనాథంగారు, రమణ ఒకే క్షణంలో కన్నుమూసారు. హరిప్రసాద్ కుప్పకూలిపోయాడు. పరశురాం కూడ ఈ సంఘటనతో కృశించిపోయారు. కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్ ఫాక్టరీవాళ్ళ తయారుచేస్తున్న 'జాలీకోలా'లో ఆల్కహాలు మిక్స్ చేస్తున్నారని ఆ విషయం 'గోరంత దీపం'లో పబ్లిష్ చేస్తానని హరి పరశురాంకు చెపుతాడు. ఆయన దానికి అంగీకరిస్తారు. ప్లాన్ ప్రకారం చేసిన ఇన్వెస్టిగేషన్‌లో 'జాలీకోలా'లో ఆల్కహాల్ ఉన్నట్లు ఋజువవుతుంది. 'గోరంత దీపం'లో జాలీకోలా మిస్టరీ ప్రచురింపబడుతుంది. హరికి, పరశురాంకు మనస్పర్థలు వచ్చేలా చేయాలని ఆలోచిస్తాడు రావు. అతనికి అరుణంటే మోజు తీరిపోయింది. హరి, అరుణ కలసి తిరుగుతున్నారని పరశురాంగారితో చెపుతాడు రావు. హరి గదిలో అరుణని చూసి కోపోద్రేకంతో హరిని నిందిస్తాడు పరశురాం. హరి మనసు కలత చెందుతుంది. రావు చేసిన వెధవ పనివల్ల పోయే 'గోరంత దీపం' పరువు హరి కాపాడుతాడు. హరి తను పరశురాం మేనల్లుడుననే విషయం ఆయనకి చెపుతాడు. అరుణ మరణిస్తుంది. పరశురాం కోరికపై హరి తన మకాం ఆయనింటికి మారుస్తాడు.

నేను సంతృప్తిగా దించుకో గలిగినందుకు నాకే నువు చెప్పాలి .. సో బెస్ట్ ఆఫ్ లక్ యంగ్ మాన్'' అని, మంచంమీద పక్కనేఉన్న బ్రీఫ్ కేస్ అందించాడు.

''ఇది నీకు నా ప్రజంటేషన్'' అని నవ్వుతూచెప్పాడు ఇందులో కొత్త సూటుఉంది రేపు మంచిరోజు. సూటు వేసుకుని వెళ్ళాలి ఆఫీస్‌కి. చిన్న ఫంక్షన్ ఒకటి ఉంటుంది అతి చిన్న ఉపన్యాసం ఒకటిచ్చేసెయి'' అని సలహా ఇచ్చాడు.

## 42

ఉదయం పరశురాం చెప్పిన విధంగానే తయారయాడు హరి. బ్రీఫ్‌కేస్ పుచ్చుకుని వెళుతూ ఆయన గదిలోకివెళ్ళాడు ''వెళ్ళొస్తాను మామయ్యా'' అన్నాడు.

పరశురాం లేచి నిలుచుని, ''మంచిది. బెస్ట్ ఆఫ్ లక్'' అనగానే, ఒక్కక్షణం తటపటాయించి, బ్రీఫ్‌కేస్ పక్కన చెయిర్‌మీద వుంచి ముందుకి వంగి పాదాభివందనం చేసాడు. ''గాడ్ బ్లెస్ యూ'' అని గొణుక్కోవటం తప్ప, ఎలా దీవించాలో పరశురాంకి తెలియలేదు.

''కరుణ తనకోసం వేచి చూడకుండా ఎప్పుడో ఆఫీస్‌కి చెక్కేసింది, ఈరోజు'' అనుకుంటూ కారెక్కాడు

కారు కంపెనీ పోర్టికో దగ్గరికి వెళ్ళేందుకు వీల్లేకుండా, గేటు దగ్గరే ఆపేసారు. హరి కారు దిగగానే, ఇద్దరు ప్రెస్‌సూపర్నెంటులూ, ఇద్దరు అసిస్టెంటు ఎడిటర్లు పూలమాలలు తీసుకుని చిరునవ్వులతో ఎదురుగా వచ్చారు. ''ఏమిటీ ? ఎందుకీ హడావిడి ?''అని అతనెంతగా వారించినా, వాళ్ళెవరూ చెవినేసుకోలేదు.

ఎక్కడ్నించో శ్యామల గబగబా వచ్చి అతని చేతిలో ఉన్న బ్రీఫ్‌కేస్ తీసుకుంది, ''ఇలా ఇవ్వండి'' అని; ఎవరూ చూడకుండా చిన్నగా మడతలు పెట్టిన కాయితం ముక్క ఒకటి అతని చేత పెట్టింది, ''తర్వాత చూసుకొండి'' అని. దాన్నలాగే జేబులో వేసుకున్నాడు హరిప్రసాద్.

ఆవరణలో కంపెనీలో పని చేసే వర్కర్స్ అందరూ ఉన్నారు. చిన్న డయాస్‌లా వేసిన దాని మీద టేబిల్ ముందు కూచోబెట్టారు హరిని. ''ఇప్పుడు మన కొత్త జనరల్ మేనేజర్ శ్రీహరి ప్రసాద్‌గారు మనకి నాలుగు మాటలు చెబుతారు''అని అనౌన్స్ చేసి అతనికి మైక్రోఫోన్ అందించారు. ఈ హడావిడి, సంరంభం ఏమిటో కొత్తగా ఉండి తికమక పడినట్లుగా ఉందతనికి. వెంటనే శ్యామల అందించిన స్లిప్ గుర్తొచ్చింది. ఎవరూ చూడకుండా దాన్ని బయటికి తీసి చూసుకున్నాడు. కంగారు తగ్గింది. ఏంచెప్పాలో బోధపడింది. ''శ్యామలగారికి థాంక్స్ చెప్పాలి'' అని మనసులోనే అనుకుని లేచి నిలుచున్నాడు.

హరి చేతికి మైక్రోఫోన్ రాగానే ఆవరణ అంతా నిశ్శబ్దంగా అయిపోయింది.

''ఇవాళ జనరల్ మానేజర్‌గా మీ ఎదుట నిలుచుని ఉన్న హరిప్రసాద్ మీకు కొత్తవాడు కాదు. పదమూడు సంవత్సరాలుగా మీ అందరి మధ్యా పని చేసిన వాడే, అన్న విషయం మీరు గుర్తుంచుకోవాలని మొదటగా కోరుకుంటున్నాను.

మీరందరూ ఇంత సంతోషంగా ఉంటే నాకూ ఆనందంగానే ఉంది. ఇంతమంది పనిచేసే ఈ కంపెనీ బాధ్యతని నేను సక్రమంగా నిర్వర్తించగలనా అని మొదట భయం వేసింది నాకు, శ్రీ పరశురాంగారు నాకీ విషయాన్ని నిన్న చెప్పినప్పుడు కానీ మీ ఉత్సాహం చూస్తుంటే నాకు ధైర్యంగావుంది. ఇందరి సహకారం ఉంటే నేనింకా కోరుకునే దేముంది ? .. ''

దాదాపు రెండు నిమిషాల పాటు మాత్రం మాట్లాడి ముగించాడు హరి. మాట్లాడుతున్నంతసేపు, తర్వాత అందరితోబాటు, స్వీటు, హాటు, కూల్‌డ్రింక్ తీసుకున్నంతసేపూ అతని కళ్ళు కరుణ కోసం వెతుకుతూనే ఉన్నాయి. కానీ ఆ అమ్మాయి ఎక్కడ ఏ లేడీ స్టాఫ్ గుంపులో కలిసిపోయిందో! ఇతని చూపులకి అందలేదు.

ఫంక్షన్ అయిన తర్వాత అలవాటుగా తన రూమ్ వయిపు వెళుతున్నాడు హరి ప్రసాద్ శ్యామల వచ్చి అతణ్ణి ఆపి, ''మీ ఆఫీసు ఇప్పుడిటు, రండి'' అంటూ వెంట తీసుకు వెళ్ళింది.

తన ముందు రెండడుగులు ముందుగా



మెట్లు ఎక్కుతున్న ఆమె వయిపు చూశాడు పరిశీలనగా. శ్యామల కిప్పుడు నలభయి అయిదే ళ్ళుంటాయేమో. పెద్ద చుట్ట చుట్టి, పూవులు ముడుచుకుంది. అక్కడక్కడా తెల్ల వెంట్రుకలు తొంగి చూస్తున్నయి.

ఆమె వెనుక రిసెప్షన్ రూమ్‌లో అడుగు పెట్టి లోపలి తలుపువయిపు చూశాడు. ఫ్రెష్‌గా పెయింట్ చేసిన తలుపుమీద జనరల్ మేనేజర్ అన్న అ క్ష రా లు కొట్టొచ్చినట్టుగా కనిపిస్తున్నాయి.

అప్పుడు, సరిగ్గా తను మొదటి రోజు ఈ కంపెనీలో, ఈ ఆఫీసులో అడుగు పెట్టిన అనుభవం గుర్తొచ్చింది. వెంటనే టైపుమిషను దగ్గర కూచుని ఉన్న కళ్ళద్దాల అమ్మాయీ గుర్తొచ్చింది. వెంటనే ఒక్క క్షణం కూడా ఆగలేనట్టుగా గబగబా తలుపు తీసుకుని లోపలికి వెళ్ళాడు.

తలుపు మూసుకోగానే మళ్ళీ పాత జ్ఞాపకాలు ! జ్ఞాపకాల వేడి అతనికి తను ఏర్ కూల్డ్ గదిలో ఉన్నానన్న విషయాన్ని మరిపిస్తోంది.

బరువుగా పడుతున్న అడుగులని లెక్క చేయకుండా లేచి నిలుస్తున్న కొత్త కార్పెట్‌నీ, మూసిన కిటికీలకి కట్టివున్న కొత్త తెరలనీ గమనించాడు హరిప్రసాద్.

ఎదురుగా టేబిల్‌మీద 'ఎమ్. హరిప్రసాద్' అని పెయింట్ చేయబడిన నేమ్ ప్లేట్ ఒకటి నిలుచుని ఉంది. ఒక్క క్షణం క్లోస్‌నెక్ కోటు వేసుకుని, వేతిలో చుట్టతో ఉన్న పరశురాం టేబిల్‌కి అవతల కూచుని ఉన్నట్లే అనిపించింది.

"మే అయి కమిన్" అని వినిపించగానే ఉలిక్కిపడి వెనుతిరిగి, "ఎస్. ప్లీజ్" అన్నాడు

తలుపు తోసుకుని వచ్చింది కరుణ.

"ఏయ్ ఇంతసేపు ఎక్కడున్నావ్ ?" అని అడగబోయి మానుకున్నాడు, వెనకాలే వచ్చిన శ్యామలని చూసి.

"ఈ అమ్మాయి ఎవరో మీకు తెలుసు కదూ ? మీ కొత్త పర్సనల్ అసిస్టెంటు... ఇంకొక గంటలో అంటే పది గంటలకి మీరు ఇంటర్వ్యూలు చేయాలి. మన కంపెనీ బిజినెస్ మానేజర్ పోస్ట్ కోసం అయిదుమంది కాండిడేట్లు వస్తారు" అని కరుణ ముఖంలోకి చూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

"ఏమిటీ నాటకం ?"

"నాటకం కాదు సార్ ! నిజంగానే... మీకు పర్సనల్ అసిస్టెంటును నేను. ఏదయినా పని వుంటే చెప్పండి..."

"నీ ఉద్యోగం సంగతి సరే... నేను ఇక్కడ అడ్జస్ట్ అయేదాకా... నువు వచ్చి నా చెవిలో రొదపెడుతూ కూర్చుంటే నేనన్నా ఇక్కడ్నించీ పారిపోతాను. లేదా నిన్నయినా తన్ని తరిమేస్తాను."

"బాబోయ్ ! ఇదేం ఆఫీసరు. రెండూ వద్దు. ప్రస్తుతానికి నేనే పోతున్నాలెండి. మళ్ళీ రేపొస్తాను" అనేసి వెళ్ళిపోయింది కరుణ.

'అల్లరి పిల్ల' అనుకుంటూ వెళ్ళి స్వివెల్ ఛేర్‌లో కూర్చుని సిగరెట్ వెలిగించుకున్నాడు.

"ముందుగా ఇంటర్వ్యూ సంగతేమిటో చూద్దాం" అనుకుని పాడ్ పెన్ దగ్గరికి లాక్కుని కూర్చున్నాడు. ప్రశ్నలు రాసుకుందామని నెంబర్లు వ్రాసుకున్నాడు.

జర్నలిస్ట్‌గా అతను ఇంతవరకూ ఎందరినో ఇంటర్వ్యూలు చేశాడు. ఈ ఇంటర్వ్యూ ఏమిటో ఓ లెఖ్ఖా అనుకుంటూ, మొదట ప్రశ్నగా "పేరు, ఊరు" రాసుకున్నాడు.

ఒక్కొక్క ప్రశ్నా రాస్తూ ఉంటే రెండు ఇంటర్వ్యూలకీ మధ్య ఉన్న తేడా అర్థం అవుతోంది. జర్నలిస్ట్ పది ప్రశ్నలతో వెళ్ళి, మూడు పేజీల విషయాలని సేకరించుకుని రావచ్చు. ఇక్కడ ఒక్క ప్రశ్నకీ, ఒకోసారి రెండు ప్రశ్నలకీ, ఒకటే జవాబు వచ్చే అవకాశం ఉంది. ఎన్ని ప్రశ్నలు వేస్తే అన్ని విషయాలు తెలుస్తాయి.

ప్రశ్నలు అన్నీ తయారు అయేసరికి బుర్ర వేడెక్కినట్లయింది హరికి.

## 43

కరుణ పెళ్ళి హరిప్రసాద్‌కి సమస్య అయింది. అతను మొదటిసారి ఓ సంబంధం తెచ్చినప్పుడు బాగా అల్లరి చేసింది. "నన్నడక్కుండా వాళ్ళనెందుకు రమ్మన్నారు ? నేనసలు పెళ్ళే చేసుకోను" అని అలిగి కూర్చుంది వచ్చిన వారితో మాట్లాడనూలేదు, తలెత్తి చూడనూ లేదు.

కోపం వచ్చింది హరిప్రసాద్‌కి.

"పెళ్ళి చేసుకోకుండా ఎన్నాళ్ళు ఇలా ఉండి పోదామని"

"ఏం ? మీకు అడ్డంగా ఉన్నానా ? అలా అయితే చెప్పండి"

"ఛ! అది కాదు కరుణా! ఆడపిల్ల అయిన తర్వాత పెళ్ళి చేసుకుని స్థిరపడిపోవటం తప్పదు. నా మాట విను."

"అదే, ఆ రూలు చేసిందెవరు? అంటాను— మీలాంటి ఛాదస్తులే కనిపెట్టి ఉంటారిలాంటి సిద్ధాంతాలని."

"నువేలా అయినా అనుకో. మీ డాడీ కోరిక మేరకు నువ్వు పెళ్ళిచేసుకుని తీరాల్సిందే ఎల్లుండి ఒక డాక్టరు వస్తాడు నిన్ను చూడటానికి."

డాక్టర్ వాళ్ళు వచ్చిన రోజు కొంచెం మర్యాదగానే ప్రవర్తించింది. చిరునవ్వుతో పలకరించింది.

"కుర్రాడు బాగున్నాడు. కరుణకీ నచ్చినట్లుంది" అని సంబరపడిపోయాడు హరి.

"ఏం కరుణా ? ఎలా ఉన్నాడు పెళ్ళికొడుకు" హుషారుగా అడిగాడు, వాళ్ళు వెళ్ళిన తర్వాత.

"ఛీ ! ఏం బాగులేడు."

"తల్లీ. అంత చక్కగాఉన్న అబ్బాయి నీకు నచ్చలేదా. పోనీ ఎలా వుండాలో చెప్పకొంచెం. నా పని సులువవుతుంది."

"చెప్పమంటారా మరి... చెప్పేస్తున్నా ... అచ్చం ... మీలాగ ఉన్న అబ్బాయి ఎక్కడయినా దొరికితే పట్టుకొచ్చెయ్యండి."

ఆ మాటలతో హరికే సిగ్గు అనిపించింది. ముఖం ఎర్రబడిపోయింది. అయినా తమాషాగా అన్నాడు, "ఏమిటి, పొట్టిగా, గుండుగా, చింపాంజీలా ఉంటే ఇష్టమా నీకు ?"

— "అవును. నాకు చింపాంజీలా ఉన్నవాళ్ళే ఇష్టం" అనేసి పారిపోయింది కరుణ అక్కడ్నించి.

మళ్ళీ ఇంకోసారి ఇదే విషయం చర్చకు వచ్చినప్పుడు తెగేసి అన్నది కరుణ, ధైర్యంచేసి. "ఊరికే ఎందుకిలా సంబంధాల కోసం వెతికి అలిసిపోతారు ? మీరే చేసుకోండి నన్ను."

"ఏయ్ కరుణా ! నీ కసలేమయినా బుద్ధి ఉందీ ! అలా పిచ్చిపిచ్చిగా మాట్లాడావంటే చెంపలు పగలగొట్టేస్తాను జాగ్రత్త. ఈసారి నాకు నచ్చిన అబ్బాయిని తెస్తాను. నువు నోరెత్తకుండా ఒప్పుకోవలసిందే." అని కోపగించాడు హరిప్రసాద్.

## 44

ఎక్కడయినా ఆరవయివేలు అప్పు దొరుకుతుందేమోనని ఊళ్ళో వీలయిన చోటల్లా ప్రయత్నించి చూస్తున్నాడు హరిప్రసాద్.

అయిదేళ్ళనాడు ఆఫ్‌సెట్ ప్రెస్ కోసం చేసిన అప్పు లక్ష రూపాయలకి ఏటా కొంత చెలు పెడుతున్నారు. నోటులోరాసుకున్న అయిదు సంవత్సరాల కాలపరిమితి ముగిసేందుకు ఇంక మూడు రోజులే ఉన్నాయి.

హరి ఆరునెలల క్రితమే తమకి అప్పిచ్చిన రామకృష్ణయ్యగారికి ఒక ఉత్తరం రాసాడు. తమ నోటుకి కాలపరిమితి మరో మూడేళ్ళు పెంచవలసిందని కోరుకుంటూ. వెంటనే తనకెలాంటి అభ్యంతరమూ ఉండబోదు, మళ్ళీ మూడు సం. నోటు తిరిగి వ్రాసుకుందాం అని అంగీకరించాడా పెద్దమనిషి.

మళ్ళీ మధ్యలో ఏం జరిగిందో ఏమో ఇంకొక ఉత్తరం రాసాడు. అది మూడురోజుల నాడు అందుకున్నాడు హరి. వాళ్ళు చెల్లు పెట్టాల్సిన ఆరవయివేలు అత్యవసరంగా తనకి కావలసి వచ్చాయనీ, అందువల్ల నోటు తిరగ రాసుకునే వీలులేదు కాబట్టి వెంటనే సొమ్ము తీర్చి వేయాలిసింది అని ఆ ఉత్తరం సారాంశం.

హఠాత్తుగా ఆయన ఎందుకలా చేశాడా అని ఆశ్చర్యం వేసింది మొదట. కానీ ఆ సాయంత్రానికే ఆ సందేహమూ తీరిపోయింది. ఆవేళ మధ్యాహ్నం కొత్తగా చేరిన బిజినెస్ మానేజర్ ఒక మనిషిని వెంటబెట్టుకుని వచ్చాడు హరి దగ్గరికి.

"సార్ ! ఇతన్ని 'జాలీకోలా' మేనేజ్‌మెంటువారు పంపారట. అతను ఎందుకువచ్చిందీ మీతోనే మాట్లాడాలని అంటున్నాడు" అన్నాడు.

"మా మేనేజ్‌మెంటువారు కొత్త వార్తాపత్రిక ఒకటి ప్రారంభించబోతున్నారు. మీ కంపెనీ కొన్ని ఇబ్బందుల్లో పడినట్లు తెలిసింది. మీరు ఆఫ్‌సెట్ ప్రెస్ ఏమయినా అమ్మదలచుకున్నారా అని విచారించుకుని రమ్మన్నారు." చల్లగా విషయాన్ని బయటపెట్టాడు అతను.

"మేం ఇబ్బందుల్లో ఉన్నామని మీకు ఎవరు చెప్పారు ?"

"నాకు తెలీదు సార్"

"మేం ఆఫ్‌సెట్ ప్రెస్ అమ్ముతున్నామని ఎలా తెలిసింది ?"

"నాకు తెలీదండి."

"ఏమిటయ్యా నీకు తెలిసింది ? ముందు క్కణ్ణించి బయటికి నడు. ఇంకెప్పుడయినా ఇక్కడికొస్తే ముందుగా మా బి. ఎమ్. తో మాట్లాడి అతను అనుమతిస్తేనే నా దగ్గరికి రావాలి అని తెలుసుకుని మరీ వెళ్ళు...గెటవుట్" అని తరిమేసాడు హరి.

ఇవాళ ఉదయం వచ్చిన ఉత్తరానికీ, మధ్యాహ్నం వచ్చిన వ్యక్తి మాటలకీ ఉన్న సంబంధం అర్థమయింది. 'జాలీకోలా' వాళ్ళని గురించి తాను బయటికి తీసిన మిస్టరీ వల్ల వాళ్ళు చాలా పెనాల్టీ చెల్లించుకోవలసి వచ్చింది. "ఆ కసితో ఇలా పరోక్షంగా పలుకుబడు నుపయోగించి, నన్ను ఇరికించాలని చూస్తున్నారన్నమాట" అనుకున్నాడు.

ప్రస్తుతం ఒక్కసారిగా అరవైవేలు చెల్లు పెట్టేంత రెడీకాష్ తమ దగ్గరలేదు. ఈ ఏడు పుస్తకాల డిస్ట్రిబ్యూటర్స్ దగ్గర చాలా డబ్బు ఇరుక్కుపోయింది. అదంతా కలిపి ఓ ముప్పయివేల దాకా ఉండొచ్చు. అదయినా మొత్తం కలెక్ట్ అవాలంటే మరో మూడు నెలలు అవుతుంది. ఏం చేయాలి ? ఏముంది చేసేందుకు ? ఎక్కడో ఒక చోట ఎలాగయినా అప్పు తేవాలి. అదీ రెండు రోజుల వ్యవధిలో పుట్టించుకుని రావాలి.

ఆరోజు నించీ మూడు రోజుల దాకా తనకి









తెలిసిన డబ్బు గల వారందర్నీ ప్రయత్నించి చూసాడు. అందరూ, కాస్త టయిం ఇస్తే ఇవ్వగలం అనేవారే. ఇచ్చేందుకు టయిం ఎక్కడుంది ? అంత మాత్రం నెల రోజులు టయిం ఉంటే బేంక్‌లోనే తెచ్చేవాడు అప్పు.

ఒక్కొక్క నిముషమూ, గంటా గడిచి రోజులు అవుతున్న కొలదీ, టెన్షన్ పెరిగి పోతోంది హరిలో.

ఇంట్లో కరుణకి మాత్రము ఈ విషయం చెప్పలేదు. కానీ తను చెప్పకున్నా ఎలాగోలా ఆమె గ్రహించేస్తుందని అతనికి తెలీదు.

"ఇవాళా ఎక్కడా దొరకలేదా డబ్బు ?" అడిగింది హరి ఇంటికి రాగానే.

"నీకెలా తెలుసు ?" అడిగాడు హరి ఆశ్చర్యంగా.

"తెలుసుకుంటే అన్నీ తెలుస్తాయి ... అయినా బేంక్‌లో డబ్బు ఉంటే ఊరంతా వెతుకుతున్న మిమ్మల్ని ఏమనుకోవాలో..."

"కరుణా ఏమిట్నువ్వనేది ? ఎక్కడుంది డబ్బు."

"నా పేరున లేదూ ? డాడీ డెబ్బయివేలు పెట్టివెళ్లారుగా ?"

"అదా... అదిప్పుడు తీస్తే, ఎలా? "

"ఏం తీస్తే ... మళ్లీ తీర్చెయ్యండి నా అప్పు."

"అది కాదు కరుణా. తీర్చాలన్నా అంత త్వరగా ఎక్కడ్నుంచి తేను ?

ఈ లోపల ఎక్కడయినా నీకు పెళ్లి కుదిరిపోతే ఏం పెట్టి చేయను ?"

"హాఁ! పెళ్లి. అసలు మీకెలా చెబితే అర్థం చేసుకుంటారో! తెల్లారి లేచింది మొదలు రాత్రి పడుకునే వరకూ నీడలా మీ వెంట ఉంటున్నాను. ఎందుకు ? మీరంటే ఉన్న ప్రేమ వల్ల కాదూ ?"

# గోరంత దీపం

కోట్ విప్పి హేంగర్‌కి తగిలించి, టై లూజ్ చేసుకుంటున్న హరి బిత్తరపోయి చూశాడా ప్రశ్నకి.

దగ్గరగా వచ్చిన కరుణ టై ఊడదీసి పక్కనపెట్టి, అతని మెడ చుట్టూ చేతులు వేసి, హత్తుకుని నిలుచుంది. "ప్లీజ్ ! బావా. నన్నెందుకు దూరంగా ఎక్కడికో పంపించెయ్యాలని చూస్తారు ? నేను మిమ్మల్నేం అడగను. ఎప్పటికీ ఇలా ఉండిపోనివ్వండి" అని ఏడుస్తున్న కరుణని చూస్తుంటే ఏంచెయ్యాలో అర్థం కాలేదు హరికి.

"కరుణా ! ఏమిటిది ? ఏడుస్తున్నావా పిచ్చి," అని తలమీద చేయివేసి నిమురుతూ ఉండిపోయాడు.

"మీరంటే అభిమానమూ, ఆరాధనా నేను ఎన్నేళ్ళుగా పెంచుకున్నానో తెలుసా మీకు? నాకు బాగా తెలివివచ్చిన వయసులోనుండీ నా మనసుకు దగ్గరగా వచ్చి, నాతో స్నేహంచేసిన మగవాడు మీరొక్కరే. అప్పట్లో నా ప్రేమ నాకే తెలీదు" ఏడుస్తూనే చెబుతోంది కరుణ.

ఆ మాటలతో హరి తను ట్యూషను చెబుతున్న రోజుల్లో ఆ అమ్మాయి ప్రవర్తన గుర్తొచ్చింది. ఒకసారి తను హైద్రాబాద్ వెళుతుంటే అదేపనిగా స్టేషన్‌కి వచ్చి సెండాఫ్

## అంకితం

హితులు, స్నేహితులు అయిన శ్రీమతి వేమూరి లీలావతీ రాఘవయ్య గార్కి గౌరవాభిమానాలతో, ఈ నవల అంకితం.

— 'వింధ్యవాసిని'

ఇచ్చింది ఒక్కతే. మరోసారి తనకి జబ్బుచేస్తే రమణ వెంట తన్ను వెతుక్కుంటూ వచ్చింది.

"కరుణా ! నేనెందుకు చెబుతున్నానో నీకర్థం కాదు. నీ మేలు కోరినవాడిగా నీ ఇష్టాన్ని అంగీకరించలేకుండా ఉన్నాను. అసలు, నీకన్నా నేను పన్నెండేళ్ళు అయినా పెద్దవాడినే అయి ఉంటాను. ఒకసారి పెళ్ళయి, భార్యపోయిన వాణ్ణి."

"అవన్నిటికీ నాకులేని అభ్యంతరం మీకెందుకు ? అసలు మీకు నేనంటే ఏ మాత్రం ప్రేమ, అభిమానం ఉన్నాయో నాకు తెలుసు. మీ మనసుకి తెలుసు. అయినా "లేదు కరుణా, నువ్వంటే నాకు అసహ్యం. నీ పొడ నాకు గిట్టదు" అని ఒక్కమాట అనండి. చాలు. ఇంక మళ్ళీ మీ జోలికి రాను."

అలాగే కరుచుకుని నిలుచుని ఏడుస్తున్న కరుణని విడదీసి, మంచంమీద కూచోబెడుతూ, "అది కాదోయ్ ! నీకు మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తానని నేను మీ డాడీకి ఇచ్చిన మాట ఏం కావాలి ?" అన్నాడు.

"భలే మాట ఇచ్చారులే. మాట తీసి గట్టున పెట్టేయండి. నేనెప్పుడో డాడీకి ఉత్తరం వ్రాశాను. ఇవాళ మీకూ రాశారు చూడండి. ఆయనకు ఇష్టమే నా కోరిక అని తెలుసుకుంటారు."

గబగబా వెళ్ళి టేబిల్‌మీదున్న ఉత్తరాన్ని అందుకుని చదువుకున్నాడు. అతను చదువుతూ ఉండగానే వెనుకగా వచ్చి మెడ చుట్టూ చేతులేసి నిలుచుని, వీపుమీద ముఖాన్నుంచి, "ఇప్పుడేమంటారు ?" అని గొణిగింది.

"నువెంత మొండి దానివి ? ఆఖరికి నీ పట్టుదలే తీర్చుకున్నావు" అంటూ చిరునవ్వుతో కరుణ భుజాల చుట్టూ చేయి వేసి దగ్గరగా లాక్కున్నాడు హరి.

(అయిపోయింది) ★

# ధర్మపథం




# వ్రాత విలువ

**మా**టకు ఉండే విలువ కంటె వ్రాతకు గల విలువ గొప్పది. మన పూర్వుల కాలంలో వ్రాతే అవసరమయేది కాదు అందువల్ల అప్పటివారికి దాని విలువ తెలియ లేదు. అప్పటివారు మాట తప్పేవారు కాదు అందువల్ల వ్రాతకు అవసరం లేకపోయింది.

మనం తొందరపాటున అనాలోచితంగా ఉద్రేకంతో ఎదటివారితో మాటలాడవచ్చును. మాటా, మాటా వచ్చి తీవ్ర పరిణామాలకు దారితీయవచ్చు. చిక్కు సంభవించినప్పుడుగాని మనం చేసిన పొరపాటు మనకు జ్ఞప్తికి రాదు. అందువల్ల మాటలాడేముందు కొంత ఆలోచన అవసరం. కాని అట్టి సమయంలో ఆలోచన తోచడం కష్టం. మనం ఏమి మాటాడ దలచుకొన్నామో దానిని ఒకసారి వ్రాసికొని తర్వాత మాటలాడాలని నిర్ణయించుకోవాలి వ్రాసేటప్పుడు ఆ మాట, ఆడవలసినదా? ఆడరానిదా? అనే ఆలోచన పుడుతుంది మాట ఆడరానిదని తోస్తే – మరి ఆ మాట చెప్పడం నిలిచిపోతుంది. ఉద్రేకం తగ్గి, సరియైన విధంగానే పలకడం కుదురుతుంది

ఏదైనా జాబు వ్రాసినప్పుడు దానికింద సంతకం చేస్తేనేగాని ఆ జాబుకు విలువ ఉండదు. "చీటికి ప్రాణంబు వ్రాలు" అని సుమతి శతకకారుడు చెప్పియే యున్నాడు. ఏదయినా పత్రం వ్రాస్తే దానికింద సంతకం చేస్తేగాని అది చెల్లదు.

ఒకప్పుడు ఏదయినా ఒక మాట చెప్పి. ఏదైనా దానిని గురించిన ప్రసంగం వచ్చినప్పుడు "నేనిలా చెప్పలేదే!" అని తప్పించుకొనుటకు సాధ్యపడుతుంది. కాని, అదే వ్రాత మూలంగా వుంటే తప్పించుకోడానికి వీలు పడదు కదా!

చదువు విషయంలో కూడా ఇంతే! ఉపాధ్యాయుడు నోటితో చెప్పి బోధించిన దానికంటె బ్లాక్‌బోర్డుమీద వ్రాసి బోధిస్తే బాగా మనస్సుకు పడుతుంది పదిసారులు చదవడం కంటె ఒకసారి ఆ విషయాన్ని వ్రాస్తే బాగా మనస్సుకు హత్తుకుంటుంది. చదువుతున్నప్పుడు మనస్సు స్థిరంగా లేకుండా చలించడానికి వీలుంటుంది. వ్రాసేటప్పుడు మనస్సు వ్రాతమీద ఉండకపోతే తప్పులు పడతాయి.

పరీక్షలలో ముఖ పరీక్ష చేసినప్పుడు మంచి తెలివిగలవాళ్లు కూడా భయపడి సరియైన సమాధానాలు చెప్పలేకపోతూ ఉంటారు. వ్రాత పరీక్షలలో కొంచెంసేపు ఆలోచించి వ్రాయవచ్చును. భయం కూడా ఉండదు. తెలిసిన ప్రశ్నలకు మొదట సమాధానం వ్రాసి, తర్వాత మిగిలినవాటికి ఆలోచించి వ్రాయడానికి అవకాశం ఉంటుంది.

బ్రహ్మ వ్రాత అంటారు కాని బ్రహ్మ మాట అని అనరు. ఆ వ్రాత చెరపరానిదట!

మాట విలువ కంటె వ్రాత విలువ గొప్పదని గ్రహించాలి. ★



# నాగుబాముకు చావుమూడింది

— డా॥ ఆర్వియస్. సుందరం



విద్యుల్లత నా విద్యార్థిని. పేరుకు తగ్గట్టే మెరుపు తీగలా గుంటుంది. అంతేకాదు. సన్నగా, తెల్లగా, చల్లని గోదావరిపై నుంచి వీచే పిల్లతెమ్మెరలా వుంటుంది. ఆమె నవ్వితే కడలి తీరంలో అలల పెదవులపై మెరిసే తెల్లని నురగను చూసినట్లుంటుంది.

అందుకే విద్యుల్లత అంటే నా కెంతో ఇష్టం.

అందాన్ని చూచి మాత్రం ఇష్టపడ్డా నంటే తప్పే అవుతుంది. విద్యుల్లత సౌందర్యవతి మాత్రమే కాదు సుగుణాల రాశి. వినయానికి, విధేయతకి, విశాల హృదయానికి విద్యుల్లత మారుపేరు గురువులమీద భక్తికి, చదువుమీద ఆసక్తికి ఆ అమ్మాయిని చెప్పిన తర్వాతే మరెవరినైనా చెప్పాలి.

ఇలాంటి అమ్మాయంటే ఎవరికి మాత్రం ఇష్టం వుండదు!

*  *  *

విద్యుల్లత ఎం. ఏ. ముగించుకుని వుద్యోగాన్వేషణలో పడి ఆరు నెలలయింది. ఈ విశాల భారతావనిలో అత్యంత సులభంగా సంపాదించ గలిగేది నిరుద్యోగ మొక్కటే కాబట్టి, నా ప్రియ విద్యార్థినికి కూడా దేశం దాన్నే ప్రసాదించింది.

విద్యుల్లత నాతో చాలా చనువుగా వుండేది కాబట్టి 'విద్దీ' అని పిలిచేవాణ్ణి! మా చనువు ఏ మాత్రం అపార్థం చేసుకోదగిందికాదు. విద్ది నా దగ్గర చదివేటప్పుడు ఎం. ఏ. తరగతిలో పదిమంది మాత్రం వుండేవాళ్ళు. అందరిలోకి ఆ అమ్మాయే మొదటి స్థానంలో వుండేది. ఒకసారి వరసగా వారం రోజులు విద్ది రాకపోయేసరికి ఆఫీసులో అడ్రసు కనుక్కొని వాళ్ళింటికివెళ్ళాను.

జ్వరంతో పడక పెట్టిన విద్దిని చూసి కడుపు తరుక్కుపోయింది. ఆ రోజు నేను అలా వెతుక్కుంటూ ఇంటికి వెళ్ళటం విద్యుల్లతకు నామీద ఆప్యాయతను పెంచింది. వాళ్ళింట్లో కూడా నన్ను ఎంతో గౌరవంతో చూచేవారు.

ఒకరోజు విద్యుల్లత హడావిడిగా వచ్చి "నాకు వుద్యోగం వచ్చేట్టుంది సార్" అంది.

నాకు సంతోషంతో నిముషంపాటు వుక్కిరి బిక్కిరి అయినట్లయింది.

"ఆహా! ఎంత చల్లని మాట చెప్పావ్ విద్దీ" అన్నాను.

"ముందు నేను చెప్పే మాటలు వివరంగా విని మీ సలహా చెప్పండి సార్" అంది విద్యుల్లత.

'ఏమిటో చెప్పు' అన్నట్లుగా గడ్డంకింద చేతులుంచుకొని కూర్చున్నాను.

"ఇక్కడే కలెక్టరాఫీసులో టైపిస్టుగా పనిచేసే రమ వుందిగద సర్, ఏదో మాటల సందర్భంలో వాళ్ళ ఆఫీసులో ఫుడ్ ఇన్స్పెక్టర్ నాగరాజుతో నా విషయం చెప్పిందట ఆయనకు ఎం. ఎల్. ఏ. లు, మంత్రులు కూడా తెలుసట. రేపు వెళ్తే అన్ని వివరాలు కనుక్కొని తప్పక సహాయం చేస్తానన్నారుట."

నా వుత్సాహంమీద నీళ్ళు జల్లినట్లయింది.

"అంతేనా విద్దీ? నేనింకా ఎక్కడైనా నిజంగానే వుద్యోగం వచ్చేసిందేమో అనుకున్నాను సుమా, ఏమైనా మన ప్రయత్నం మనం చెయ్యాలికదా?"

అవునన్నట్లు తలూపింది విద్ది.

విద్యుల్లతకు వుద్యోగం అత్యవసరమని నేనెరగంది కాదు. వాళ్ళది పెద్ద సంసారం, పేదకుటుంబం. పూలమ్ముకొని కుటుంబాన్ని పోషిస్తున్న తండ్రి అనారోగ్యంతో మంచం పట్టాడు. అన్న ఏదో వూళ్ళో ఫాక్టరీలో పనిచేస్తున్నాడుగాని, ఖర్చులు పోను నూరు రూపాయలు మాత్రం ఇంటికి పంపిస్తాడు. తమ్ముళ్ళు ముగ్గురు, చెల్లెళ్ళు ఇద్దరు చిన్నవాళ్ళు. వీళ్ళందర్నీ పోషించాల్సిన బాధ్యత విద్ది నెత్తిమీద పడింది.

మరుసటి రోజు విద్యుల్లతతోబాటు నేనూ నాగరాజు దగ్గరికి వెళ్ళాను. ఆ రోజు విద్ది స్నేహితురాలు రమ ఆఫీసుకు రాలేదు. మేమే నాగరాజును గురించి వాకబు చేశాం. క్యాంటీనుకు వెళ్ళాడన్నారు.

మేము క్యాంటీను దగ్గరికి వెళ్ళేసరికి వెలుపల ఒకతను సిగరెట్ తాగుతూ ఎవరితోనో మాట్లాడుతున్నాడు. అతన్ని చూడగానే నాకెందుకో నాగరాజు అతనే అనిపించింది.

"నాగరాజంటే..." సందేహం వ్యక్తపరుస్తూ అన్నాను.

"నేనే. ఏంకావాలి?"

అతను నిలబడ్డ తీరు, అడిగే రీతి, సిగరెట్ పొగ వదులుతున్న విధానం, ఇవేవీ నచ్చలేదు నాకు. మనిషిని చూడగానే మంచి అభిప్రాయం కలగటం లేదు. నల్లగా, లావుగా, పొడుగ్గా, గుబురు మీసాలతో, వికృతమైన నవ్వుతో కౌటిల్యం మూర్తీభవించినట్లున్నాడు నాగరాజు

"విద్యుల్లతను ఈ దినం రమ్మన్నారట కదా?" అన్నాను.

"ఆఁ, అవును విద్యుల్లతంటే ఈవిడే నన్నమాట! మీరెవరు?"

"నేను వాళ్ళ లెక్చరర్ని"

"అలాగా" నా ముఖం చూచి నాగరాజు అన్న చివరి మాట ఇదే. ఆ తర్వాత అసలతను నావైపు చూస్తే ఒట్టు. విద్దీతో ఇలా అన్నాడతను:

'నీ విషయమంతా రమ చెప్పిందమ్మా. మరో పది రోజుల్లో నిన్ను ఏదో ఒక ఆఫీసులో క్లర్కుగా వేయించే బాధ్యత నాది. కార్మికమంత్రి నాకు బెస్ట్ ఫ్రెండ్. అతనికీ నాకూ కూడా ప్రాణస్నేహితుడు ఈ వూళ్ళోనే వున్నాడు. నువ్వుగనక వస్తే ఇప్పుడే నిన్ను అతనికి పరిచయం చేస్తాను."

విద్యుల్లత నావంక చూసింది.

నా అంగీకారం ఆ అమ్మాయి అడగటం నాగరాజుకు ఇష్టం లేదల్లే వుంది.

"నువ్విలా మీనమేషాలు లెక్కపెట్టకూడదమ్మా. ఇలాంటి విషయాల్లో త్వరత్వరగా నిర్ణయాలు తీసుకోవాలి. నా ఫ్రెండ్ రేపు మళ్లీ ఢిల్లీ వెళ్ళిపోతాడు. కార్మికమంత్రి రేపే ఫారిన్ నుంచి వస్తున్నాడు. అతన్ని రిసీవ్ చేసుకుందుకు వెళ్తున్నాడు."

నేనుగాని, విద్యుల్లతగాని ఆలోచించేందుకు కూడా టైం ఇవ్వలేదు నాగరాజు. అటువైపు వెళ్తున్న ఆటోను పిలిచాడు నేనింక చేసేదేమీ లేక "సరే వెళ్ళు" అన్నాడు విద్యుల్లతతో.

వాళ్ళు ఆటో ఎక్కారో లేదో నాకు ఆ రోజే పేపర్లో చదివిన వార్త గుర్తొచ్చింది. కార్మికమంత్రి అవినీతి పరుడని అసెంబ్లీలో ప్రతిపక్ష సభ్యులు దుమ్మెత్తిపోశారు

"ఓరి నాగరాజూ, ఎంత అబద్ధం చెప్పావురా!" అనుకున్నాను

నాకు వెంటనే చెమట పట్టింది

"ఎంత తప్పు పని చేశాను! అసలు వాడి స్నేహితుడు ఎవరు, ఎక్కడున్నాడు. వాడేం పని చేస్తాడు, కార్మికమంత్రికీ వాడికీ ఏమిటి సంబంధం— ఇవేవీ అడక్కుండానే విద్దీని వాడికి అప్పగించాను. ఛా ఛా, ఎంత తప్పయిపోయింది."

కొంతసేపు అలాగే ఆకాశంవైపు చూస్తూ నిలబడి ఆలోచించాను

"అసలు వాళ్ళెక్కిన ఆటోను మరో ఆటోలో వెంబడించాల్సింది. వాడు విద్దీని ఎక్కడికి తీసుకెళ్తాడో ఏమిటో"— ఈ విధమైన ఆలోచనల్తో ఆ రోజంతా గడిపాను కాని నాగరాజు కలెక్టరాఫీసులో ఆఫీసరని, మళ్ళీ ఆఫీసుకు రాకపోడని జ్ఞాపకం వచ్చి మనస్సు కొంత కుదుట పడింది

మరుసటిరోజు అల్లంత దూరంలో విద్దీని చూడగానే మనస్సు కుదుటపడి నిట్టూర్పు విడిచాను. ఆ అమ్మాయి దగ్గరకు రాగానే ఇక మనస్సు వుండబట్టక అన్నాను

"వాడుత్త దొంగవెధవలాగున్నాడు విద్దీ అసలు కార్మికమంత్రి ఎక్కడికీ వెళ్ళలేదు నిన్నటి వరకు ఇక్కడే వున్నాడు. పేపర్లో వాణ్ణి గురించి బోలెడన్ని వార్తలొస్తున్నాయ్. ఈ వెధవేమో అతను ఫారిన్‌కి వెళ్ళాడని వీడి ఫ్రెండ్ రిసీవ్ చేసుకోటానికి ఢిల్లీ వెళ్తాడని

ఇటీవల నెల్లూరులో సెంట్ జాన్స్ స్కూలు 'పేరెంట్స్‌డే' సందర్భంగా జరిగిన భరత నాట్య ప్రదర్శనలో పాల్గొన్న చిరంజీవులు అపర్ణ, అనిత, శశికళ, ఉమామాధురిలని చిత్రంలో చూడవచ్చు.



కూస్తున్నాడు. ఇదంతా చూస్తే వాడి దగ్గరికి ఇక వెళ్ళటం మంచిది కాదనిపిస్తోంది.''

''అలాంటిదేమీ జరగదులెండి సార్. అతను నిన్న నన్ను భూషణం అనే అతని దగ్గరికి పిలుచు కెళ్ళాడు. ఆ భూషణం ఇప్పుడు పరిపాలిస్తుండే పార్టీకి జిల్లా అధ్యకుడట. ఇంకా ఇరవై ఐదు ముప్ఫయ్ ఏళ్ళుంటాయంతే. ఈ నాగరాజు, భూషణం నన్ను ఎల్లుండి కార్మికమంత్రి దగ్గరికి తీసికెళ్తారట. నా చేత ఒక అప్లికేషన్ కూడా రాయించారు. మంత్రి ఏదైనా కాలేజీలో లెక్చరరుగానో, కనీసం ఏదైనా ఆఫీసులో క్లర్కుగానైనా వెంటనే వుద్యోగం వేయిస్తాడుట.''

నాకీ కథ ఏమీ నమ్మదగిందిగా కనిపించ లేదు. ''కార్మిక మంత్రికీ లెక్చరరు పోస్టుకీ ఏమిటి సంబంధం, ఇందులో ఏమైనా గూడు పురాణీ వుందా'' అనిపించింది

''నిన్నొక్కదాన్నే రమ్మన్నారు కదూ ?'' విద్దీ నడిగాను.

''అవును సార్, మీకెలా తెలుసు ?'' ఆశ్చర్యంతో అడిగింది విద్దీ.

''వాడి వాలకం చూస్తుంటేనే తెలుస్తోంది నీవు మాత్రం వాళ్లతో ఎంత మాత్రం వెళ్లొద్దు తెలిసిందా ?'' దృఢంగా అన్నాను నేను.

''వంటరిగా మా నాన్న చచ్చినా పంపిం చడు మా అన్నో లేక మా పెదనాన్న కొడుకో ఎవరో ఒకరు నాతో వచ్చి తీరుతారు''

''అలాగయితేనే వెళ్ళు విద్దీ. అసలు నువ్వు ఈ విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలి తెలిసిందా'' హెచ్చరించాను.

''ఎల్లుండి వెళ్లేట్లయితే మరుసటిరోజు వచ్చి ఏం జరిగిందీ చెప్తాను సార్'' అనింది విద్యుల్లత.

*      *      *

విద్దీ వెళ్లినప్పటి నుంచి నా మనసు మనసులో లేదు. భయంకర పిశాచిలా మన

# నాగుబాముకు చావు....

దేశాన్ని పట్టి పీడిస్తున్న నిరుద్యోగం, ఆ మహమ్మారిని ఆసరాగా తీసుకుని అమాయకుల్ని ఆడిస్తున్న కిరాతక గణం. నా హృదయాన్ని అల్లకల్లోలం చేస్తున్న తలపుల్లో మెదలసాగారు.

''విద్దీ ఒకవేళ వాళ్లతో వెళ్లి మోసపోతే'' ఆ ఆలోచనే నా నవనాడుల్నీ క్రుంగదీసింది

ఉద్యోగం లేకుంటే పూట గడవని స్థితిలో వున్న ఆ అమ్మాయి ఏం చెయ్యాలి అనే ప్రశ్న నన్ను వేధించసాగింది

ఆత్మగౌరవం ప్రాణం కన్న మిన్న అని భావించే విద్దీ తలిదండ్రులు ఎట్టి పరిస్థితుల్లోనూ తను కూతుర్ని ఒంటరిగా నాగరాజుతో పంపించరు అని మనస్సు సమాధానం చెప్పకో సాగింది.

కాని, రేపు అనే ప్రశ్న వాళ్లను ఆలోచనా రహితుల్ని చేస్తుందేమోనని మరోవైపు బాధ.

ఆ రోజే విద్యుల్లత మంత్రి దగ్గరికి వెళ్ళాల్సి వుంది.

మెరుపులాగా ఒక ఆలోచన వచ్చింది నాకు భూషణానికి ముందు పార్టీ జిల్లా అధ్యకుడు నాకు పరిచయస్థుడే. వెంటనే వెళ్ళి ఫోను చేశాను. ఆయన్నుంచే ఫోనులో వచ్చిన జవాబు విని గుండె ఆగినట్లయింది నాకు.

''వాడొక లోఫరండి. నా తర్వాత అలాంటి వాడు నా స్థానానికి రావటం వల్లనే నేను ఆ పార్టీకి మొన్ననే రాజీనామా చేసాను. వాడు ఆరునెలల క్రితం ఒక వేశ్యా గృహంలో వుండగా పోలీసులకు పట్టుబడితే ఇప్పుడు కార్మికమంత్రిగా వుండే వాడి స్నేహితుడే విడిపించాడు.''

వెంటనే ఆటో కోసం కేకేశాను. విద్యుల్లత ఇంటికి బయలుదేరాను.

ఆటోలో కూర్చున్న పది నిముషాలు నా జీవితంలో మరువలేనివి. ఆ పది నిముషాలు నరకయాతన అనుభవించాను. నా వూహలకు అంతంటూ లేకపోయింది. ''విద్యుల్లత ఈ విషవలయంలో చిక్కుకుపోయిందా ? వుద్యోగం రాకపోతేపోయింది, అసలు ఆ అమ్మాయి ఈ కబంధుల దుష్టహస్తాల నుంచి తప్పించుకుని బయటపడగలదా'' అని నా మనసు ఆక్రోశించింది

''నేనెంతో ఆప్యాయతగా వుంటానుకదా ! అసలు ఆ రోజు నాగరాజు ఆటోలో ఎక్కి రమ్మంటుంటే 'మా మాస్టారు నాతో వస్తేనే నేను మీతో వస్తాన'ని ఒక్కమాట అనకూడదూ ? ఆవిడకే నా మీద అభిమానం లేనప్పుడు నేను మాత్రం ఎందుకు ఇలా ఆవేదన చెందాలి ?... అలా కాదు ఏమీ తెలీని ఒక అమాయకురాల్ని మోసగాళ్ళు తమ వలలో బంధిస్తుంటే చూస్తూ వూరుకోవడమూ మంచిది కాదు. ఇంతకీ ఈపాటికే విద్దీవాళ్ళతో వెళ్ళిపోయుంటే ఏం చెయ్యాలి'' ఈ విధంగా సాగాయి నా ఆలోచనలు.

పరుగు పరుగున విద్యుల్లత ఇంటికి పరుగెత్తి గడప దాటగానే ముందరింట్లోనే ఆ అమ్మాయి కనిపించింది.

''హమ్మయ్యా! నువ్వింట్లోనే వున్నావా?'' వూపిరి పీల్చుకున్నాను

''ఎందుకు సార్ అలా గాభరా పడిపోతున్నారు ?'' అంది విద్యుల్లత.

''నువ్వు ఆ నాగరాజుతో వెళ్ళావేమోనని గాభరా పడిపోయా. ఆ భూషణంగాడిని గురించి వాకబుచేస్తే వాడుత్త వెధవని తేలింది. అందువల్ల పరుగెత్తి వచ్చేశా'' అన్నాను.

విద్యుల్లత గల గల గోదారిలా, చిగిర్చిన వసంతంలా, అమాయకంగా, అందంగా నవ్వింది. ''విషయం చెప్పకుండా నవ్వుత వేమిటి'' కొంచం చిరాగ్గా అన్నాను.

అంతలో వాళ్ళ నాన్నగారు రొప్పుతూ, రొజుతూ, దగ్గుతూ సమమతమవుతూ వచ్చారు.

''చెప్పండి నాన్నా. మీరే చెప్పండి జరిగిందేదో'' అని లోపలికి వెళ్ళింది విద్దీ.

ముక్కుతూ మూలుగుతూ చెప్పారాయన :

''ఆ నాగరాజు ఏదో ఆఫీసరంటే మంచి వాడేమోననుకున్నానండీ. వాడు, ఆ భూషణమూ పనికిమాలిన వెధవలు.

ఈ రోజు పొద్దునవచ్చి విద్దీని రమ్మన్నారు. అన్ని విషయాలు కాఫీ తాగుతూ మాట్లాడుదాం రమ్మని హోటలుకు పిల్చుకెళ్ళారట.

'కార్మిక మంత్రి దగ్గరికి పిల్చుకెళ్తాము. అయితే నువ్వు చొరవ చూపించాలి' అన్నారుట. ఎంత ధైర్యమండీ ఆ రాస్కెల్సుకు ?

మా అమ్మాయి 'చొరవంటే' అంటే 'నీకు మేం చెప్పాలా. తెలీదా ? వుద్యోగం రమ్మంటే వూరకే వస్తుందా' అన్నారుట.

కాఫీకూడా తాగకుండా గుడ్‌బై చెప్పేసి వచ్చింది విద్దీ. మేం పేదవాళ్ళంకదాని మా జీవితాలతో ఆడుకుంటున్నారు చూడండి.''






## ఆర్. ఎస్. — చీరాల

ఇప్పుడు నా వయస్సు 16 సంవత్సరములు. నేను 14, 15 సంవత్సరముల వయస్సులో పాటలు బాగా పాడేవాడిని. అప్పుడు నా గొంతు చాలా శ్రావ్యముగా వుండేది, ఇప్పుడు పాటలు పాడదామంటే ఆ శ్రావ్యము రావట్లేదు. ఎందు వలన ?

★ ఓకల్‌కార్డ్స్‌లో మార్పు రావటంవల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. మీరు ఇ ఎన్ టి. వైద్యులను కలిసి సంప్రదించండి.

## ఎమ్. ఎస్. ఆర్. — హైదరాబాద్

మా అమ్మగారికి ఒకమారు జ్వరం వచ్చినపుడు డాక్టర్ 'నోవాలిజిన్' ఇంజక్షన్ ఇచ్చారు. దానివలన ముఖమంతా మచ్చలేర్పడి, శరీరంపైన అంతా దద్దుర్లు వచ్చినవి. ఆ తరువాత కొన్ని రోజులకి లింఫ్‌గ్లాండ్ టి. బి వచ్చినది. ఈసారి ఇంజక్షన్ ఇచ్చినపుడు మరలా దద్దుర్లు ఏర్పడినవి మేమెంతో ఆందోళన చెందుతున్నాము. ఈ సమస్యకు పరిష్కారం తెలుపవలసిందిగా కోరుతున్నాము.

★ నోవాల్జిన్ (అనాల్జిన్) అనే మందు కొంతమందికి పడటంలేదని ఎందరో వైద్యులు తెలియజేస్తున్నారు.

ప్రతి మందుకీ ఒకే రోగిలో అలర్జీ రాదు ఒకవేళ స్ట్రెప్టోమైసిన్‌కి అలర్జీ ఉంటే ఐ. ఎన్. హెచ్, ఎ. ఎ. ఎస్. గాని తయసిటబోన్ గాని వాడవలసి ఉంటుంది. మీ అమ్మగారి సమస్యను వైద్యులు ప్రత్యక్షంగా పరిశీలించి చికిత్సా విధానం తీర్మానించవలసి ఉంటుంది.

## సి. పి. పి. — ఏలూరు

నా వయస్సు 22 సంవత్సరములు. ఇంకా వివాహము కాలేదు. నేను 14వ సంవత్సరములో పుష్పవతి నయ్యాను. రెండవమారు 1½ నెలకు బహిస్టు అయ్యాను. ఆ తరువాత 3 నెలలకి అయ్యాను అప్పటినుండి 4, 5 నెలల కొకసారి అవుతున్నాను. ఒకసారి 7 నెలల వరకు అవకపోతే లేడి డాక్టర్‌కి చూపించారు ఇంజక్షన్ ద్వారా ఒకమారు అయినా ఆ తరువాత మామూలే. నేను కొంచెం లావుగా వుంటాను నా బరువు 60 కె. జిలు నాకు థైరాయిడ్ గ్రంధి సరిగ్గా పనిచెయ్యటంలేదని చెప్పారు

★ థైరాయిడ్ గ్రంధి సరిగా పనిచేయక మిక్సెడీమా అనే రోగం వచ్చినవారికి ఇలా జరిగే అవకాశం ఉండటం వాస్తవమే ! థైరాయిడ్ మాత్రలను వైద్యుల సలహామేరకు వాడుతూ రావలసి ఉంటుంది.

## ఎల్. వి. యు. — భువనేశ్వర్

మా ఆడపడుచు కూతురికి 3వ మాసం వచ్చినది. రెండు నెలల వరకూ మలవిసర్జన బాగానే జరిగేది. కాని ఈ మధ్య సరిగ్గా అవట్లేదు. ఎనీమా చేస్తేనే 3 రోజులకొకమారు మలవిసర్జన జరుగుతున్నది. దీనికి ఏమి చెయ్యాలి ?

★ చంటిపిల్లలకి ఇచ్చేపాలలో పాలు–నీరు నిష్పత్తిని గమనించటం చాలా అవసరం. సరి అయిన ప్రమాణంలో నీరు వాడబడనప్పుడు మలబద్ధకం వచ్చే అవకాశం ఉంటుంది. పాలు క్రమబద్ధంగా ఇస్తూ ఉన్నా మధ్య మధ్యలో గ్లూకోసు నీళ్ళు పట్టటం మంచిది. వేసవి కాలంలో ఇంకా ఎక్కువగా ఈ నీరు పట్టవలసి ఉంటుంది ఎనీమా, మందులు మొదలయినవి అత్యవసర పరిస్థితులలో మాత్రమే వాడవలసి ఉంటుంది.

## ఆర్. ఎస్. — కోడుమూరు

నాకు ముందు పన్ను ఒకటి సగానికి విరిగి నల్లగా మారినది. చాలా వికారముగా వున్నది అది తీసేసి వేరే పన్ను పెట్టించుకుందామనుకుంటున్నాను. అలా పెట్టించుకుంటే దుర్వాసన అని చెబుతున్నారు. నిజమేనా ?

★ కృత్రిమ దంతాల వల్ల నోటి దుర్వాసన వస్తుందనుకోవటం తప్పు. కృత్రిమ దంతాలకీ దుర్వాసనకీ ఏ సంబంధమూలేదు.

## పి. ఎమ్. ఆర్. — చిలకలూరిపేట

నా వయస్సు 15 సంవత్సరములు. నాకు కొద్ది వారాలనుండి కళ్ళు మసగ్గా వున్నాయి. అంతకుముందు రెండువారాలనుండి కళ్ళు ఎర్రగా వుండేవి. దీనికి మందును ఏమివాడాలి ?

★ నేత్రవైద్యులు పరీక్షించి మీ కళ్ళలోని రోగాన్ని నిర్ణయించవలసి ఉంటుంది. బహూశా కళ్ళజోడు అవసరం అవుతుందేమో ! ★

---

ఎలాగైతేనేం విద్యుల్లత ఉద్యోగపర్వం ఈ విధంగా ముగిసింది. తర్వాత నా రచనల్లో సహాయం చెయ్యటానికి విద్దీని రమ్మని నేనే కొంత సహాయం చెయ్యసాగాను.

విద్దీ తన స్నేహితురాలు రమను అడిగిందట ''ఏవిఁటే మీ ఆఫీసులో నాగరాజ ఇలాంటి వాడనుకోలేదు. అదేమిటి అవాకులు చెవాకులు పేలుతాడు ?'' అని.

''అదంతా నాకు తెలీదుగాని ఒకరోజు నాతో అతనన్నాడే— 'మీ ఫ్రెండ్‌కు సహాయం చేద్దామనుకున్నాముగాని ఆవిడకు ధైర్యం లేదు' అని నేను ఆ విషయం పెద్దగా ఒత్తిడి చెయ్యలేదు'' అంది రమ. ఇవన్నీ నేను, విద్దీ మర్చిపోయి చాలా కాలమయింది.

అసలు కధ ఆ తర్వాత జరిగింది.

*　　*　　*

ఒకరోజు పేపర్లో 'అభాగ్యురాలి దీనగాధ' అని బాక్స్ కట్టి ప్రచురించారు అందులో కార్మికమంత్రి ఒక స్త్రీని బలాత్కరించాడని, ప్రజల్ని సంరక్షించాల్సిన నాయకులే ప్రజా భక్షకులైతే ఇక దిక్కెవరని ప్రశ్నిస్తూ ఎవరో విలేఖరి రాసిన ఉదంతం వుంది.

ఇది చదవగానే విద్దీ విషయంలో జరిగిందంతా ఒక్కసారి జ్ఞప్తికి వచ్చి ఒళ్ళంతా చెమట పట్టింది.

రాజకీయ నాయకులంటేనే అసహ్యంవేసింది.

ఇంతకంటె గమ్మత్తయిన విషయం ఏమిటంటే పేపర్లో పై వుదంతం ప్రచురింపబడిన మరుసటిరోజే నాగరాజు హత్య చెయ్యబడ్డట్టుగా కూడా పేపర్లో వచ్చింది

పోలీసులకుగాని, మరెవ్వరికిగాని అంతుబట్టని రహస్యం ఏమిటంటే నాగరాజు భార్యే ఎందుకు ఈ హత్య చేసిందా అని.

ఆడబడుచుల మాన సంరక్షణ కోసం ఇంతకంటె మార్గం లేదన్న సంగతి తెలుసుకుని ఈ నిర్ణం తీసుకున్న ఆ మహా ఇల్లాలికి చెయ్యెత్తి నమస్కరించింది ఇద్దరంటే ఇద్దరే—

నేనూ,

విద్యుల్లతా. ★

# వెలుగు – నీడ

సీరియల్

ఇచ్ఛాపురపు రామచంద్రం

"నేను – మగ తోడూ... పురుష సౌఖ్యమూ ఎరుగనవా ?" రోషంగా అడిగింది చంచల.

లతిక జాలిగా నవ్వింది. "మీరే ఆలోచించండి. పాత్రల కోసమో ... కొత్త కంట్రాక్టుల కోసమో ... మనసులో వేరు ఉద్దేశంతో ... ముక్కు మూసుకుని ... ముసిలి ప్రొడ్యూసర్‌తోనో డిస్ట్రిబ్యూటర్‌తోనో ఆ మూడు నిముషాలూ భరించడం ... అది కాదమ్మా స్త్రీ పురుషుడి నుంచి పొందే స్వర్గ సుఖం. మనసయిన వాడితో ... భర్తతో ... మరో ఆలోచనలేకుండా ... స్వర్గపుటంచులు తాకడం...పరవశించడం...అటువంటి అనుభూతి ఒక్కసారంటే ఒక్కసారి ... పొందగలిగారా ?"

ఉలిక్కిపడింది చంచల. అంతరాత్మ ఎదురు తిరిగింది.

"లేదు ... ప్రేము లేదు ... నిజమే ... ఆ అనుభవాలు ఒట్టి కృతకమే" అంగీకరించింది.

"నటనకే అంకితమైపోయి – వాస్తవ జీవితంలోని చాలా మాధుర్యాలను మీరు బలి చేసుకున్నారు. అందుకే– ఒక మాట చెబుతాను. జాగ్రత్తగా ఆలోచించండి ... "

"ఏమిటి ?"

"మీరు పెళ్లి చేసుకుని – జీవితం అనుభవించండి."

"లతికా !" ఒక్కసారాగి అందామె. "నన్నెవరూ పెళ్ళి చేసుకోరే !...ఎవరయినా చేసుకున్నా నా డబ్బుకోసమే. అటువంటి జీవితం ఎటూ బాగుండదు. గ్లామర్ నశించిన నేను– ఫీల్డుకెలా పనికిరానో పెళ్ళికీ అలాగే పనికిరాను. ఐనా నాకిప్పుడిహ పెళ్ళేమిటి ?"

లతిక మౌనంగా ఉండిపోయింది.

"పెళ్ళికి – నేను అర్హతను కోల్పోయాను. పేరుకోసమో, డబ్బుకోసమో, కొత్త కంట్రాక్టుల కోసమో – దేనికైతేనేం, కక్కుర్తిపడి – శరీరాన్నమ్ముకుంటూ పతితనే అయ్యాను. నేను సినీరంగానికి తప్ప జీవిత రంగానికి పనికిరాను.



**( గత సంచిక తరువాయి )**

మలిన పుష్పాన్ని ఎవరు ఆఘ్రాణిస్తారు ?" అలాగ – కచ్చితంగా చెప్పేసింది చంచల.

ఆమెను చూస్తే జాలివేసేది లతికకు.

"నన్ను – గెంటేశారు," అంటూ ఏడ్చేది తెగతాగి. ఆమెను – మార్పుగా ఉంటుందని — షికారుకో, షాపింగుకో తీసుకువెళ్ళేది.

"ఒక్కరూ నావేపు చూడరేం ? నన్ను పట్టించుకోరేం ? ఏడాదికే నేను శాశ్వతంగా జనాల జ్ఞాపకాలలోంచి జారిపోయానా ? అయ్యో !...అప్పుడు...నేను బయటకు ఒస్తే... నా కారుని చుట్టుముట్టి...కదలనిచ్చేవారు కారే ! ఎంతమంది అభిమానులు ! నన్ను చూసి పిచ్చెక్కిపోయేవారు కదా ? ఏరీవారు ? వాళ్ళంతా ఏమైపోయారు ? ఒక్కరు...ఒక్కరు..." ఏడిచేసేది.

అశాంతి... పెన్నిధి కోల్పోయినట్లు విచారం. దుఃఖాతిరేకం, విషాదం, వ్యధ, కళాకారులకి వొచ్చే వ్యాధి కాబోలిది. కళారంగం నుంచి తొలగించబడితే యిలాగే గిలగిలలాడిపోయి ...విలవిల విలపిస్తారు.

"తాగుడు తగ్గించండి. మీ ఆరోగ్యం చెడిపోతోంది. మీ అందం..." మందలించేది లతిక

**జరిగిన కథ – 3 :** ప్రఖ్యాత సినీతార చంచల దగ్గరకు తనూ నటినవుదామని వచ్చిన జానకి ఆశ నిరాశవుతుంది. చంచల షూటింగ్ చివరి షాట్‌లో పడిపోతుంది. చంచల తను గర్భవతినని తెలిసి నిర్ఘాంతపోతుంది. లతిక తన చాకచక్యంతో చంచల గర్భవతి అనే విషయం ఎవరికీ అనుమానం రాకుండా దాచగలుగుతుంది. డెలివరీకి వేరే ఊరికి రహస్యంగా ఆమెను తీసుకొని వెళుతుంది. చంచల మగపిల్లవాడిని ప్రసవించి, ఆ బాబుని అక్కడే వదిలి మద్రాసు తిరిగి వస్తుంది. సినిమాలలో తన గ్లేమర్ తగ్గిపోతోందని విపరీతంగా బాధ పడుతుంది.

"అప్పుడు తాగేదాన్ని... అలసట భరించలేక. ఉక్కిరిబిక్కిరి నుంచి కొంచెం బయట పడాలని... పని వొత్తిడి భరించలేక. ఇప్పుడూ తాగుతున్నాను, పని దొరక్క ... వేసేందుకు పాత్ర లేక ... తీరిక భరించలేనంత ఎక్కువై పోయి, ఆశ నశించిపోయి... తాగకపోతే – బతకలేను. తాగుడు లేకపోతే–నేను లేను. ఆరోగ్యం– ఎవరికోసం ? అందం – ఎందుకోసం ? కళా ప్రపంచానికి నేనక్కర్లేదు..."

తపన...ఓటమి...

"ఎలాగో ఒకలాగ ఎవరినో ఒకరిని పెళ్లి చేసుకోండి. జీవితం నిష్ప్రయోజనంగా అనిపించదు. అర్థమూ పరమార్థమూ గోచరిస్తాయి."

"అరవయ్యేళ్ల యేట అగ్ని గండమా ! నాకీ వయసులో పెళ్లా ! పెళ్లనే పవిత్ర పదమే నేనుచ్చరిస్తే మలిన పడి పోతుందే." వెర్రినవ్వు.

"అనుభవాలు... జీవితంలోఎప్పటికయినా" నవ్వేది చంచల. "ఆ జీవితం అదీ నటనే ! తినేదాన్ని – రుచి తెలియకుండా సుఖపడేదాన్ని– మనసుకంటకుండా. ఆ బతుకు – కాగితపు పూవేనే ! ఇప్పుడర్థమౌతూంది."

ఆమెకు పిచ్చెత్తుతూందేమో అని భయం వేసింది లతికకు. డాక్టర్‌ని తీసుకువొచ్చింది. అంతా చెప్పింది.

"స్థలం మార్పు మంచిది." అన్నాడేవో మందులు రాసి.

"దేశం తిరిగి వొద్దామమ్మా... నాలుగూ చూసినట్లుంటుంది..." మొదట – రానంది. మద్రాసు వొదిలితే – వొచ్చే సినిమా ఛాన్సు లేమన్నా పోతాయేమో అని. కాని – లతిక చెప్పడంతో – ఎలాగో కదిలింది.

ప్రదేశాలు... ఆశ్రమాలు... నదీస్నానాలు.. తీర్థయాత్రలు...

"ఆశ్రయాలలో మనశ్శాంతి దొరుకుతుందా ? ఊహూఁ. దేముడెక్కడో ఉండడు. పనియే ప్రార్థన. కళ – భగవత్స్వరూపం. . అదే, కదే వేదాంతసారం ?"

నవ్వేది చంచల. "నాలుగు వేషాలు దొరికితే

నేను మళ్ళీ మనిషినై పోనూ ? నాకు డబ్బక్కర్లేదు. వేషాలు దొరికితే చాలు. అమ్మ వేషాలయినా సరే, అక్క వేషాలయినా సరే ..''

ఎంత దీనంగా... ఎంత ప్రాధేయత కంఠంలో నిలుపుకుని... నింపుకుని...

కన్నీరాపుకోలేకపోయింది లతిక. కరుణ — ఆమెను అస్వాధీనురాలిని చేసింది. తానేం మాట్లాడుతున్నదీ తనకే తెలియనిస్థితిలో.

''అమ్మ వేషాలు వేస్తారా ! నిజజీవితంలో అమ్మగా మిమ్మల్నిను గ్రహిస్తే — ఆ వరాన్ని అతి మూర్ఖంగా కాలదన్నేశారే ! అందుకే ... ఆ శాపమే... మిమ్మల్నిలా వేధించుకు తింటూంది. ఎంత చక్కని బాబు !... ఎన్ని జన్మల వరం!... కూల్ద్రోసుకున్నారు చేతులారా. అందుకే—మీకు— అమ్మ వేషాలు కూడా దక్కవు. ఇది— ఆ బాబు శాపం.'' అరిచింది లతిక ఆవేశంగా.

చంచల— ఆమెనే చూస్తూ ఉండిపోయింది.

లతిక— పొరపాటు గ్రహించింది. కాని — ఏం చేయడానికీ తోచక రాయిలా ఉండిపోయింది.

కొన్ని నిముషాలు... భారంగా గడిచాయి.

శిల్పంలా... శూన్యంలోకి చూస్తూ నిలబడి పోయిన చంచల పెదవులు వొణుకుతూ విచ్చుకున్నాయి. అస్పష్టమైన ధ్వని. గాలి నీరసంగా గుసగుసలాడినట్లు. ''బా ... బు ... ఔను. నా బాబు...''

ఒక్కసారిగా ఆమెలోని చలనమూ చైతన్యమూ వొచ్చేశాయి వరదలాగ. నీటికి పోటొచ్చినట్లు ఆమెలోకి ఆవేశం ఉరికింది.

లతిక భుజాలను గట్టిగా గుచ్చి పట్టుకుని ఊపుతూ పిచ్చిదానిలా అరిచింది. ''ఏడీ నా బాబు ?'' లతిక నివ్వెరపోయింది.

''అమ్మా !''

''నువ్వుకాదు. నా బాబు నన్నలా పిలవాలని చెప్పు... నా బాబెక్కడ ? ఏం చేశావ్ ?''

ఆమెను బయకు తీసుకెళ్లడం బహు కష్టమైపోయింది. నిర్విరామంగా ఆమె నోరు బాబు గురించే అడుగుతూంటే ఏం చెప్పాలో ఏం చెయ్యాలో తెలియక ఆమెకు విస్కీ యిచ్చి నిద్ర పుచ్చింది లతిక.

చంచలలో మాతృత్వం మేలుకొంది- పదిహేను, పదహారేళ్ల తరవాత ! ఆమె హృదయంలోని వాత్సల్యపు పొరలలో తీవ్రమైన స్పందన ప్రారంభమయింది. ఆమెలో ప్రేమ వాహినియై పరవళ్లు తొక్కుతోంది. ఆమె— బాబు కోసం అపరిమితంగా ఆరాటపడుతోంది !

ఆనాడు... అతి నిర్దాక్షిణ్యంగా తిరస్కరించిన వరాన్ని యీనాడు... ప్రాణాధికంగా కోరుకుంటూంది !



ఎక్కడున్నాడు బాబు ?

ఆ రాత్రి...

బాబుని రక్షించుకోడం తన కసాధ్యమని తేలిపోయాక, చంచలకి తెలియకుండా తనా పసివాడిని పెంచడం కుదరదని కచ్చితంగా తెలిసిపోయాక... విధిలేక... ముక్కూ మొహమూ తెలియని ఓ స్త్రీకి– బాబునీ కొంత డబ్బునీ యిచ్చేసింది లతిక దుఃఖిస్తూనే. ఆమె ఎవరో ఎక్కడిదో ఏమీ తెలియదు. తెలుసుకోకూడదని అప్పుడు చాలా కోరుకుంది.

''ఇదీ జరిగిందా అర్ధరాత్రి...'' అంది లతిక.

''బాబు ముఖం–నాకు జ్ఞాపకం వొస్తుంది. చాలా చక్కనివాడు. ఏం ?''

''నిస్సందేహంగా.''

''ఎలాగయినా నాకు నా బాబు కావాలి'' చిన్నపిల్లలాగే అంది చంచల.

''ఎలాగ ? ఎక్కడని వెదుకుతాం ? ఎవరని గుర్తు పడతాం ? పురిటి పాపగా చూశాం కొన్ని క్షణాలు పదహారేళ్ళ క్రితం పీడలా తలచి– ఎంత వెంటత వదిలించుకుంటామా అని ఆరాట పడిపోయాం...''

''బాబు వొంటిమీద పుట్టు మచ్చ ఏదయినా ?''

లతిక విషాదంగా నవ్వింది. ''ఇది సినిమా కథ కాదమ్మా. విధిరాసే మానవ జీవితపు కథ.

# వెలుగు - నీడ

దీనిలోని మలుపులూ మెరుపులూ మనిషి మేధకు ముందుగా అందవు. ముగింపు ముందుగా ఊహించలేం.''

''అంతేనా ?'' దీనంగా అడిగింది చంచల. లతిక మౌనంగా వుండిపోయింది.

''ఈ జీవితంలో నేను నా బాబుని కలుసుకోలేనా ? నా బాబు నాకు దక్కడా ?'' ఏడుస్తూ అడిగింది.

''అటుకాని యిటుకాని – ఎటూ చెప్పలేం. రాబోయే క్షణం ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. రేపు – మనకోసం ఏం దాచి ఉంచిందో ?''

చంచలలో చాలా మార్పు వొచ్చేసింది.

ఆమె ఆలోచనలే మారిపోయాయి. సినీ రంగాన్నామె పూర్తిగా మరచిపోయింది.

ఆమె ధ్యాసంతా బాబు మీదే.

''ఈపాటికి నా బాబుకి పదహారేళ్ళు వచ్చి ఉంటాయి కదూ ? పచ్చగా... దబ్బపండులా... మిసమిసలాడిపోతూంటాడుకదూ? రాజకుమారుడిలాగే ఉంటాడు. ఏం ?''

''ఔను.'' అంది లతిక.

''దేముడికి పూజలు చేయిద్దాం నా తప్పు క్షమించి నా బాబుని నాకిమ్మని.''

అయ్యాయి. ప్రశ్నలు వేయించారు.

చంచల వెర్రిదానిలా తయారైపోయింది.

ఇరవైనాలుగు గంటలూ ఒకటే ధ్యాస. బాబు... బాబు గురించే కలవరింతలు నిద్రపోతున్నా.

''లంచమిచ్చినా పలకలేదే దేముడు. రాతి బొమ్మకి రాగానురాగాలేం తెలుస్తాయిలే. అయినా– దేముడూ లేడు, దెయ్యమూ లేడు. మానవ ప్రయత్నమే సత్యం. బాబుని వెదుకుదాం పద.''

అన్వేషణకు బయలుదేరారు.

లతికకి తెలుసు – యిది నిష్ప్రయోజన కరమైన అన్వేషణే ఔతుందని. కాని – ఆమెను నిరుత్సాహపరచే మాట ఏదీ అనదామె. ఆధారం లేని యీ అన్వేషణ చివరకు మిగిలేదేమిటో ఎవరికయినా అతి సులభంగానే తెలిసిపోతుంది.

వెదకడం – ఏ హాస్పిటల్‌లో చంచల బాబుని కన్నదో అక్కడినుంచే ప్రారంభమయింది. పదహారేళ్ళలో చాలా మార్పులు వొచ్చాయి దేశమంతటా. ఊళ్ళ స్వరూపాలూ... మనుషుల స్వభావాలూ అన్నీ చాలా మారిపోయాయి. రోజు రోజుకీ అధికమౌతున్న చంచల తపన చూడలేక పోతూంది లతిక.

ఈ అన్వేషణ ఎన్నాళ్ళు సాగుతుందో తెలియదుకనుక భర్తనికూడా వెంటబెట్టుకునే వొచ్చిందామె.

చంచల తన బాబుని గుర్తించేందుకు కొన్ని మార్గాలు స్ఫురించాయి. అవే చెప్పింది లతికకి.

"పచ్చగా మిసమిసలాడుతూ... పదహారేళ్ల ప్రాయపువాడు. రాజకుమారుడిలా దర్జాగా ఉంటాడు. కళాకారిణి కడుపున పుట్టాడు కనుక అతనూ కళాకారుడూ, కళాపిపాసీ ఐ తీరుతాడు. అతను గొప్ప జీవితం గడుపుతూంటాడు. ఖరీదైన హోటల్లోనో... గొప్ప థియేటర్లోనో... అటువంటి చోటనే దొరుకుతాడు నా బాబు — సున్నితంగా... సుకుమారంగా ఉంటాడు. నలుగురిలోనూ ప్రత్యేకంగా నిలుస్తాడు."

రోడ్డుమీద ఎవరయినా అటువంటివాడు కనిపిస్తే — వెళ్లి పనికట్టుకుని పలకరించడం... అడ్రస్ తెలుసుకుని ... తల్లితండ్రులని — మీ బాబు మీరు కన్నకొడుకేనా అని ప్రశ్నించి చివాట్లు తినడం ... వాళ్లు పిచ్చివాళ్లని భావించడం.

ముగ్గురూ మూడు దిక్కులనుంచీ రాత్రికి హోటల్కి చేరుకోడం.

ఆరునెలలిలా గడిచేసరికి ... పదిహేను, యిరవై నగరాలు తిరిగేసరికి—విసుగూ అలసటా వొచ్చేశాయి. చంచలకి మాత్రం నిరాశాలేదు, నిస్పృహాలేదు, అలసటాలేదు, ఓటమీలేదు.

"బాబులాటివాడిని ... పెంచుకుంటే ? మీ ఆస్తీ ఐశ్వర్యమూ చూసి ఎవరయినా పెంపకమిస్తారు" సూచించింది లతిక.

"అరువు తెచ్చుకున్న వస్తువు — మనదౌతుందా ? నా బాబు ఉండగా మరొకరిని తెచ్చుకుని అమ్మలా నటించడం ఏం ఖర్మ ? నటించి నటించి విసుగొచ్చింది. ఇకనయినా నన్ను జీవించనీ."

"అన్వేషణ నీకు విసుగెత్తితే — వెనక్కి వెళ్లిపో నీ భర్తతో కలిసి. మీరిద్దరూ సుఖంగా బతకడానికి లక్షో రెండు లక్షలో రాసియిస్తాను."

"వొద్దు ... అలాగ వొద్దు" అంది లతిక బాధగా.

అన్వేషణ సాగుతూంది.

* * *

"లతికా ! ఇంకా ఏమీ సిద్ధం చేయలేదేం?" బాత్రూమ్లోంచి వొచ్చింది చంచల.

ఆలోచనలలోంచి తేరుకుంది లతిక. "లేదమ్మా ఇదుగో" లేచి వెళ్లి గ్లాసులూ ఐసూ డ్రింక్ సీసా తెచ్చి ఆమె ముందు టీ పాయ్ మీద ఉంచింది.

సరిగ్గా అదే క్షణంలో ... తలుపు మీద చప్పుడు. లతిక వెళ్లి తలుపు తీసింది. "మీరా !"

"నేనే...శుభవార్త...బాబు కనిపించాడు."

ఆ మాట వింటూనే లేచి పరుగెత్తుకు వచ్చింది చంచల.

"ఏడీ నా బాబు ? ఎక్కడ ?"

"పావుగంటలో వస్తాడు. మీ గదికే వస్తాడు."

# వెలుగు నీడ

"మీరెలా కలుసుకోగలిగారు ?" అడిగింది లతిక.

"తమాషాగా జరిగిందిలే. అచ్చం చంచల గారి పోలికలు గల అబ్బాయి కనిపించాడు. అతని యింటికి వెళ్లాను. తల్లి ఉంది. ఆమెను మాటలలో పెట్టి కథంతా లాగాను. కథ ... చరిత్ర...సరిగ్గా సరిపోయింది. సందేహం లేదు. మన బాబే..." ఆనందంతో చెప్పాడు.

చంచల తొట్రుపాటు పడిపోసాగింది. "లతికా ! యీ వెధవ సరంజామా అంతా తీసి పారెయ్. వాడు చూస్తే బాగుండదు. ఐనా—నా బాబు దక్కాక యింక నే నెందుకు తాగుతాను ? ఈ వెధవ సీసాలు..." తనే వాటిని కిటికీలోంచి విసిరేసింది.

"మీరు ఆవేశపడకండమ్మా..."

"ఆవేశంకాదే... ఆనందం. నా బాబు వొస్తున్నాడే, నీకు మాత్రం ఆనందంగాలేదూ? గది శుభ్రంగా ఉంచు. సర్వీసెస్కి చెప్పి మంచి స్వీట్లు...పళ్లు తెమ్మను. స్వీట్లు చాలా మంచివి కావాలి. అవి—నా బాబు కోసం..."

"నేనన్నీ ఏర్పాటు చేస్తాను కానీ— మీరు ప్రశాంతంగా కూర్చోండి చాలు."

"నాకు సమందే... లతికా ! నేను... నా బాబుకి అమ్మలా అనిపించాలంటే— యీ చీర నప్పదేమో ?... పట్టుచీర కట్టుకుని... జుత్తు ముడివేసుకుని... పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకుని... అలాగ తయారయ్యేదా ?"

"కానివ్వండి త్వరగా. బాబు వొచ్చేస్తాడు"

చంచల బాత్రూమ్లోకి వెళ్లిపోయింది.

లతిక గదిని అమరుస్తూందే కాని ఆమె గుండెలు ఆత్రుతతో వేగంగా కొట్టుకుంటున్నాయి ఆనాడు తన చేతులారా యిచ్చేసిన బాబు... పదహారేళ్లయ్యాక... తన భర్త వల్ల యిలా మళ్లీ కలుసుకుంటున్నాడు. అతని చరిత్ర అతనికి తెలుసా ? తల్లిదండ్రులు... కనిపెంచిన వ్యక్తులు చెప్పారా ? ఇప్పుడిక్కడికి వొచ్చి అతనేం చేయబోతున్నాడు ?

అతను వొస్తున్నాడంటే ఆనందంగాఉంది. కాని... అంతరంగపు మారుమూలలో ఎందుకో ఏమిటో భయం. ఏం జరుగుతుందో అని.

ఒక్కొక్క నిముషమూ బహు మెల్లగా గడుస్తూంది.

చంచల వచ్చి సోఫాలో కూర్చుంది. ఆమె అచ్చం సినిమా అమ్మలా నిండుగా గంభీరంగా ఉంది.

తలుపు తెరుచుకుంది.

పదిహేడేళ్ళ యువకుడు వచ్చాడు. వస్తూనే చంచలని చూస్తూ... "నమస్కారం, మీరే నన్ను కన్న స్త్రీ...చంచల అనుకుంటాను" అన్నాడు ఆమెకెదురుగా ఆగిపోయి.

ఒక్క ఉదుటున లేచి...అతన్ని కౌగలించుకొని...

"నేనే బాబూ...నేనే..." అంది చంచల. ఆమె కళ్ళవెంట ధారలై కురుస్తున్నాయి కన్నీళ్ళు.

లతిక — శిల్పంలా నిలుచుండి పోయింది ఆ దృశ్యం చూస్తూ, కొన్ని నిముషాలు..

అతనామె కౌగిలినుంచి విడివడి...దూరంగా తొలగబోయాడు. ఆమె అతన్ని తనపక్కన కూర్చోబెట్టుకుంది, చెయ్యి పట్టుకుని.

"లతికా ! బాబుకి స్వీట్లూ, పళ్లూ యివ్వవూ ?"

ప్లేట్లతో తెచ్చి అతని ముందుంచింది.

అతను నవ్వాడు. "పాలూ, పళ్ళూ, ఫలహారాలతో వశపరచుకుందుకు నేనానాటి పసివాడిని కాను. పదిహేడేళ్ళ వయసువాడిని...జీవితంలో దేనివిలువ ఎంతో తెలుసుకుంటున్నవాడిని. ."

"బాబూ !" ఆందోళనగా చూసింది






## గమనిక

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే వంటలా?" అంటారు. కనుక 'వంటలు' పంపేవారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని— సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

—సం.

# వెలుగు - నీడ

చంచల. ఆమె కళ్ళనిండా భయం...ఊహించని వైపరీత్యమేదో జరుగబోతున్నట్లు.

లతిక గుండెలు దడదడ కొట్టుకోసాగాయి తను భయపడినదే జరగబోతూందా?

వొద్దు వొద్దు...ఇప్పటి వరకూ చంచల అనుభవించిన శిక్షా శాపమూ చాలు ఆ అమాయకురాలు యింకా తపనా వేదనా భరించలేదు. బలహీనమయిన ఆమె గుండె యింక ఏ మాత్రపు బాధనూ సహించలేదు. కన్నీరు కార్చికార్చి ఆమె కన్నులూ, బాధపడి బాధపడి ఆమె గుండె— అలసిపోయాయి పూర్తిగా. ప్రాణంలేని డబ్బు తప్ప ప్రాణప్రదమయిన దేమీ మిగల లేదామెకు జీవితంలో. బ్రతికినన్నాళ్ళు బ్రతకదేమో ఆమె సంధ్య అలుముకుంటున్న యీ దశలోనయినా ఆమె మనసుకి కొంచెం సుఖమూ శాంతీ ప్రసాదించడమే నీకు న్యాయం కరుణామయుడా!

"ఇప్పుడు... నేను పుట్టిన పదిహేడేళ్ళకి మీకు నేనెందుకవసరమయ్యాను?" సూటిగా అడిగాడు.

అవసరమా!... గిలగిల కొట్టుకుంది చంచల హృదయం.

"క్షమించు బాబూ. అప్పటి పరిస్థితుల లాటివి." ఎలాగో అంది.

"ఇప్పటి పరిస్థితులు? మీ ఆశ్రయం నాకు ధృతరాష్ట్ర కౌగిలే ఔతుందే!"

"ఆ!" తల్లడిల్లిపోయింది చంచల.

"నేనిక్కడికి వొచ్చేముందు చాలా విషయాలు తెలుసుకునే వొచ్చాను. ఇది మీరు తెలుసుకోడం మంచిది.

మీరు నాకు తల్లెలా కాగలుగుతారు?"

"నిన్ను నేను కన్నాను —"

"మరి— నన్నానాడు శనిలా పీడలా ఎందుకు వొదుల్చుకున్నారు? నన్ను మీరెందుకు పెంచలేదు?"

వాడిఅయిన బాణంలా హృదయంలో గుచ్చుకుందా ప్రశ్న చంచలకు. "నేను... నేను... అజ్ఞానంకొద్దీ... చేసిన పొరపాటది... క్షమించవూ?" వేడుకుంది.

"అజ్ఞానమూకాదు, అమాయకత్వమూ కాదు. నేను గ్రహించగలను. నేను — కోరుకోని కొడుకును. విధిలేక నన్ను కన్నారు. నా జన్మ— మీ గ్లామర్‌కీ పేరు ప్రఖ్యాతులకీ, ధనసంపాదనకీ అడ్డం వొస్తుందనే దాన్ని అలా రహస్యంగా ఉంచారానాడు."

"బాబూ!"

"మనం — నిజాలే మాట్లాడుకుందాం. ఈనాడు మీకు నా అవసరం ఎంతయినా ఉంది మీకు వయసు మళ్లిపోయిందికనుక. అనురాగాలకీ అనుబంధాలకీ ప్రాతిపదిక అవసరంకావడం చాలా నీచం. కాదూ?" చంచల ఏడుస్తూంది.

"మీ కన్నీరు — నన్ను కరిగించజాలదు. మీరొకప్పుడు గొప్ప నటీమణి అని నాకు తెలుసు."

"బాబూ! — నిన్ను పెంచిన తల్లి తండ్రులు నీకన్నీ చెప్పి నీ మనసు విరిచేశారు—"

"కాదు. నిజంచెప్పి కళ్లు తెరిపించారు. వివేకవంతుణ్ని చేశారు. వాళ్లే లేకపోతే నేనే మయ్యేవాడినో.."

చంచల కన్నీరు మున్నీరుగా ఏడుస్తూంది. అంతకంటె ఆమె ఏం చేయగలదిప్పుడు?

"మనం — నిజాలే మాట్లాడుకుందాం. ఇది సినిమా కాదు, జీవితం కనుక. మీరు చేసిన పొరపాటుకి శిక్ష మీరే అనుభవించాలి ఇదే కదా న్యాయం?"

"బా. బూ."

"క్షమించండి నేను సూటిగానే తప్పు సున్నితంగా ఆలోచించలేకపోతున్నాను. మాటలకు తేనెపూతలు పూయలేకపోతున్నాను ఇవాళ మీరు నన్ను వెదుక్కుంటూ వొచ్చారంటే - కారణం — మీరు చెప్పినట్లు — అనుబంధమో అనురాగమో అనిపించడంలేదు నా మనసుకి"

"మరేమనిపిస్తూంది?" భయంగా అడిగింది చంచల

"అవసరం ... స్వార్థం ..."

భోరున ఏడ్వసాగిందామె — హృదయం పగిలినట్లు.

"మీ కన్నీరు నన్ను కరగించజాలదు. ఒకప్పుడు మీరు గొప్ప నటీమణి అని నాకు తెలుసు."

చంచలకి — అక్కడే -- ఆ క్షణంలోనే — తల నేలకేసి పగలకొట్టుకుని చచ్చిపోదామని పిస్తూందతని మాటలకు.

"నిన్ను పెంచినవాళ్లు అన్నీ చెప్పి నీ మనసు విరిచి వొదిలేశారు."

"లేదు నిజం చెప్పి— కళ్లు తెరిపించారు. వాళ్ల ఆశ్రయం లభించడం నా అదృష్టం. నన్ను వివేకవంతుణ్ని చేశారు. వాళ్లే లేకపోతే నేనేమయ్యేవాడినో. వారి గురించి తేలిక మాటలాడితే నేను సహించలేను. మీకూ వారికీ కల తేడా చెబుతాను. అర్థం చేసుకోండి ఆ విశాల హృదయులని. అవసరం కొద్దీ — అనుబంధాన్ని ప్రాతిపదికగా చేసుకుని మీరు నన్ను మీ వేపు లాక్కోవాలని ప్రయత్నిస్తున్నారు. నైతికంగా — మీకు నామీద హక్కులేదు. వారికుంది. అదీకాక నేను వాళ్ళని వొదులుకోలేను. నాకు తెలుసు — యిప్పుడు నేనుమిమ్మల్ని అమ్మా అని మీవెనుక వొస్తే నాకు వొరిగేదేమిటో. మద్రాసులో ఓ భవంతీ...మూడు నాలుగు లక్షల ఆస్తీ... నాకు దక్కుతాయి. నేను కోల్పోయే దేమిటో కూడా నాకు బాగానే తెలుసు."

"ఏమిటి?" భయంతో కూడిన కుతూహలం.

# త్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న **దీని ధర 30% తక్కువ.**

### ఇదిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది త్రిలో అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక




త్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృథాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా త్రిలోను వాడవచ్చు.

**త్రిలో** — మరింత ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

"సమాజంలో గౌరవం. మర్యాదస్తుల నీడ..."

"బాబూ !"

"క్షమించండి మరీ సూటిగా మాట్లాడి మీ మనసు బాధిస్తే. మీ భవనంలో కంటే — మా చిన్నయింట్లోనే నాకు సుఖశాంతు లెక్కువ. ముక్కూ మొహమూ తెలియని మిమ్మల్ని అమ్మగా భావించడానికీ పిలవడానికీ నాకెబ్బెట్టుగా ఉంటుంది అలవాటులేక నన్ను పెంచినవారినే తప్ప మరెవరినీ తల్లితండ్రులుగా భావించలేను. పదహారు, పదిహేడేళ్ళుగా వారితో పెనవేసుకు పోయిన నా జీవితాన్ని వారినుంచి బలవంతంగా విడదీసే వ్యర్థప్రయత్నం చేయకండి. మీకు నిరాశ కలిగిస్తే — క్షమించండి." అతను లేచాడు అదే చివరిమాట ఐనట్లూ, వెళ్ళిపోడానికి సిద్ధపడినట్లూ.

"బాబూ ." దుఃఖం ఆపుకోలేక బోరుమంది చంచల.

ఆమె ఆశలూ కలలూ అన్నీ ఒక్కసారి పగిలిపోయి — ప్రపంచం అంధకార బంధురంగా తోచింది.

"క్షమించండి మీ కన్నీరు నన్ను కట్టుకోనూలేదు, ఆపనూ లేదు. వాళ్ళు — నేను వెడితే తప్ప భోజనం చేయరు. పెంచిన ప్రేమ కన్న ప్రేమకంటే కూడా బలమైనదీ, ఘనమైనదీ."

# వెలుగు - నీడ

"లేదు బాబూ...లేదు. నిన్ను బంధించాలనీ కాదు బాధించాలనీ కాదు. నా జీవితం మొదటి నుంచీ భ్రమలలోనే గడిచింది. పొరపాట్లతోనే సాగింది. నటన— జీవితాన్ని వంచించింది. ఏది రాయో ఏది రత్నమో తెలుసుకోలేక పోయాను. జీవితం విలువ తెలుసుకోలేని నేను— వంచితను. జీవితంలో ఏమీ మిగుల్చుకోలేని నిర్భాగ్యురాలిగా... అధికారం పురస్కరించుకునికాక...అసహాయంగా . ఒకేఒక్క కోరిక కోరతాను. కాదనకు బాబూ..."

"ఏమిటి ?" సందేహిస్తున్నట్లు చూశాడు.

"ఒక్కసారి— నా చేతులలోకి రా."



వచ్చాడు.

"నన్ను కౌగిలించుకుని...మనస్ఫూర్తిగా... ఒక్కసారి... అమ్మా అని పిలువ్. చాలు. మరేమీ కోరను నిన్ను," దీనంగా... కళ్ళనిండా నీళ్ళతో... వెర్రిదానిలా నిలుచుంది చంచల.

అతనామెను దగ్గరగా తీసుకుని— మెల్లగా పిలిచాడు "అమ్మా..."

బా...బూ..."

ఒక్క క్షణం.

ఆమె అతని చేతులలోంచి జారి పోయింది.

నేలమీద కూలిపోయింది— చైతన్యం కోల్పోయిన కట్టెలా.

"అమ్మా !" అరిచాడతనేం జరిగిందో అర్థంకాక.

"అమ్మా!"అంటూ పరుగెత్తుకువొచ్చింది లతిక— హాలు నుంచి.

"అమ్మా..."

"అమ్మా..."

ఎవరి కేకకూ ఆమె కదలడం లేదు.

ఎవరి పిలుపుకీ ఆమె బదులివ్వడం లేదు.

కిటికీ అవతల —

ఆకాశంలో —

ఒక తార రాలిపోయింది.

**[అయిపోయింది]** ●

# హైదరాబాద్ నోట్‌బుక్

## తెలుగు బధిరభాషా మూలపురుషుడు థామస్ రెడ్డి :

వినికిడి వల్ల భాష వస్తుంది. శబ్దగ్రహణ శక్తిలేని పిల్లలు ఏ భాషా నేర్చుకోలేరు. దానికి కారణం వారు వినకపోవడమే. వినజాలరు గనుక అనుకరించలేరు. అందువల్ల మూగవారుగా పరిగణితులవుతారు. నిజానికి బధిరులంతా మూగవాను కారు. వారి భాషోచ్చారణావయవాలు సరిగానే వుంటాయి. కాని అనుకరణ వినికిడిపై ఆధారపడింది గనుక ఆ అవయవాల ప్రయోజనం వుండదు. 19వ శతాబ్ది ప్రథమ పాదంలో రెవరెండ్ థామస్ హాఫికిన్స్ గాలాడెట్ అనే అమెరికా సంఘసేవకుడు ఫ్రాన్సుకు వెళ్లి అబ్బిసికార్డ్ అనే బధిర విద్యావేత్త వద్ద సంజ్ఞా భాష నేర్చుకొని వాషింగ్టన్ నగరంలో ఒక పాఠశాల స్థాపించి బధిరులకు విద్య నేర్పడం ప్రారంభించాడు. అది నేడొక విశ్వవిద్యాలయమైంది; దాని శాఖలు అమెరికా అంతటా విస్తరించాయి. ఈ సంజ్ఞా భాషకాక పెదవుల కదలిక వల్ల బధిరులకు భాష నేర్పే అలెగ్జాండర్ గ్రహంబెల్ అసోసియేషన్ అనే సంస్థ కూడా వుంది. దీనిని 1890లో టెలిఫోన్‌ను కనిపెట్టిన బెల్ పేర స్థాపించారు. బెల్ పెదవుల కదలిక ద్వారా శిక్షణ ఇవ్వడానికి జీవితమంతా కృషి చేశారు పెదవుల కదలిక భాషలో అన్ని పదాలు తెలుపడం కష్టం సంజ్ఞా భాషవల్ల అన్ని పదాలను తెలుపవచ్చు. ప్రతి ఆంగ్లాక్షరానికి ఒక సంజ్ఞ వుంది గనుక అక్షరాలతో మనం పదాలను కూర్చినట్టే అక్షరసంజ్ఞలతో పదాలను, వాక్యాలు కూర్చవచ్చు. ఇది నేడు సర్వజనీనమైనట్టిది. అమెరికాలో ఇంగ్లీషు, స్పానిష్ భాషల తర్వాత మూడవ స్థానం సంజ్ఞా భాషకు ఉంది. ప్రతి విశ్వవిద్యాలయంలోను న్యాయస్థానంలోను సంజ్ఞా భాషానువాదకులూ ఉన్నారు మనదేశంలో చెవిటి వారి కోసం బ్రిటిష్‌వారి పరిపాలన కాలం నుంచి బ్రెయిన్‌వుడ్ పద్ధతి అమలులో వుంది. దానికన్నా సులభమయింది. సంజ్ఞాక్షర భాష శ్రీ థామస్ రెడ్డి మనదేశంలోని ఏడుకోట్ల మంది బధిరులను విద్యావంతులను చేయాలనే సదుద్దేశంతో అమెరికా సంజ్ఞాక్షర భాషను నేర్చుకొని వచ్చి, దానిని మన వర్ణమాలకు, భాషకు, సంస్కృతికి, ఆచారాలు, ఉచ్చారణ మొదలయిన వాటికి అనుగుణంగా సంస్కరించి నూతన భాషను సిద్ధపరచి నేర్పుతున్నారు. ఈ సంజ్ఞాలిపితో మనదేశంలోని అన్ని భాషలను బోధించవచ్చు. థామస్‌రెడ్డి స్వయంగా బధిరులు. కనుక బధిరుల సాధక బాధకాలు తెలిసిన వారు, అందువల్ల ప్రత్యేక పరిశోధన చేసి ఈ అక్షరమాలను తీర్చిదిద్దారు. ప్రస్తుతం ఆయన చింతారెడ్డి, విద్యాధరరెడ్డి [12], మాధవి [9] అనే ఇద్దరు పుట్టు బధిరులకు ఈ పద్ధతిలో ప్రయోగాత్మకంగా సంజ్ఞాభాష బోధిస్తున్నారు. వీరు రెండునెలలలో సంజ్ఞాలిపిని నేర్చుకొని పెద్దబాల శిక్షలోని పదాలను చక్కగా వ్రాయగలుగుతున్నారు. లెక్కలు చేయగలుగుతున్నారు; ఇంగ్లీషు, జనరల్ నాలెడ్జి, విజ్ఞానశాస్త్రం నేర్చుకుంటున్నారు విద్యాధర రెడ్డి తండ్రి శ్రీ దామోదరరెడ్డి తన కుమారుణ్ని ఎన్నో బధిర పాఠశాలలకు పంపి, ప్రయోజనం కనిపించక నిరాశపడి థామస్‌రెడ్డికి అప్పగించారు. రెండు మూడు నెలలకే కనిపించిన అభివృద్ధికి ఆశ్చర్యపడి ''బాబు యొక్క ప్రోగ్రెస్ గురించి అందరికీ చెప్పాను చాలా ఆశ్చర్యపడ్డారు కండ్లతో చూచిన నేనే చాల ఆశ్చర్యపడగా చూడనివారు విని ఆశ్చర్యపడడంలో గొప్పేమీ కాదు గదా!'' అని ఒక ఉత్తరంలో వ్రాశారు థామస్‌రెడ్డి సూర్యాపేట సమీపంలోని చివ్వేముల గ్రామంలో 1944 డిసెంబర్ 5న జన్మించారు 1966లో ఎల్. ఇ. ఇ. పట్టా పొంది, అలింద్ పవర్ కేబిల్స్ అనే సంస్థలో సేల్స్‌ఎగ్జిక్యూటివ్‌గా ఉన్నారు. తర్వాత పి. డబ్ల్యు. డి.లో కొన్నేళ్లు పని చేశారు. 1968లో గ్రహచారవశాత్తు బధిరత్వం వచ్చింది. అమెరికాలోని కెన్సాస్ నగరంలో వున్న టెంపుల్ డెఫ్ కాలేజీలో రెండేళ్లు సంజ్ఞా భాషలో శిక్షణ పొందారు— పెదవుల కదలిక, సంకేతాలు, హావభావాలు — అనే సర్వ సంభాషణలో నిష్ణాతులయ్యారు. రాష్ట్ర వికలాంగ ఆర్థిక సహాయ సంస్థ మేనేజింగ్ డైరెక్టరు డాక్టరు రంగారావు, డైరెక్టర్ శ్రీ గోపాలశాస్త్రి సమక్షంలో తన బోధన పద్ధతిని ప్రదర్శించారు. ''నేను అమెరికాలో పెక్కుచోట్ల ప్రసంగించాను. అక్కడ నన్ను ప్రొఫెసరుగా రమ్మన్నారు కనీసం నెలకు ఐదువేల డాలర్లు జీతం వస్తుంది. కాని, నా లక్ష్యం భారతీయ పద్ధతిలో ఆశ్రమ పాఠశాల స్థాపించడం. దానికోసం ఉపాధ్యాయులకూ శిక్షణ ఇస్తున్నాను. అమెరికాలో 200 బధిర పాఠశాలలు చూచాను, ప్రసంగించాను. వచ్చే ఆగస్టులో జపాన్‌లో జరిగే బధిర మహాసభకు వెళ్లుతున్నాను'' అన్నారు నాతో రెడ్డి. ఆయన సతీమణి శ్రీమతి కృపావతికూడ విద్యావతి. బధిర శిక్షణలో ఆయనకు అన్ని విధాలతోడుగా వుంటారు ఈయన ప్రయోగాత్మక బధిర పాఠశాల చిరునామా ఎఫ్ఫా–థా మినిస్ట్రీస్, 12-14 గణేశ్‌నగర్, రామంత్‌పూర్, హైదరాబాద్--13. ఏమిటీ పేరు ? అన్నాను క్రీస్తుదేవుడు ఒక బధిరుని చెవులలో వేళ్ళు పెట్టి తెరవ బడుగాక ! — అన్నారు. అతనికి చెవులు తెరుచుకొన్నాయి ఎఫ్ఫా — థా అనే గ్రీకు మాటకు తెరువబడుగాక ! — అని అర్థం. కనుక ఈ పేరు పెట్టాను—అన్నారు. లక్ష్యశుద్ధి ప్రయత్నశుద్ధి నిండుగాగల శ్రీ థామస్‌రెడ్డి సత్సంకల్పం మూడు పూవులు ఆరవైకాయలుగా వృద్ధి పొందడం నిశ్చయం. తెలుగులోనేకాక భారతంలో బధిర సంజ్ఞాలిపి భాషకు మూల





అ



ఆ

## హైదరాబాద్ నోట్‌బుక్

పురుషులైన థామస్‌రెడ్డి భావిచరిత్రలో శాశ్వతు లవుతారు.

**ఉపశ్రుతి :**

దూరదర్శన్‌లో చక్రం గురించి పాట విని పిస్తూంది. చక్రం చక్రం చక్రం, గిరగిర తిరిగే చక్రం, బరువును మోసే చక్రం— అని. పాట శ్రద్ధగా వింటున్న నాలుగేళ్ళ ఉదయమడు ఆ పాటకు 'చెన్నారెడ్డి చక్రం' అని మరొక చరణం తగిలించాడు. ఔరా, రాజకీయ ప్రచార ప్రభావం! అనుకున్నాను.

—తిరుమల రామచంద్ర ★

## ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

### మార్పు

"మార్పు" కథ నాకు బాగా నచ్చింది. కులాంతర, మతాంతర వివాహాల వల్ల వరకట్న సమస్య చాలా వరకు తీరుతుందని నా నమ్మకం. శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్‌గారు తమ "మార్పు" కథ ద్వారా నా నమ్మకానికి మద్దతునిచ్చారనిపిస్తోంది.

కుమారి పింగళి రామలక్ష్మి, పాతగాజువాక.

### పుష్పలోయ

23–3–84 సంచికలో కేప్టెన్ షేక్ మౌలాలీగారు "పుష్పలోయ" గురించి చాలా చక్కగా వివరించారు. అక్కడి ప్రకృతి దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు అభివర్ణించారు. శ్రీ మౌలాలీగారికి మా అభినందనలు.

వి. డేవిడ్‌రాజు, ఏలూరు.

### సరాగమాల

అస్తమానం బూతులంటూ విమర్శించ కండి అని వస్తున్న ఉత్తరాలు చూస్తుంటే పాఠకుల (శ్రోతల) లో కొందరు భుజాలు తడుముకుంటున్నట్లు అనిపిస్తుంది నాకు. మీరే మంటారు ?

డి. రవికుమార్, కాకినాడ

★ ఏమీ అనను !

వి. ఎ. కె. మద్రాసు ★


Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor: S. Radhakrishna.

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

# మధురమైన భావనలను స్పందించే సిల్కులు

సంప్రదాయానికి అద్దంపట్టే అందమైన ఆప్కో వస్త్రాలు మిమ్ములను ముగ్ధులను చేస్తాయి. ఆప్కో వస్త్రాల విస్తృత శ్రేణి- షర్టింగులు, డ్రెస్-మెటీరియల్స్, చీరలు, తయారీ-దుస్తులు మరియు గృహోపకర వస్త్రాలు.

ఆప్కో

చేనేతలు




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్-500029